# ఒక్క పోస్టుకార్డు చాలు!...

మరియు, నా మిత్రులు
చాలమంది వివేకానంద
'ఇన్స్టిట్యూట్' లో పోస్టు
ద్వారా ఆంగ్లభాషాభ్యాస
ము లో చేరి అభివృద్ధి
చెంది యున్నారు నేను
కూడ మీ ఇన్స్టిట్యూట్
నందు చేరదలచాను కావున
వెనుక నున్న నా చిరునామా
కు మీ వివరాలు మరియు
Application form ను
పంప కోరుతాను ఇట్లు
G. Sathya




మీకూ, మీ అభ్యుదయానికీ మధ్యవున్న దూరం ఒక పోస్టుకార్డే అని మేమంటే మీకు విచిత్రంగానూ తమాషాగానూ వుండవచ్చు. కానీ అది నిజం!

మీ అభ్యుదయానికి ఇంగ్లీషుభాష తెలియకపోవటమే ఒక కారణమైతే...

ఇతరులు ఇంగ్లీషులో మాట్లాడుతుంటే మీకు అర్థమైనా కూడా వాళ్ళకి ఇంగ్లీషులోనే సమాధానాలు చెప్పలేక పోతున్నామే అని మీరు మానసికంగా బాధపడ్తుంటే...

ఇదివరకూ యెన్నో మార్గాలలో ప్రయత్నించినా, యెన్ని పుస్తకాలు చదివినా, ఇంగ్లీషులో మాట్లాడలేక పోతున్నామే అన్న విసుగు మీలో పుట్టివుంటే...

మీరు యెదురుచూసే అభ్యుదయాన్ని సాధించటానికి ఒక పోస్టుకార్డు వ్రాస్తేచాలు.

నిజమే!

ఇంగ్లీషులో వ్యాకరణ తప్పులులేకుండా వుత్తరాలు, వ్యాసాలు వ్రాయటానికీ, చక్కగా, సరళంగా మాట్లాడటానికీ మీరు చేయవలసిన ముఖ్య పని ఒక్కటే. మీ కోర్కెను వివరంగా తెలుపుతూ ఒక పోస్టుకార్డుని పోస్టు చెయ్యండి. మీ పోస్టుకార్డు అందిన వెంటనే ఈ వివేకానందా ఇన్స్టిట్యూట్‌వారు మీకు కావలసిన వివరాలను, మీరు తీసుకోవలసిన అభ్యాసాలనన్నింటినీ పూర్తిగా అందిస్తారు.

ఎక్కడికి బయలుదేరారండి? పోస్టుకార్డు కొనటానికా? అయితే మీ అభ్యుదయానికైన మొదటి మెట్టు ఎక్కారు! శభాష్!!

మీ కోర్కెను పోస్టుకార్డుద్వారా వివరంగా తెలిపి మీ యొక్క పూర్తి చిరునామాను కూడా తెలుపుతూ వెంటనే పోస్టు చేయడం మరువకండి సుమా!

మీరు పోస్టు చేయవలసిన మా చిరునామా-

**VIVEKANANDHA INSTITUTE**

**POST BOX NO: 4986, 9, NATESAN ST., T.NAGAR, MADRAS-17.**

# ULIPలో ప్రతి సంవత్సరం-రూ. 4,800 పది సంవత్సరాలకు రూ. 1,13,156+ అవుతుంది!*

* యు.టి.ఐ. యొక్క యూనిట్ అనుబంధిత భీమా పథకం 1971 (ULIP) వల్ల 20% వరకూ మీకు పన్ను పొదుపు లభ్యమౌతుంది. ప్రతి సంవత్సరం రూ. 6000/-ల మదుపుపై - మీరు రూ. 1200/- పొదుపు చేస్తారు. ఆ విధంగా పది సంవత్సరాలకు ప్రతి సంవత్సరం రూ. 4800/- చొప్పున ఫలప్రదమైన మీ చెల్లింపులు అధికమౌతూ వుంటాయి.
'15 సంవత్సరాల పథకం'లో ఒకో సంవత్సరానికి రూ. 4000/-లు మదుపు చేయవలసి వుంటుంది. (పన్ను పొదుపు రూ. 800/-, ఫలప్రదమైన చెల్లింపు రూ. 3200/-)

దీనిపై - ULIP - పన్ను పొదుపుతోపాటు, యూనిట్స్ ద్వారా లభించే నమ్మకమైన రాబడి, జీవిత భీమా ఆకస్మిక ప్రమాదాల కవరు మరియు మెచూరిటీ బోనస్ ప్రతిపాదిస్తోంది. సురక్షిత మదుపుకు అవకాశం ఏర్పరచడమేకాక - ఏ ఇతర పథకమూ ప్రతిపాదించని బహువిధ లాభాలను ఈ పథకం అందజేస్తోంది.

ULIP గురించి, యు.టి.ఐ. యొక్క ఇతర పథకాలకు సంబంధించిన వివరాలకు - మా ఏజెంట్లు, ముఖ్య ప్రతినిధులు, ఎఎన్‌జడ్ గ్రిండ్లేస్ బ్యాంక్, స్పెన్సర్ & కో., స్టాప్ & షాప్ చెయిన్ స్టోర్స్ (మద్రాసు) లేదా పంచవటి సూపర్ మార్కెట్ (హైద్రాబాద్)ను సంప్రదించండి.

యూనిట్ అనుబంధిత భీమా పథకం



**UNIT TRUST OF INDIA**

(A Public Sector Financial Institution)
H.O. Bombay 400 020.

**Regional Office:** 45, Second Line Beach, Madras 600 001. Ph: 587433, 580938.
**Branch Offices: Hyderabad:** 203/204, Moghul Court Complex, II Floor, Basheer Bagh, Hyderabad 500 001. Ph: 240030
• **Vijayawada:** 29-3-12, Venkateshwara Rao Street, Near APCO Bhavan, West of Rehman Park, Governorpet, Vijayawada 520 002. Ph: 63964.

**Our Chief Representatives in Andhra Pradesh** □ ADILABAD • **Sanwal Ram Sah,** Ph: 91 (PP) □ ANANTAPUR • **V.L. Narayana,** 3/217, 3rd Road, New Town, Anantapur 515 004 □ CUDDAPAH • **A.R. Krishna Reddy,** Ph: 2701 □ EAST GODAVARI • **P. Venkataramana,** Ph: 76047 □ GUNTUR • **K.B. Tilak,** Ph: 24964, 31839 □ KARIMNAGAR • **T. Ahalya Sreenivas,** Ph: 312 □ KHAMMAM • **G. Amarnath,** Ph: 8711, 8709 □ KURNOOL • **T. Seetharamaiah Setty,** Ph: 22335 (PP) □ MEDAK • **P.V. Krishna Reddy,** Ph: 2820 □ MEHABUBNAGAR • **N. Venkatanarayana,** H. No. 10-87, B.R. Compound, Jadcherla 509 301 □ NALGONDA • **M. Shankar Gupta,** Ph: 545 □ NELLORE • **A. Sathyanarayana,** Ph: 22002 □ NIZAMABAD • **D. Narasaiah,** H. No. 5-5-18, Behind Tahsil Office Road, Khaleelwadi, Nizamabad 503 003 □ PRAKASAM • **M.V. Ramanaiah,** Ph: 3337, 3244 □ RANGAREDDY • **S. Veeraraghavalu,** Govinda Krupa, 26-75, Safilguda, Secunderabad 500 047 □ VISAKHAPATNAM • **C. Narayanaswamy,** Ph: 63116 □ VIZIANAGARAM • **M.S.N. Sarma,** Ph: 2666 (PP) □ WARANGAL • **B.S.N. Murthy,** Ph: 8631 □ WEST GODAVARI • **Y. Somasundara Rao,** Ph: 2440.

Sista's-UTI 1537.90TE A/R




## మతగురువు శూరత్వం

దట్టమైన అడవిమార్గంలో ధనుర్బాణాలు ధరించి వడివడిగా నడుస్తున్నాడో బందిపోటు. చిన్నగా ఆధ్యాత్మిక గీతాలేవో కూనిరాగం తీస్తూ ఆ వెనుకే నడుస్తూ వస్తున్నాడో మతగురువు. ఇద్దరూ ఎవరి మానాన వారు నడుస్తున్నారే



తప్ప ఒకర్నొకరు పట్టించుకోవటంలేదు.

అంతలో-

హఠాత్తుగా ఓ పెద్దపులి గాండ్రుమని గర్జిస్తూ వచ్చి వారి మార్గానికి అడ్డంగా నిలిచింది. దాని వెనుకే బిలబిలమంటూ వచ్చిపడ్డాయి కొన్ని పులి పిల్లలు.

ఈ హఠాత్పరిణామానికి విస్తుబోయాడు బందిపోటు. అయినా వెంటనే తేరుకుని అంబులపొదినుంచి ఓ బాణాన్ని తీసి పులిపై విల్లెక్కుపెట్టాడు. అయినా పులి బెదరలేదు. గుర్రుమంటూ కోపంగా చూస్తూ పోరాటానికి సిద్ధమైంది.

పులిని చూడ్డంతోనే ప్రాణాలుపైనే పోయాయనుకున్న మతగురువు అది తిరగబడ్డం చూసి భయంతో గజగజవణికిపోయాడు. చేసేదిలేక తెగించిన ధైర్యంతో తన చేతిలో ఉన్న పుస్తకాల్ని పులి మీదికి విసరికొట్టాడతను.

అంతే!

అప్పటివరకు కయ్యానికి కాలు దువ్విన పులి తోకముడుచుకుని అడవిలోకి పరుగుతీసింది. తల్లి పరుగెత్తడం చూసి దాన్నే అనుసరించాయి పులికూనలు.

అవన్నీ ఒక సురక్షిత ప్రదేశానికి చేరుకున్నాక-

''అమ్మా... బాణాలు ఎక్కుపెట్టిన బందిపోటుని ధైర్యంగా ఎదిరించి నిలబడ్డదానివి ఆ మతగురువు పుస్తకాలు విసరడంతోనే అలా పరుగెత్తుకొచ్చాశావేమిటి?'' సందేహాన్ని వ్యక్తం చేసిందొక పులికూన.

''బందిపోటు వీరోచితంగా పోరాటానికి తలపడ్డాడు గనుక నేనూ సిద్ధపడ్డాను. కాని మతగురువు ప్రాణాలుపోయే సమయంలో కూడా చందావేయమంటూ రశీదు పుస్తకాలు నామీద పడేశాడు. ఈ చందాల తలనొప్పి మనమెక్కడ పడ్తాం? అందుకే అక్కణ్ణించి ఉడాయించాను'' మందహాసం చేస్తూ వివరించింది పెద్దపులి.




# ఊహాస్వర్గం

చియాంగ్‌కి ఓనాటి సాయంకాలం వీధిలో నడుస్తుంటే ఒక కోడిగుడ్డు దొరికింది. అంతే! వెంటనే వెర్రి ఆనందంతో ఇంటికి పరుగెత్తి, "ఇన్నాళ్లికి మన అదృష్టం పండిందే భార్యామణీ! ఇక చూడు మన దరిద్రమంతా తీరిపోయి నట్లే" అంటూ భార్యని ఎత్తుకొని గిరగిరా తిప్పేశాడు.

"ఏమిటి... ఏంజరిగింది?" అంది అతని భార్య కుతూహలంగా.

"ఇదుగో... ఇటు చూడు నీకే తెలుస్తుంది" అంటూ తనచేతిలోని కోడిగుడ్డును ఆమెకు చూపించాడు చియాంగ్.

భార్యకేమీ అర్థంగాక అయోమయంగా చూస్తుండటం గమనించి చియాంగ్-

"ఓసి పిచ్చిముఖమా! ఈ కోడిగుడ్డే మన దశ మార్చబోతోంది. దీన్ని రేపే తీసుకెళ్లి పక్కింటివాళ్ల కోడిపెట్టతో పొదిగిస్తాను. పిల్లవుతుంది. పెరిగి పెద్దదై కొన్నాళ్ల తర్వాత ఆ పిల్లే తిరిగి గుడ్లు పెడుతుంది. ఆ గుడ్లన్నీ పొదిగించామనుకో... బోలెడన్ని కోళ్లవుతాయి. మళ్లీ అవన్నీ గుడ్లు పెడతాయి. ఆ గుడ్లన్నీ తిరిగి కోళ్లు... ఇలా ఐదారేళ్లు గడిచేసరికల్లా మనకో పెద్ద కోళ్లఫారం తయారవుతుంది. దానిమీద వచ్చే ఆదాయాన్ని వడ్డీలకు తిప్పుతాను. వడ్డీలకు వడ్డీవేసి లక్షలు సంపాదిస్తాను. పొలాలు కొంటాను. మేడలు మిద్దెలు కొంటాను. మనం కాలుకిందపెట్టే అవసరం లేకుండా ఇంటినిండా నౌకర్లూ, చాకర్లు ఉంటారు. జమీందారీ ఫాయిదాగా దర్జాకోసం ఓ ఉంపుడుగత్తెను తెచ్చుకుంటాను- దానికో మేడను..."

"అంతటితో ఆపు"

ఆనందంగా చెప్పుకుపోతున్న భర్త వాక్ప్రవాహానికి సడెన్ బ్రేక్ వేసింది భార్య.

"ఏం నాయనా... నీ ముఖానికి నేను సరిపోలేదా? ఇంకా ఉంపుడుగత్తె కావాల్సొచ్చిందా! నీ రోగం కుదురుస్తానుండు" అని అతని చేతిలోని గుడ్డును లాక్కొని అతని నెత్తికేసి కొట్టిందామె కోపం పట్టలేక.

గుడ్డుతోపాటు తన ఊహాసౌధాలుకూడా పగిలిపోవడంతో తట్టుకోలేకపోయాడు చియాంగ్. వెంటనే ఆమెని కోర్టుకి ఈడ్చుకుపోయాడు.

"నా కుటుంబాన్ని, ఆశల్ని... సర్వస్వాన్నీ ఈ రాక్షసి నాశనంచేసింది మిలార్డ్! దీనికి మరణశిక్షవేసి నాకు న్యాయం జరిపించండి" అంటూ జడ్జికి మొరపెట్టుకున్నాడు చియాంగ్.

తర్వాత జడ్జి కోరినమీదట కోడిగుడ్డు దొరకడంనుంచి తదుపరి జరిగిన సంఘటనలన్నింటినీ సవివరంగా వివరించిచెప్పాడతను.

అంతా విన్న జడ్జి-

"నిజమే... ఈమె చేసింది అపరాధమే...



ఒకే ఒక్కదెబ్బతో ఇతని జీవితాన్ని సర్వనాశనం చేసినందుకుగాను ఈమెకు ఉరిశిక్ష విధిస్తున్నాను" అంటూ తీర్పుచెప్పాడు.

చియాంగ్ భార్య లబలబలాడింది.

"అసలు అక్కడ నేను నాశనంచేసేందుకు ఏమీలేదు మహాప్రభో... ఆ మేడలు మిద్దెలు ఆస్తిపాస్తులన్నీ ఊహేగదా- దానికే నాకింత పెద్ద శిక్షా" అని మొత్తుకుందామె.

"అలాంటప్పుడు ఉంపుడుగత్తెకూడా అతని ఊహేగదా దానికే నువ్వింత ఉడుక్కుని మొగుడితో దెబ్బలాడ్డమెందుకు?" అన్నాడు జడ్జి మందహాసం చేస్తూ.

చియాంగ్ భార్య సిగ్గుతో తలవంచుకుంది. జడ్జి కేసును కొట్టేశారు. చియాంగ్ భార్యవంక చూసి చిలిపిగా కన్నుగీటాడు.



# తృప్తి?

చాంగ్‌హూ మహా టక్కరి పిల్లవాడు. బడి దొంగ. ఏదో వంకపెట్టి ప్రతిరోజూ బడిమానేయడం వాడికలవాటైంది. ఆ రకంగా చాలాకాలంపాటు ఉపాధ్యాయుల్ని బురిడీ కొట్టించగలిగాడు.

అయితే ఒకనాడు వాడి బండారం బయటపడిపోయింది. విషయం హెడ్మాస్టరుదాకా వెళ్ళింది. ఆయన మనిషి మంచాడేగాని చండశాసనుడు. విద్యార్థులు చేసే ఏ చిన్న తప్పునీ సహించడనీ, గొడ్లని బాదినట్లు బాదేస్తాడని ఆ ఊళ్ళో ఆయన్ని ఎరిగినవాళ్ళంతా అనుకుంటారు.



వెంటనే కుర్రాళ్ళని పంపి చాంగ్‌హూని ఉన్నఫళాన ఈడ్చుకుంటూ రమ్మని ఆదేశాలు జారీచేశాడాయన. బెత్తంచేత్తోపుచ్చుకుని వాడు వచ్చేంతవరకూ తన గదిలో పచార్లు ప్రారంభించాడు. చాంగ్‌హూ మీద వచ్చిన ఆరోపణలన్నీ స్ఫురణకువచ్చి ఆయన కోపంతో ఊగిపోతున్నాడు.

కాసేపటిలో చాంగ్‌హూని వెంటబెట్టుకుని రానే వచ్చారు పిల్లకాయలు. వచ్చీరావడంతోనే అతి వినయంగా గురువుగారి కాళ్లమీదపడి నమస్కరించాడు చాంగ్‌హూ.

తర్వాత మెల్లగా పైకి లేస్తూ, ''మన్నించండి... దారిలో ఓ వెయ్యి బంగారు నాణాలు దొరికాయిరోజు. అందుకే కొంచెం ఆలస్యం అయింది'' అన్నాడు తొణక్కుండా.

బంగారు నాణాల మాట వినడంతోనే గురువుగారి కోపం చప్పున చల్లారిపోయింది. అయినా పైకి బింకంగా-

''ఎక్కడ దొరికాయి... ఏమిటి కత?'' అన్నాడు సీరియస్‌గా.

''నిధిసార్... భూగర్భనిధి దొరికింది'' నమ్మకంగా చెప్పాడు చాంగ్‌హూ.

గురువుగారి ముఖ కవళికలు మారిపోయాయి.

''అద్సరే... ఇంతకీ ఆ నాణాల్ని ఏంచేద్దామనుకుంటున్నావు?'' కుతూహలంగా అడిగాడాయన.

''ఏముందిసార్... మా కుటుంబం పరిస్థితి మీకు తెలియంది కాదుగదా! ఓ ఐదొందల నాణాలతో పొలంకొందామనుకుంటున్నాం... రెండొందలుపోసి ఉంటానికో కొంప కొనుక్కుందామని''

''వెరీగుడ్... ఆ మిగిలినది?''

''ఓ నూట యాభై నాణాలనువయోగించి ఇంట్లోకి ఫర్నిచర్...''

''భేష్... తర్వాత?''

''ఓ వంద నా చదువుల నిమిత్తం ఖర్చుచేద్దామని''

''చాలా బావుంది... తర్వాత''

''ఆఁ... ఇంకేముంటుందిసార్... చదువుచెప్పి ఇంతవాణ్ణి చేశారు మీరు. ఆ మిగిలిన యాభై నాణాలు గురుదక్షిణగా మీకు సమర్పించుకుందామని నా ఆలోచనసార్. మా అమ్మానాన్నలు కూడా అందుకు ఒప్పుకున్నారు'' వినయంగా చెప్పాడు చాంగ్‌హూ.

హెడ్మాస్టారి ముఖం మతాబులా వెలిగిపోయింది. చేతిలోని బెత్తాన్ని గదిమూలలకు గిరాటువేసి, ''ఎవర్రా అక్కడ? మన చాంగ్‌హూకి నాలుగు చాక్లెట్లు తీసుకురండి'' అని లోపలికి ఓ కేకపెట్టి-

''అరే... ఇంకా అలా నిల్చునే ఉన్నావేంరా చాంగ్... రా - కూర్చోకూర్చో ''అంటూ హడావుడి చేశాడు.





ఇంతలో చాక్లెట్లూ, వాటితోపాటు కాసిన్ని స్వీట్లూ వచ్చాయి. గురుశిష్యులిద్దరూ మెల్లగా వాటిని ఆరగించడం మొదలెట్టారు.

"ఆఁ... అద్సరే చాంగ్... ఇంతకీ ఆ నాణాలు జాగ్రత్తగా దాచిపెట్టావా? రోజులసలే బాగో లేవు. జాగ్రత్తసుమా! అవునూ... మనలో మన మాట- ఇంతకీ వాటినెక్కడ దాచిపెట్టావ్?" ఆత్రంగా అడిగాడు హెడ్మాస్టర్.

"ఏమో... తెలీదుసార్" మిఠాయిలు తింటూ నింపాదిగా చెప్పాడు చాంగ్.

"అదేమిటి?" తెల్లబోయారు గురువుగారు.

"అవును సార్... అదే సమయంలో మా అమ్మ నిద్రలేపేసింది"

"అంటే నిధి దొరకడం కలా...?" జావగారి పోతూ అన్నారు గురువుగారు.

కోపం మళ్ళా నర్రున నసాళానికి అంటబో యింది. అయినా తనని తాను సంబాళించు కుంటూ "సరేలేరా... బంగారం దొరికితే గురు వుగారికి కొంతలో కొంత ముట్ట చెప్పాలని కలలో కూడా నువ్వు అనుకున్నావ్- అదేవదివే లు; ఆ మాత్రం అభిమానం నీకుండటం చాలా సంతోషంగా ఉంది. పో... చక్కగా చదూ కో" అంటూ లోనికి దారితీశారు అయ్యావారు.

తనని గురువుగారు ఎలా తంతారో చూద్దా మని గుమ్మంచాటున నక్కిన మిత్రబృందాన్ని వెక్కిరిస్తూ చాక్లెట్లు జేబులో వేసుకుని బయట కి వచ్చాడు చాంగ్‌హూ.

## ముందుచూపు

కొత్త సంవత్సరం వేడుకలు జరుపుకు నేందుకు డబ్బు పుష్కలంగా లేకపోవడంతో ఓ కొత్త ఎత్తు ఎత్తాడోటక్కరి. వెంటనే ఆ దారిన పోతున్న ఒక మంగలిని పిలిచి క్షవరం చేయ మన్నాడు.

అతడాపనికి ఉపక్రమించబోయేంతలో మళ్లీ తనే- "ఆగాగు... ముందు నాకనుబొమ లు రెండూ తీసేయ్" అని చెప్పాడతను.

సరే అని మంగలి ఒక కనుబొమ తొలగించా డో లేదో కెవ్వున కేకపెట్టి, "ఏమిటీవని? నీకస లు బుద్ధుందా? క్రాపు చేయమంటే కనుబొమ లు గీకుతావా?" అంటూ తిట్లదండకం ప్రా రంభించాడు.

నలుగురూ పోగయ్యారు.

పాపం మంగలి చెప్పేది వినకుండా అంద రూ తలోమాట అనసాగారు. ఇంకెవ్వరూ వీడితో పనిచేయించుకోగూడదని తీర్మానాలు కూడా చేసేయడం మొదలెట్టారు. పాపం కళ్ల నీళ్ల పర్యంతమైపోతున్నాడు మంగలి.

"పదవద కొత్వాలు దగ్గరకి. అక్కడే నీ అంతుతేలుస్తాను" అంటూ మంగలిని బల వంతపెట్టసాగాడు టక్కరి.

కొత్వాలు అనేసరికి భయపడ్డ మంగలి మూడువందల నాణాలు నష్టపరిహారంగా చె ల్లించుకుంటాననీ, తనను వదిలేయమనీ ప్రా



ధేయపడ్డాడు. టక్కరి బలవంతంమీదే పైకం పుచ్చుకున్నట్లు నటించి వాణ్ని వదిలేశాడు.

ఆ సొమ్ముతో పండుగ హాయిగా జరిగిపో యింది.

తర్వాత-

ఒకే ఒక కనుబొమతో వికారంగా కనబడుతు న్న అతన్ని చూసి- "అలా ఉంటే చాలా అసహ్యంగా ఉంది. ఆ రెండోది కూడా తీసేయ రాదూ" అని చిరాకుపడిందతని భార్య.

"వెర్రిదానా... నీకసలు బుర్రలేదే! ఈ రెండో కనుబొమని దీపాలపండుగ కోసం అట్టేపెట్టేను. ఆనాటి ఖర్చుకి ఇదే పెట్టుబడి" అన్నాడు భర్త నవ్వుతూ.

పాపం నిర్ఘాంతపోయిందా భార్యామణి.

## కోడికూర

ఏదో శుభసందర్భాన్ని పురస్కరించుకుని ఒక పంతులుగారు తన విద్యార్థులందరికీ విందుచేశాడు.

విందుకుగాను ఒకే ఒక్క కోడిని కోయించి, బుట్టెడు బంగాళాదుంపలతో కలిపి కూర వండించాడా పెద్దమనిషి. కూర బ్రహ్మాండంగా ఉందని అతిథులంతా మెచ్చుకున్నారు.

అదంతా తన ప్రతిభేనని మురిసిపోయిందా కోడిఆత్మ. అదే విషయాన్ని స్వర్గంలోనున్న దేవుడితో చెప్పుకొని మరీ సంతోషపడిందా పిచ్చితల్లి. దేవుడు కూడా ''ఔరా'' అనీ ఆ కోడి గొప్పతనానికి ఆశ్చర్యపోయాడు.



అంతలో బంగాళదుంపల ఆత్మలు కూడా అక్కడికిరానేవచ్చాయి. కోడి మాటల్ని కొట్టిపారేస్తూ అవి ''కూర రుచిగా ఉండటానికి కారణం మేమేగానీ ఈ కోడికాదు ప్రభూ'' అని విన్నవించుకున్నాయి.

తర్వాత వాటికి మాటామాటా పెరిగింది. నువ్వెంతంటే నువ్వెంతని ఒకళ్లనొకళ్లు వాదించుకున్నాయవి.

దేవుడికేం చెప్పాలో తోచలేదు.

అతిథుల్ని రహస్యంగా వెంటాడి కూర రుచికి కారకులెవరో తెలుసుకుందాం రమ్మని వాటన్నింటినీ వెంటపెట్టుకొని భూలోకానికి వచ్చాడాయన.

గురువుగారి ఇంటినుంచి బయలుదేరి తమతమ ఇళ్లకు చేరుకుంటున్న శిష్యుల మాటల్ని వింటూ అదృశ్యరూపంలో వారిని అనుసరించింది దేవుడి బృందం.

''ఏం కోడికూరరా నాయనా? అసలందులో మాంసం ముక్క ఒక్కటికూడా కన్పించలేదు. ఉన్న బంగాళాదుంపలు కూడా చప్పగా ఏడ్చాయి- ఛూ'' అన్నాడో శిష్యుడు.

''నిజమేరా... కూరబాగోలేదంటే గురువుగారికి కోపంవచ్చి మార్కులు కోసేస్తారని రుచిగా ఉందన్నానే తప్ప మరేంలేదు'' అన్నాడింకొకడు.

తక్కిన శిష్యులంతా అవునవునంటూ అతనికి వంతపాడారు. అది విని అటు కోడి ఆత్మతోపాటూ ఇటు బంగాళదుంపల ఆత్మలూ సిగ్గుతో ముడుచుకుపోయాయి.

అప్పుడు ''నేను మాత్రం గురువుగారికి భయపడి కూర బాగుందనలేదు'' అన్నాడొక శిష్యుడు మెల్లగా.

''ఏమిటేమిటీ? నీకు ఆ కూర అంతగా నచ్చిందా చిట్టి తండ్రీ?'' వెటకారం చేశారు అతని మిత్రులు.

కోడీ, దుంపలు కుతూహలంగా అతడేంచెబుతాడోనని చెవులు రిక్కించి మరీ వినసాగాయి.

''అవును... నచ్చింది! ఎందుకంటే దాన్ని వండింది ఓ అందాల రాశి గనుక. అది వండిన గురువుగారి పెద్దమ్మాయి తన చేత్తో విషమిచ్చినా నాకది అమృతతుల్యమే'' అన్నాడతను తాపీగా.

కోడి, బంగాళదుంపలు ముఖముఖాలు చూసుకుంటూ ఉండిపోయాయి. దేవుడుగారు చిరునవ్వు నవ్వారు.

## సత్కారం

''ఒకే ఒక్క రాత్రిలో మీ గూని మటుమాయం. విల్లులా వంగిపోయినా, స్ప్రింగులా ముడుచుకుపోయినా సరే, ఒకే ఒక్క చికిత్సతో మీ నడుముల్ని సాఫీచేసే పూచీ మాది... వెంటనే సంప్రదించండి'' అంటూ పత్రికలలో వచ్చిన ప్రకటన చూసి ఆశగా వెళ్ళి ఆ డాక్టర్ని కలిశాడో పెద్దమనిషి.

పరమవికారంగా కన్పిస్తున్న అతని గూనిని

తెల్లారేపాటికల్లా మటుమాయం చేస్తానని భరోసాయిచ్చాడు డాక్టర్. ఆనందంతో ఇంటిల్లిపాదికీ ఈ విషయం చెప్పి ఆ రాత్రికి రాత్రే వైద్యం నిమిత్తం డాక్టర్ దగ్గరికి వెళ్ళిపోయాడా పెద్దమనిషి.

తెల్లవారింది.

గూని పోగొట్టుకొని, ఠీవిగా నడిచే తన తండ్రిని తోడ్కొని పోవాలని మేళతాళాలతో వచ్చిన ఆ పెద్దమనిషి కొడుక్కి ఆసుపత్రి ఆవరణలో తండ్రి శవం కన్పించింది. పెద్దమనిషి తాలూకు బంధుమిత్రులందరూ ఒక్కసారిగా గగ్గోలుపెట్టేశారు.

డాక్టరే ఏదోచేసి ఉంటాడని అనుమానించిన పెద్దమనిషి కొడుకు అతన్ని నిలదీశాడు. కోర్టుకి ఈడుస్తానని బెదిరించాడు. అయినా అతను బెదరలేదు.

''నేను చికిత్స చేశానే తప్ప మరే పాపం ఎరుగను. తప్పుచేసినవాడు భయపడాలిగానీ నాకేం భయం? పదండి కోర్టులోనే తేల్చుకుందాం'' అని ఎదురు వాదించడం మొదలుపెట్టాడు.

కేసు కోర్టుకి వెళ్ళింది. ఇరుపక్షాల వాదనలూ విన్నాక జడ్జిగారు అయోమయంలో పడిపోయారు. తప్పెవరిదో తేల్చుకోలేకపోయారు. కొంచెం ఆలోచించాక-

''సరే... మీ వైద్య పరికరాల్ని మాకు చూపించి వాటిని ఉపయోగించేతీరును వివరించి మీ వైద్యవిధానంలో లోపం లేదని నిరూపించుకోండి'' అని డాక్టర్ని ఆదేశించాడాయన.

అరగంటలో వైద్య పరికరాలు కోర్టులో ప్రవేశపెట్టబడ్డాయి. వాటిని చూసి జడ్జితో సహా సభికులంతా ఆశ్చర్యంతో నోరు తెరిచేశారు.

అవి ఆరడుగుల పొడవున్న రెండు చెక్కపలకలు.

''రోగిని ఒక చెక్కపలక మీద వెల్లకిలా పడుకోబెట్టి మరో పలకను అతనిపైఉంచి, బలంగా తొక్కి గూనిని చదునుచేయడమే నా వైద్య విధానం. కావాలంటే మీరే చూడండి... ఆ పెద్దమనిషి ప్రాణం పోతే పోయి ఉండవచ్చుగానీ గూని మాత్రం మచ్చుకైనా లేదు అయినా నేను గూనిపోవడం గురించే తప్ప ప్రాణాల విషయమై ఎలాంటి హామీ ఇవ్వనేలేదుగదా'' అని అతితెలివి ప్రదర్శించాడు డాక్టర్.

డాక్టర్ ఘాతుకం అందరికీ అర్థమైంది.

వాడికెలాగైనా బుద్ధి చెప్పాలనుకున్న జడ్జి ''భేష్... ఇందులో మీ తప్పేంలేదు. పైగా మీ ప్రతిభ ప్రశంసార్హం. అందుకే మీకొక వెండి కంటెను బహూకరిస్తున్నాం. దయచేసి దాన్ని స్వీకరించండి'' అని డాక్టర్‌తో చెప్పి తన సహాయకుణ్ణి పిలిచి చెవిలో ఏదో చెప్పి పంపాడు.

పది నిముషాలలో వెండికంటెతో రానే వచ్చాడు సహాయకుడు. డాక్టర్‌గారు తమ అతి తెలివికీ, దక్కుతున్న సత్కారానికీ తెగ సంతోషపడిపోయారు.



కంటెను డాక్టర్ మెడలో వేయబోయారు సహాయకుడుగారు. కొంచెం బిగుతుగా ఉందేమో తలపట్టలేదు. వెంటనే డాక్టర్‌గారి రెండుచెవులూ, ముక్కూ చాకుతో టకటకా కోసిపడేశారు సహాయకుడుగారు. డాక్టరుగారు ''కుయ్యోమొర్రో''మని లబలబలాడుతున్నా పట్టించుకోక ఆ తర్వాత కంటెను ఆయన మెడలో దిగేశాడాయన.

''డాక్టర్‌జీ... మీరేం బాధపడకండి. కంటె వేస్తాం అని చెప్పామేగాని అడ్డంవచ్చిన ముక్కు చెవులు కోయం అని మీకు మేము హామీ ఇవ్వలేదుగదా'' నవ్వుతూ అన్నాడు జడ్జి. కరతాళధ్వనులతో హాలంతా మార్మోగిపోయింది.

★



# 'వసుంధర'పై చతుర సమీక్షలు

జనవరి 'చతుర'లో ప్రచురితమైన జె.వి.బాబు నవల 'వసుంధర' పై మాకు అందిన సమీక్షలలో ఉత్త మంగా వున్న ఆరింటిని ఈ సంచి కలో ప్రచురిస్తున్నాము.

## అమ్మాయిలకో హెచ్చరిక

**ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష**

పెళ్లీడు వచ్చిన అమ్మాయిలకు ఒక చక్కటి హెచ్చరిక జె.వి.బాబుగారి ''వసుంధర'' నవల. కన్యగా తను కన్న రంగుల కలల న్నింటినీ వమ్ముచేశాడు వసుంధర బావ చంద్రశేఖర్. తమ భవిష్యత్తుకు పునాదివేసిన వారిపట్ల కృతజ్ఞతకు బదులు కృతఘ్నతను ప్రదర్శించి అవకాశవాదానికీ, స్వార్థపరత్వానికీ నిదర్శనాలుగా నిలబడే చంద్రశేఖరులు అసంఖ్యాకులీ దేశంలో. ఇంతకంటే అపాయక రమైన వ్యక్తులు మోహన్‌కుమార్‌వంటి మేకవ న్నెపులులు. సహజమైన తమ కపట నాటకా లతో, కల్లబొల్లి కబుర్లతో అమాయకులయిన అమ్మాయిల నాకర్షించి, వంచించి. తమ అవ సరం తీర్చుకొని తదుపరి తెలివిగా తమ తప్పును ఒప్పు అనిపించేలా పరిస్థితులను సృష్టించుకోగలరు, సమర్థించుకోగలరు. యు వతులు జాగ్రత్తపడాల్సింది యిటువంటి వారి విషయంలోనే.

ఈనాటి గడ్డు పరిస్థితుల్లో ఆడపిల్లను కన్న తండ్రి పడేపాట్లు ఎంత చెప్పినా తక్కువే అనిపిస్తుంది. బాధ్యత, సహృదయత, సమ యస్ఫూర్తీ గల ఆడపిల్ల తండ్రికి చక్కటి నిర్వచనాన్నిచ్చారు రచయిత, శంకరయ్య పాత్రద్వారా. 'తప్పును తప్పుగానే గాక ఆ తప్పు ఎలాంటి పరిస్థితుల్లో జరిగింది అన్నది కూడా ఆలోచించి' అర్థంచేసుకొనే వివేకం ఈనాటి ఆడపిల్ల తండ్రికెంతో అవసరం. నవల పొడుగునా, ఈ విషయాన్ని ఎంతో చక్కగా చెప్పారు రచయిత.

భానుమూర్తి విషయంలోన్నే రచయిత అన్యాయం చేశారనిపిస్తుంది. అత్యున్నత సంస్కారి, ఆదర్శానికి ప్రతినిధి అనదగిన భానుమూర్తిని చంపేయటంలోని ఆంతర్యం అర్థమవలేదు. వసుంధర 'దురదృష్టవంతురా లు' అని చెప్పటంకోసమే అలాచేస్తే అది చాలా చౌకబారు టెక్నిక్. దానివల్ల కలిగే సాంఘిక ప్రయోజనం చాలా తక్కువ.

భానుమూర్తి మరణానంతరం వసుంధర పెళ్లికోసం చేసిన ప్రయత్నాలన్నీ విఫలమై నందుకు గల కారణాలు సంఘంలోని మూఢన మ్మకాలు, అజ్ఞానం వగైరా వగైరా అని ఒకవైపు సూచిస్తూనే, వసుంధర దురదృష్టజాతకురా లని పదేపదే ప్రస్తావించటంవలన జాతకాల పిచ్చికి కొంత ఊతమిచ్చారని అనుకోవలసి వస్తోంది. జాతకాలకే విలువిస్తే - చంద్రశేఖర్, మోహన్‌కుమార్‌వంటి దుర్మార్గులను తప్పు పట్టవలసిందేముంటుంది? - అసలు కారణం వసుంధర 'దురదృష్ట జాతకం'లోనే వున్నప్పు డు?

మొత్తమ్మీద 'వసుంధర' నవలనుండి నేటి యువతీమణులు నేర్చుకోవాల్సింది ఎంతైనా ఉంది. రచయిత అభినందనీయులు.

—సిహెచ్.సులోచన,
కురుగొండ.

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: వికీహండా

## మానవతకు మచ్చుతునక

**ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష**

జె.వి.బాబుగారి 'వసుంధర' కణ్వుడు పెంచిన శకుంతలను జ్ఞప్తికి తెచ్చింది. ఆ లాలిత్యం, అమాయకత్వం, మంచితనం అన్నీ వసుంధరలో ఊపిరిపోసుకున్నాయని పించింది. నవల్లోని ప్రతి పాత్ర మనకు నిత్యజీవితంలో తారసపడేవే. అంతస్తు, హోదా చూసుకొని ఎండమావుల వెంట పరుగు తీస్తూ పక్కనే ఉన్న జలాశయాన్ని విస్మరించిన చంద్రశేఖర్, జీవితాన్ని రంగుటద్దాల్లో చూపించి అమాయక యువతుల్ని తన విషపుకోరలకు బలిచేసేడాక్టర్ మోహన్‌కుమార్, లోకంలో ఇంకా మిగిలిఉన్న మానవత్వానికి ప్రతీకగా నిలిచిన భానుమూర్తిలాంటి భిన్న మనస్తత్వాల్ని చిత్రించటంలో రచయిత సఫలీకృతులయ్యారు. అయితే అక్కడక్కడా సంభాషణలు సినిమాటిక్‌గా అనిపించాయి. వసుంధర తన గర్భం విషయం భానుమూర్తికి నిజాయితీగా తెలియజేయడం. భానుమూర్తి అంత వర్షంలోనూ వసుంధరమీద నింద పడనీయకూడదని ప్రయాణానికే సిద్ధపడిన తీరు ప్రస్తుత సమాజంలో అరుదుగా కన్పిస్తున్న మానవతకు మచ్చుతునకలు. కథంతా ఎంతో పకడ్బందీగా, నేర్పుగా నడిపిన రచయిత ముగింపుమాత్రం చాలా నిరాశాజనకంగా చేశారు. విధి వంచిత అయిన వసుంధర చదువుకుంటానని తీసుకున్న నిర్ణయం బాగానే ఉంది. కానీ ఎలాగూ పెళ్లి మానేయటానికే నిశ్చయించుకున్నప్పుడు పిరికిదానిలా అబార్షన్ చేయించుకోవటంలో అర్థం లేదన్పించింది. ధైర్యంగా బిడ్డను పెంచుకుని సమాజాన్నెదిరించి జీవితాన్ని సవాలుగా తీసుకున్నట్లు చూపిస్తే బాగుండేది. ముగింపుద్వారా రచయిత పాఠకులకు మూఢ నమ్మకాల విషయంలో ఇచ్చిన సందేశం ఏమిటో అర్థంకాలేదు. అలనాటి శకుంతల చూపిన తెగువ, ధైర్యం, తెలివి కూడ నేటి యువతి వసుంధరలో లోపించటం ఆశ్చర్యకరం. అయితే వసుంధర పేరులోని ఔచిత్యాన్ని గురించి రచయిత వసుంధర పాత్రద్వారా చెప్పించిన మాటలు మొత్తం నవలకే హైలైట్. స్త్రీని ధరణితో పోల్చి ఆమె మహోన్నత వ్యక్తిత్వాన్ని పాఠకులకు చూపించటానికి కృషిచేసిన రచయితకు అభినందనలు.

— ఎ.రాధాశ్రీనివాస్,
కోదాడ.

## వేదనాభరితం

**తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష**

వేదనాభరితమైన 'వసుంధర' కథ చదువుతుంటే బాధతో గుండె బరువెక్కింది. ఒక ట్రాజెడీ సినిమా చూసిన అనుభూతి కలిగింది. వసుంధర, ఆమె కుటుంబం సజీవ రూపాలుగా కళ్లముందు కదలాడాయి. ఆత్మీయులకు ఆపదలు కలుగుతున్నాయికదా అని ఆందోళన చెందేటట్లు, వారి కుటుంబంలో ఒకడిగా పాఠకుల్ని లీనం చేసిన ఈ నవల నాకెంతగానో నచ్చింది.

చదువు, విజ్ఞానం, నాగరికత పెరిగినకొద్దీ మనిషికి స్వార్థం, వంచన కూడా పెరిగి , హృదయం మాత్రం తరిగిపోతోందేమోనని అనిపిస్తోంది. తోటి మనుషులకు సహాయపడే ఉన్నత మానవతా లక్షణాలనన్నింటినీ 'సెంటిమెంట్స్' కింద అవహేళన చేయడం నేటి నవీన నాగరికతకు ఒక చెడు అలవాటైపోయింది.

వసుంధర తానే అనుకున్నట్లుగా గొప్ప దురదృష్ట జాతకురాలేమో అనిపిస్తుంది. మొదట స్వార్థపరుడైన తన బావ చంద్రశేఖరం పెళ్లికి కాదనడం, తర్వాత స్త్రీలోలుడైన డాక్టర్ మోహన్‌కుమార్ మోసం చేయడం, చివరన విశాల హృదయుడైన భానుమూర్తి మరణించడం వసుంధరపై బలీయమైన విధి కక్షగట్టినట్లు అనిపించకమానదు. పాత్రలన్నింటికీ సజీవ రచనాశిల్పంతో జీవంపోసి ఉత్కంఠభరితంగా కథనం గావించారు రచయిత. 'తెలివైనవారు అందరినీ మంచి చేసుకోవడానికి ప్రయత్నిస్తారు' అలాగే 'తెలివిగలవారు తమలోని భావాలను ముఖంపై కనబడనీయరు' లాంటివి రచయితకు మానవనైజం పట్లగల సునిశితమైన పరిశీలనాశక్తిని వ్యక్తపరుస్తాయి.

చివర్లో వసుంధర తన కడుపులో పెరుగుతున్న పసికందును ఈ ప్రపంచంలో పడవేసి సమాజాన్ని వారిద్దరూ ధైర్యంగా ఎదుర్కొని నిలబడినట్లు చూపిస్తే బాగుండేది. అయితే, కన్నతండ్రి ప్రేమను వదలుకోలేక, ఆయన పరువుకు భంగం కలిగించడం ఇష్టంలేక తన కడుపులోని పసివాణ్ని మొగ్గలోనే తుంచివేసేందుకు సిద్ధపడినట్లుంది.

''కొందరికి కొన్ని రాసిపెట్టి వుండవేమో, ఒకవేళ అవి చేసేందుకు మొండిగా ప్రయత్నించినా ఏవో అవాంతరాలు, ఆటంకాలు తప్పకుండా వస్తాయి'' అనే నమ్మకాన్ని కలిగించేలా ఆ ధోరణిలో ఆలోచింపచేసేట్లుగా నవల ఉండటం అంత బాగాలేదు. మనిషి శక్తిపైన నమ్మకాన్ని తగ్గించే ధోరణి ఇది.

ఏమైనా అమాయకులైన, సన్మార్గులైన ఆత్మీయులకు తీరని అన్యాయం జరిగింది అని హృదయం ఆక్రోశించేలా చేసింది ఈ నవల అనడంలో అతిశయోక్తిలేదు. స్వార్థం, వంచన, అమాయకుల సెంటిమెంట్స్‌తో ఆటలాడుకునే నయవంచకుల బారినపడకుండా ఈ నవల ఒక కనువిప్పు కాగలదని ఆశిద్దాం.

**-టి.ఆంజనేయులు,**
గజ్వేల్.

## అసమగ్ర చిత్రణ

*రు. 25/-* **పొందిన సమీక్ష**

**ప**ల్లెటూరి వాతావరణం, పల్లెప్రజల మనస్తత్వం అద్దం పట్టినట్టుగా చిత్రీకరించబడిందీ నవలలో. కాని వసుంధరలో భావుకత ఓ పాలు ఎక్కువే రూపుదిద్దుకుంది. ఎంత హైస్కూల్ చదువు అయినా, ఎంత పల్లెటూరి జనం అయినా మరీ అంత అమాయకత్వం ఎక్కడో తప్ప కనబడదేమో. ఒకసారి దెబ్బతిన్న మనసు మరీ అంత తొందరగా మరో ట్రాప్‌లో చిక్కుకోవటం కొంచం అసహజంగా వుందనే అనాలి.

''నష్టజాతకం'' అనేమాటే ఈ కాలంలో తప్పు. అయినా అది కొంచెం అతిశయోక్తిగానే ఉపయోగించటం జరిగింది. అక్కడో ఇక్కడో చాలా అరుదుగా ఒకటీ అరా అలాంటి జీవితాలూ వుండొచ్చు. కాని మరీ పట్టుబట్టి 'పెళ్లి'రాతే లేదనడం విడ్డూరం. అసలు చివరిపేజీలు రాయకుండా వదిలేసినా బాగుండేదేమో వసుంధర పలికిన చివరి పలుకులు కొంచెం సమంజసంగా వున్నాయి. అయితే కేవలం ఆ మాటల కోసమే నవల రాశారా అనిపిస్తోంది. కథనం వాస్తవం అయితే కావచ్చుగానీ అంతగా చదివించేలాలేదు. మానసిక సంఘర్షణా, వసుంధర వేదనా పాఠకుల హృదయాల్ని ఆకట్టుకొనేలాలేదు. చంద్రశేఖర్ ఎదగని మనస్సు, మోహన్‌కుమార్ వంచన, భానుమూర్తి సహృదయం- వీటిని రచయిత మరింత విపులంగా హృద్యంగా రూపొందించి ఉండవలసింది.

కేవలం కథకేగాక, కథనంలో పాత్ర చిత్రణకు, కథాకథన విధానానికి, భాషకు కూడా ప్రాముఖ్యతనిస్తే ఈ నవలా లక్ష్యం మరింతగా సఫలమయ్యేదేమో.

**-స్వాతి,**
హైదరాబాద్.

## బాధాకరం

*రు. 25/-* **పొందిన సమీక్ష**

**నే**టి సమాజంలో స్త్రీ ఎంత చదువుకొన్నా ఇంకా అబలే అని తెలియజేస్తోందీ నవల. ఇది నేటి స్త్రీలకి ఒక హెచ్చరికలాంటిది. పైపై మెరుగులకి మోసపోగూడదనీ, అమాయకంగా ఎవరిని పడితే వారిని నమ్మకూడదనీ తెలియజేస్తోంది 'వసుంధర' పాత్ర చిత్రణ. పురుషాధిఖ్య సమాజంలో మగవారు వనితల మనసునీ, శరీరాన్నీ ఏరకంగా దోచుకొని మోసగిస్తారో రచయిత చక్కగా వివరించారు. అయితే స్త్రీ సహజంగా స్నేహశీలి, సహనశీలి. అందుకే తనని ప్రేమించానని మోసపుచ్చిన చంద్రశేఖర్‌ని వసుంధర క్షమించేసింది.

అట్లే ఆమెని తన మాయమాటలతో ఆకర్షించుకొని, హీనక్షణాల్లో ఆమె శీలాన్ని దోచుకొని, 'తాను వివాహితుణ్ణని చెప్పిన మోహన్‌కుమార్‌నీ క్షమించేసింది, అతన్ని దూరంగా పొమ్మంది. దానికి కారణం తనలాగే మరో స్త్రీ జీవితం నాశనమవ్వకూడదనే. మోహన్‌కుమార్‌కి తెలును స్త్రీల సెంటిమెంట్ల గురించి.





అందుకే అతను తాను వివాహితుడైనా, తన భార్యకి విడాకులిచ్చి వసుంధరని వివాహం చేసుకుంటానన్నాడు. కాని వసుంధర ఒప్పుకో లేదు. స్త్రీ హృదయ ఔన్నత్యాన్ని చాటే ఈ సంఘటన నవలకే హైలైట్. ఇక్కడే నవలని రెండవసారి మలుపుతిప్పిన వైనం ఎంతో సహ జంగా ఉంది.

'పురుషులలో పుణ్యపురుషులు వేరయా' అన్న నీతి నిజంచేస్తోంది భానుమూర్తి పాత్ర చిత్రణ. మగవాళ్లందరూ మోసగాళ్లేకాదుకదా! 'నేను ప్రేమిస్తోంది ఆమె శరీరాన్ని కాదు, ఆమె మనసుని' అని తన సంస్కారం ప్రకటించుకొన్న భానుమూర్తి పాత్ర నవలలో అత్యుత్తమమైనది. అట్లే 'తాను గర్భవతినని, ఇదివరకే మోసపోయానని' వసుంధర భానుమూర్తితో తెలపడంద్వారా ఆమె పాత్రకి రచయిత న్యాయంచేశారు. వసుంధర నిజాయితీని, స్వచ్ఛతను నిరూపించే ఈ చిత్రణ బావుంది. పాత్రౌచిత్యం చెడకుండా వసుంధరని నెలబెట్టారు.

అయితే ఆమె జీవితం నందనవనం చేస్తాడనుకొన్న భానుమూర్తి పాత్రనిపెళ్లిరోజే ఏక్సిడెంట్‌లో పోయినట్లు ముగించడం బాధాకరం. వసుంధర 'తను దురదృష్టవంతురాలినని' తాను అనుకున్నది జరగనప్పుడల్లా అంటూ వుంటుంది. బహుశా ఆ మాటలని నిజం చెయ్యడానికే రచయిత భానుమూర్తి పాత్రని అలా ముగించేశారేమో అనిపిస్తోంది. అయితే అభాగిని వసుంధరచేత 'తనకి మళ్లీ పెళ్లిప్రయత్నాలు చెయ్యవద్దని, తాను చదువుకొని ఉద్యోగం చేస్తానని, తన కాళ్లపై తాను నిలబడతానని' చెప్పించడంద్వారా, చక్కటి ముగింపు ఇచ్చారు రచయిత. నవల ఆసాంతం చదివింపజేసింది.

—సి.పి.ప్రభాకరరావు,
చింతలూరు.

## శీలం శారీరకం కాదు

### రు. 25/- పొందిన సమీక్ష

**జ**నవరి నవల 'వసుంధర'లో నూతనత్వం, ప్రత్యేకత లేకున్నా చదివింపచేసిన ఘనత శైలిదే. సాఫీగా, ధారాళంగా సాగిన కథనం రచయిత ప్రతిభకు తార్కాణం.

కొత్తదనం లేకున్నా పాతబంగారంలా ఆకట్టుకోడానికి జరుగుతున్న చరిత్రే ఈ వసుంధర కథ కావటం అసలుకారణం. ఎన్ని విన్నా, ఎంత చదివినా సంఘంలో ఎందరో వసుంధరలు అమాయకత్వంతో మోసపోతూనేవున్నారు. కథలోని వసుంధరకు చదువులేదు. కాని చదువుకున్న ఉద్యోగినులైన స్త్రీలుకూడా ఈ విషయంలో దెబ్బతింటున్నారు. ఇందుకు ప్రకృతి ధర్మం కొంత కారణమైతే, సమాజం ఆడవారిని మాత్రమే బాధ్యుల్ని చేయడం మరొక ముఖ్య కారణం. ఈ విషయంలో స్త్రీతో సమానంగా పురుషుణ్నికూడా ఛీకొడితే, సాంఘికంగా మగవాడినికూడా చీడపురుగులా బహిష్కరిస్తే కొంత ఫలితం కనిపించవచ్చు. దానికి కావాల్సిన భావ విప్లవం, మనోచైతన్యం నేటి యువతరంలో కలిగించేలా రచయిత తన రచనా మార్గాన్ని ఎన్నుకునుంటే ప్రయోజనాత్మకత సిద్ధించేది.

అందుకు చదువు కొంత దోహదకారి కాగలదనే చివరికి వసుంధర నిర్ణయాన్ని అలా మలిచారు. అయితే ఆ నిర్ణయాన్ని మొదటే ఆమె బావ చేసిన వంచనతోనే తీసుకొని ఉండవచ్చుకదా. శారీరకంగా మోసపోతేగాని కనువిప్పు కలగకపోవడం సమంజసంగా లేదు.

మోసం చేసిన మోహన్‌కుమార్‌ను అలా అంత తేలికగా వదిలేయడంకూడా బాగుండలేదు. విషప్పురుగును వదిలేయటం ఔన్నత్యం కాదు; సామాజిక ద్రోహం అవుతుంది. ఆర్థికంగా, సాంఘికంగా బలవంతుడైన శంకరయ్య అంత సులభంగా అతణ్ని వదిలి ఉండకూడదు. తన కుమార్తెకు జరిగిన అన్యాయం బైట పెట్టుకోలేకపోయినా అవతలి వైపునించి అతడి అవినీతిని మరోలా బహిర్గత పరచి ఉండవచ్చుగదా.

జె.వి.బాబుగారు కొంత సామాజిక విశ్లేషణ (స్త్రీపరంగా) చేసి ఉన్నట్లయితే రచనాప్రయోజనం నెరవేరేది. అలాగే స్త్రీ శీలం కేవలం శారీరకమేగాని మానసికం కాదన్న భావన కూడా రచనలో ద్యోతకమవడం శోచనీయం.

—శ్రీమతి ఆర్.లక్ష్మీకుమార్,
సి.మల్లవరం.

# చతుర

సంపుటి : 14    సంచిక : 2
మార్చి 1991

ఒకప్పుడు అతన్ని బంధువని చెప్పుకుందుకు సిగ్గుపడ్డారు అయిన వాళ్లు.

అయినా తమ అవినీతి చదరంగంలో అతణ్ణో అమాయకపు పావులా ఉపయోగించుకుందామనుకున్నారు.

వారి సామ, దాన, బేధ, దండోపాయాలన్నిటినీ ధైర్యంగా ఎదుర్కొని, రాటుదేలిన అతడిపై చివరగా వాళ్లు విసిరిన వల... అతణ్ని బంధించిందా?

**సభ్య సమాజంలో మర్యాదస్థులుగా చలామణి అవుతూ, తమలోని కీచకులకు, దుర్యోధనులకూ ధర్మరాజువేషం వేసుకుని తిరిగే దుష్టశక్తుల కుయుక్తులకు అక్షర రూపాన్నిస్తూ వై.సి.పి. వెంకటరెడ్డి రచించిన 'శకుని' ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.**



"మీకు తెలుసా?" అంటే "మీకు తెలుసా?" అని ఊళ్ళో అందరి నోటా అదే ప్రశ్న. అందరిలో జవాబు తెలుసుకోవాలనే ఆసక్తి ఉత్కంఠ, జిజ్ఞాస.

జారిపోతున్న లుంగీ ఎగదోసుకుంటూ, హడావిడిగా వెళ్తున్న రామలింగాన్ని చూసి జనం ముఖాల్లో వెయ్యి వోల్టుల బల్బు ఒక్కసారి వెలిగినట్లయింది. ఆ చిక్కుముడి విప్పగల చతురుడు అతడేనని వారి నమ్మకం.

"రామలింగం..." పిలిచారు ఎవరో.

ఆగి, వెనక్కు తిరిగి చూసి 'ఎవరు?' అన్నట్లు ప్రశ్నార్థకంగా చూశాడు రామలింగం.

"ఇక్కడ్రా" అన్నాడు ఓ ముసలాయన.

"ఏం పెద్దయ్యా... నువ్వేనా పిల్చింది?" అన్నాడు రామలింగం ముసలాయన వద్దకు వెళ్ళి.

"అవున్నాయనా..." అన్నాడు వృద్ధుడు.

"ఏం... పనుందా పెద్దయ్యా?"

"నిన్ను అడిగితే అనుమానం తీరుస్తావని"

"ఏమిటా అనుమానం" అంటూ ముసిముసిగా నవ్వాడు రామలింగం, వీధి నాటకంలో శ్రీకృష్ణ పాత్రధారిలా.

"శ్రీనివాసులుకు ఏదో ఉద్యోగం వచ్చిందట ... నిజమేనా?"

"నాకు మాత్రం ఏం తెలుసు?"

"శ్రీనివాసులూ, నువ్వూ ఒక కంచంలో తిని, ఒక మంచంలో పడుకున్న వాళ్ళు. నీకు తెలీకుండా ఉంటుందా?"

వాసన పసిగట్టిన రామలింగం "పొగాకుందా పెద్దయ్యా?" అన్నాడు.

పక్క జేబులో నుంచి ఓ చిన్న మూట తీసి, విప్పి, కాస్త పొగాకు తీసి రామలింగం చేతిలో పెడుతూ, "నిజంగా తెలీదా?" అన్నాడు వృద్ధుడు.

"ఎందుకు తెలీదు, నువ్వేమంటావోనని అలా అన్నాలే"

"అయితే వచ్చినట్లేనా?"

"నిప్పులేనిదే పొగ వస్తుందా పెద్దయ్యా. ఉద్యోగం వచ్చింది. ఈరోజు జాయినవుతాడు" అంటూ హడావుడిగా వెళ్ళిపోయాడు రామలింగం.

"చూశారా... ఆ శ్రీనివాసులుకు ఉద్యోగం వచ్చిందట. మీరూ ఉన్నారు ఎందుకు ... అమ్మా - నాన్నను ఏడిపించి, వేలు - వేలు తగలేసి చదువుకొని ఉద్యోగం - సద్యోగం లేకుండా ఉన్నారు. పైగా, కూసే గాడిద మేసే గాడిదను చెడిపినట్లు పనీ - పాటా చేసుకునే వాళ్లని కూచోబెట్టి పులిగీత ఆడుతున్నారు" అన్నాడు వృద్ధుడు రచ్చబండమీద కూర్చుని ఆడుతున్న పిల్లల్తో.

"శ్రీనివాసులు వయసెంతో తెలుసా? ఇరవై ఆరేళ్ళు. అంత వయసొచ్చేసరికి మాకు మాత్రం రాదూ ఆమాత్రం ఉద్యోగం" అన్నాడు ఓ యువకుడు.

"శ్రీనివాసుల్తో పోల్చుకోవడానికి సిగ్గులేదూ? అతడు మీలాగా హైస్కూల్లో చదివాడా, కాలేజీలో చదివాడా? చిన్నప్పుడే అమ్మా - నాన్నా చనిపోతే దిక్కులేని శ్రీనివాసులు, అతని తమ్ముడు ఎలాగో పెరిగి పెద్దవాళ్లయ్యారు. శ్రీనివాసులు స్కూల్లో ఐదో తరగతి వరకు చదువుకున్నాడో లేదో మరి ఇంటి వద్దనే మిషను కుట్టుకుంటూ, వంట చేసుకుంటూ హిందీ చదువుకొని ఉద్యోగం సంపాదించుకున్నాడు".

"ఆ... ఐదో తరగతేనా?" అంటూ నోళ్ళు వెళ్లబెట్టారు యువకులంతా ఒకేసారి.

"అయితే అదేదో నైట్‌వాచరో, అటెండరు ఉద్యోగమో వచ్చి ఉంటుందిలే" అన్నాడు ఓ యువకుడు పులిగీత మీద నుండి దృష్టి మరల్చకుండా.

"సర్పంచ్ లింగరాజు కూతురు, సుబ్బయ్య కూతురు ఏం చదువుతున్నారు" అడిగాడు వృద్ధుడు.

"బి.ఎ. సెకండియరు చదువుతున్నారు"

"వాళ్లకు ట్యూషన్లు చెబుతున్నాడు శ్రీనివాసులు" అన్నాడు వృద్ధుడు.

"ఆయన చదివింది ఐదో తరగతేనంటున్నావు మరి బి.ఎ వాళ్లకు ట్యూషన్లు ఎలా చెబుతాడు తాతయ్యా?" అడిగాడు ఓ యువకుడు పులిగీత ఆపేసి.

"నాకు తెలిస్తే గదా నీకు చెప్పడానికి"





అన్నాడు ముసలాయన.

"అదేం ట్యూషన్లేరా... అచ్చొహైా, సచ్చొహైా చెబుతూ ఉంటాడు. అట్లాంటి చదువయితే మన ఇమామ్‌సాబ్ చెప్పలేడూ?" అన్నాడు ఓ ఆకతాయి.

"అర్థం పర్థం లేకుండా మాట్లాడకు. బి.ఎ.వాళ్లకు చెప్పడమంటే మాటలా? భాష ఏదయినా స్టాండర్డు ఉండొద్దూ" ఖండించాడు మరో యువకుడు.

"చచ్చింది పులి" ఎగిరాడు ఒకడు.

"కాదు ... మేక చచ్చింది" సవరించాడింకొకడు.

"ఎన్నాళ్ళు చదివినా మీకొచ్చేది 'పులీ-మేకా' చదువే. చేసే పనిమీద శ్రద్ధ ఉంటే ఎవరికయినా ఏ విద్య అయినా అబ్బుతుంది" అన్నాడు వృద్ధుడు.

"శ్రద్ధగా ఆడుతున్నామా లేదా?" అంటూ పకపకా నవ్వారు యువకులంతా ఒకేసారి.

"వంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా అన్నాడు వేమన"

"మాట మాటకూ పద్యమో, సామెతో చెబుతాడు తాతయ్యా" అన్నాడు ఓ యువకుడు.

"మీరు చెప్పండి మరి"

"మాకు పద్యాలు రావే"

"ఏమొస్తాయి మరి? ఎక్కాలొస్తాయా?"

"ఎప్పుడో ఎలిమెంటరీ స్కూల్లో నేర్చుకున్న ఎక్కాలు ఇప్పుడు చెప్పమంటే ఎలా తాతయ్యా"

"మీలాంటివాళ్లను దృష్టిలోపెట్టుకునే 'చదివిన వాడికన్న చాకలాడే మేలు' అన్నారు పెద్దలు"

"ఎలా మేలు తాతయ్యా?"

"ఎవరి గుడ్డలు వాళ్లకు లెక్కప్రకారం ఇస్తాడు గదా. పదో తరగతి చదివిన ఈనాటి బడుద్ధాయిలు చాకలిపద్దు కూడా సరిగా రాయలేరాయె"

"ఎందుకు రాయలేం తాతయ్యా ... మా ఇంట్లో రాసేది నేనే కదా" అన్నాడు పదో తరగతి చదివి వదిలేసిన ఓ యువకుడు.

"రాస్తారు... ఎందుకు రాయరూ – మా మనవడూ రాస్తాడు. అడ్డపంచెలు అని రాయమంటే ఆడపచ్చులు రాస్తాడు. ఊతకర్ర తీసుకుని రెండు అంటించాను" అన్నాడు వృద్ధుడు.

"మాకు తెలుగు సరిగా రాదు మరి" అన్నాడు యువకుడు.

"తెలుగూ రాదు, ఎక్కాలూ రావు. ఇంకేమొస్తుంది మరి?"

"ఇంగ్లీషు"

"రోగ్ స్పెల్లింగ్ చెప్పు మరి"

"ఆర్.ఓ.జి"

"తప్పు... తప్పు" అన్నారు ఇద్దరు ముగ్గురు యువకులు.

"నీ ఫ్రెండ్సే తప్పంటున్నారు... పోనీలే రాంగ్ స్పెల్లింగ్ చెప్పు"

"ఆర్.ఎ.ఎన్.జి"

"రాంగ్... రాంగ్" అంటూ గోలచేశారు యువకులు.

"పోనీలెండి బాబూ... నాకు రాని ఇంగ్లీషు గురించి మిమ్మల్ని అడగడం అవివేకమే. ఆడుకోండి ... నేను ఇంటికి వెళ్తాను" అంటూ వెళ్ళిపోయాడు ముసలాయన.

"ముసిలోడు భలే గట్టోడే" అన్నాడు ఓ యువకుడు.

"వయసులో ఉన్నప్పుడు ఆడోళ్లతో బాగా ఆడుకున్నాడట" మరో యువకుడు అన్నాడు.

"పెద్ద పెద్ద మాటల్తో పనేమిటీ? మనకు తగిన మాటలు మాట్లాడాలి గాని" అన్నాడు కాస్త ఇంగితజ్ఞానమున్న యువకుడు.

"భలే బుద్ధిమంతుడివే లేవోయ్! నీ సంగతి మాకు తెలియదనుకున్నావా"

"ఏంటి తెలిసేది నీ ముఖం?"

"సరేగానీ! మన ఊరికి కొండపల్లి బొమ్మ వచ్చింది చూశావా?"

"వచ్చిందా ... తెచ్చారా?"

"బొమ్మంటే బొమ్మ కాదురా బంగారు భామ"

"సరిగ్గా చెప్పరా నన్నాసి వెధవా!"

"కొత్తగా వచ్చిన ఏఎన్ఎమ్‌ను చూడలేదన్న

మాట!''

''ఓహో... అదా సంగతి? ఇలాంటి వ్యవహారాల్లో జోక్యం చేసుకుంటున్నట్లు మా నాన్నగారికి తెలిసిందంటే చదువు చాలించి పొలంలోకి పలాయనం చిత్తగించాల్సిందే''

''నీ సంగతి నాకు తెలీదనుకున్నావా? బుద్ధిమంతుడిలా నటించి అమ్మాయిని వల్లో వేసుకోవాలని ఎత్తు వేస్తున్నావు''

''అలాంటి అవసరం నాకు లేదులే''

''మనకు ఈ జన్మలో ఉద్యోగం రాదు; ఉద్యోగం చేస్తున్న అమ్మాయిని పెళ్ళిచేసుకుంటే ఆమే సాకుతుంది''

''ఏం మాటలోయ్ ... పెద్దవాళ్లకు తెలిస్తే వళ్ళూడగొడతారు. మీలాంటి అధిక ప్రసంగులతో స్నేహం చేస్తే నల్లుల్తో పాటు మంచానికి కూడా దెబ్బలు తగిలినట్లు మాకూ చెడ్డపేరొస్తుంది'' అంటూ లేచి వెళ్ళిపోయాడు వాళ్లలో కాస్త పెద్దగా ఉన్న యువకుడు.

కాసేపట్లో ఖాళీ అయిపోయింది రచ్చబండ.

లింగరాజు ఇంట్లో గోడ గడియారం నాలుగ్గంటలు కొట్టింది. అది గంటలు కొట్టింది అయితే తెల్లవారు జామున కాదు, సాయంత్రం.

మకుటం లేకపోయినా లింగరాజు ఆ ఊరికి ఓ చిన్నరాజు అంటే అతిశయోక్తి కాదు. ఒక్కడే కొడుకు. అందువల్ల గ్రాడ్యుయేట్ అయినా ఉద్యోగం కోసం ప్రయత్నించకుండా ఇంటిపట్టునే ఉండిపోయి రాజకీయాల్లో ప్రవేశించాడు. పంచాయతీబోర్డు మెంబరుగా అనుభవం గడించి, ప్రస్తుతం సర్పంచ్‌గా అధికారం చెలాయిస్తున్న ధనిక రైతు లింగరాజు.

''సౌజన్యా...'' అన్నాడు లింగరాజు గోడ గడియారంకేసి చూస్తూ.

''పిలిచారా నాన్నా'' అంటూ వచ్చి ఎదురుగా నిల్చుంది సౌజన్య.

సౌజన్య పదో తరగతి పబ్లిక్ పరీక్షల్లో రాష్ట్రస్థాయిలో ఫస్టురాంకు తెచ్చుకుంది. ఇంటర్‌మీడియెట్లో కూడా మంచి మార్కులు తెచ్చుకుని పాసయింది. ప్రస్తుతం బి.ఎ. సెకండియర్ చదువుతోంది. తెలివితేటలకు తగిన అందచందాలున్నాయి. అందచందాలకు మించిన గుణవంతురాలు.

''టైం చూశావా అమ్మడూ?''

''బయల్దేరుతున్నాను నాన్నా!'' అంటూ ఇంట్లోకి వెళ్ళి ముస్తాబయి పుస్తకాలు తీసుకొంది. పెన్‌లో ఇంకు ఉందో లేదోనని చూసుకుని, వరండాలోకి వచ్చి చెప్పులు తొడుక్కుంది.

''వెళ్ళొస్తా నాన్నా ... వెళ్ళొస్తానమ్మా'' అంటూ బయటికి వెళ్ళిపోయింది సౌజన్య.

అమ్మాయికేసి చూసి తృప్తిగా నిట్టూర్చి ''భాగ్యా ...'' అన్నాడు లింగరాజు.

''ఏమండీ?'' అంటూ వచ్చి భర్తకు ఎదురుగా నిల్చుంది భాగ్యమ్మ.

నీతి శాస్త్రంలో చెప్పినట్లు ''ఇంటి కార్యములందు పనికత్తె వలె, కార్యాలోచన యందు మంత్రిలా, రూపమునందు లక్ష్మిలా, ఓర్పునందు భూమివలెను, ఆహారం పెట్టే విషయంలో తల్లిలా, పడక గదిలో రంభలా ప్రవర్తిస్తూ అన్ని విధాలా భర్తకు అనుకూల పత్నిగా పేరుతెచ్చుకుంది భాగ్యమ్మ.

''కూచో'' అన్నాడు లింగరాజు.

కూచుంది భాగ్యమ్మ. ఎవరూ మాట్లాడలేదు.

''శ్రీనివాసులుకు ఉద్యోగం వచ్చిందట'' అన్నాడు ఆమె ముఖంలోకి చూస్తూ''

''శ్రీనివాసులుకా?''

''అవును...''

''శ్రీనివాసులెవరూ?''

''మనమ్మాయికి హిందీ బోధిస్తున్నాడే, ఆ శ్రీనివాసులు''

''ఏం ఉద్యోగమో?''

''హిందీ టీచరుగా హైస్కూలుకు వేశారట''

''రానీండి పాపం... చిన్నప్పటి నుంచీ నుండి ఎన్నో కష్టాలు అనుభవించాడట. 'అందుకే ఓరిస్తే ఓరుగల్లే పట్టణమవుతుంది' అన్నారు పెద్దలు''

''సామెత బావుందిగాని, శ్రీనివాసులు మనమ్మాయికి భర్తగా బావుంటాడా లేదా అని?''

''మనమ్మాయిని శ్రీనివాసులుకు ఇవ్వాలని



అనుకుంటున్నారా?''

''ఏం... ఇవ్వకూడదా?''

''ఇవ్వకూడదని అనడంలేదుగాని, అమ్మాయి అభిప్రాయం కనుక్కోవాలిగా''

''అడుగుదాం''

''ఒకప్పుడు అతణ్ణి కించపరచి మాట్లాడాం- అది మరిచిపోతాడా?''

''మనమ్మాయినిస్తామంటే అన్నీ మరచి పోయి ఆనందంతో ఎగిరిగంతేయడూ''

''అలా అనుకోవడానికి వీల్లేదండీ... దేహాని కి తగిలిన గాయాన్ని మందులతో సులభంగా మాన్పవచ్చుగాని మనసుకు గాయం తగిలితే ఎప్పటికీ మానదట''

''మనం చేయవలసిన ప్రయత్నం చేద్దాం. తరువాత ఏం జరిగితే అది జరగనీ''

''పొయ్యిమీద కాఫీకి నీళ్లు పెట్టానండీ'' అంటూ వంట గదిలోకి వెళ్లింది భాగ్యమ్మ.

ఆమె అలా వెళ్లీ వెళ్లగానే బలరామయ్య వచ్చాడు.

''ముఖమే బంగారమయిపోయిందే, ఏం పనిమీద ఉన్నారో దేవరవారు?'' అన్నాడు లింగరాజు.

''బతకడానికి ఏదో ఒకటి చేయాలిగా''

''భాగ్యా... మీ అన్నయ్య వచ్చాడు చూడు''

ముఖానికి పట్టిన చెమట పైటకొంగుతో తుడుచుకుంటూ వచ్చి, ''ఏమన్నయ్యా... చూ పే బంగారమయిందే?'' అంది భాగ్యమ్మ.

''ఉన్నట్లుండి భార్యా భర్తలకు బంగా రంమీద ఆశపుట్టిందే?''

''కూతురుకు పెళ్లీడు వచ్చిందికదన్న య్యా''

''వట్టిమాటలు కట్టిపెట్టోయ్ గట్టిమేల్ తల పెట్టవోయ్! అన్నాడు గురజాడ'' అన్నాడు లింగరాజు.

''ఆకస్మికంగా ఆయనెలా జ్ఞాపకం వచ్చా రో'' అంది భాగ్యమ్మ.

''వట్టి మాటలతో కాలం గడపకుండా కాఫీ ఏమయినా ఇస్తావేమోనని''

''ఓ... అదా సంగతి? మా అన్నయ్యకు కాఫీ ఇమ్మని మీ రు చెప్పాలేం?'' అంటూ వంట గదిలోకి వెళ్లింది భాగ్యమ్మ.

''మీ శీనూ సంగతి తెలుసా?'' అన్నాడు లింగరాజు సంభాషణ ప్రారంభిస్తూ.

''ఏ సంగతి?''

''ఉద్యోగమొచ్చిందటగా?''

''నేనూ మీలాగే విన్నాను''

రెండు కప్పుల్లో కాఫీ తెచ్చి చెరో కప్పు ఇచ్చింది భాగ్యమ్మ.

''కాఫీ స్పెషల్‌గా ఉందమ్మా'' అన్నాడు బలరామయ్య కాఫీ చప్పరిస్తూ.

''మీ చెల్లాయి ఈమధ్య భలేగా తయార యిందిలే''

''మీ శీనూకు ఉద్యోగమొచ్చిందట గదన్న య్యా?'' అంది భాగ్యమ్మ.

''శీను మావాడయితే మనమాట వినడే మ్మా?''

''అది ఆనాటిమాట. అందులో మీరు చెప్ప మన్నది తప్పుడు సాక్ష్యం. నీతీ నిజాయితీగల మనిషి అబద్ధం చెప్పమంటే చెబుతాడా?'' అంది భాగ్యమ్మ.

''ఆనాడు మనమాట ధిక్కరించాడు కాబట్టే ఈనాడు శ్రీనివాసుల్ని ఒక వ్యక్తిగా గుర్తిస్తు న్నాం'' అన్నాడు లింగరాజు.

''శ్రీనివాసులు సాక్ష్యం చెప్పలేదని ఆనాడు అగ్గిమీద గుగ్గిలంలా ఎగిరిన మీరు ఈనాడు శ్రీనివాసుల్ని సమర్థిస్తున్నారంటే ఏదో వ్యూహం పన్నుతున్నారన్న మాట'' అన్నాడు బలరామ య్య లింగరాజును అనుమానిస్తూ.

''మీకు తెలీకుండా మేం ఏం వ్యూహం పన్నుతామన్నయ్యా? మేం ఏం చేయదలచు కున్నా మీకు చెప్పే చేస్తాంగదా''

''కాఫీ చేయడమేగాదు, మాట్లాడ్డం కూడా నేర్చుకుందయ్యో మా చెల్లాయి''

''ఆడవాళ్లం ఏం మాట్లాడినా ఇంట్లో మాట్లా దేవాళ్లమేగాని బయటికి వెళ్లి ఏం చెయ్యగలం అన్నయ్యా? మాకు మీకంటే ఆప్తులు ఎవరూ లేరన్న విషయం మీకు తెలుసుగదా! మిమ్మ ల్ని రాయబారిగా శ్రీనివాసులువద్దకు పంపాల నుకుంటున్నారు మావారు''




"ఏం పనిమీద పంపాలనుకున్నావయ్యా?" అన్నాడు లింగరాజుతో.

"అమ్మాయికి పెళ్లీడొచ్చిందికదా?" అన్నాడు లింగరాజు.

"ఎవరమ్మాయికి?"

"ఎవరమ్మాయో అయితే మనం ఆలోచించవలసిన అవసరం ఏముంది?"

"మన సౌజన్యకేనా?"

"అవును బావా!"

"సౌజన్యకు పెళ్లీడొస్తే శ్రీనివాసులువద్దకు రాయబారం వెళ్లడందేనికి? తాతాచార్ల తద్దినానికి, పీర్లపండక్కి ఏం సంబంధం?"

"శ్రీనివాసులు ప్రయోజకుడయ్యాడు కదా, అతనికి అమ్మాయినిస్తే బావుంటుందేమోనని ఆలోచిస్తున్నాం"

"అయితే నన్ను పంపడం ఎందుకు? మీరే వెళ్లడం మంచిదికదా?"

"ఎంత విలువయిన బంగారమయినా వెలిగారం లేనిదే అతకదుకద అన్నయ్యా" అంది భాగ్యమ్మ.

"చూశారా బావగారూ... మీ చెల్లాయి సామెతలు కూడా నేర్చుకుంది"

"నిజమేనమ్మా... మధ్యవర్తి లేకపోతే కొన్నిపనులు జరగవు"

"అందుకే ఒకసారి వెళ్లిరండి. వెళ్లిన పని సఫలం అయ్యేలా చూడాలి." అన్నాడు లింగరాజు.

"మా అన్నయ్య చూసి రమ్మంటే కాల్చి వచ్చేరకంలెండి"

"చేతనయినంత వరకూ చెప్పి చూస్తాను. అమ్మాయి గుణగణాలు తెలిసే ఉంటాయి కాబట్టి ఒప్పుకోవచ్చు"

"ఏమో ఒప్పించే బాధ్యత మీకు అప్పగిస్తున్నాం" అన్నాడు లింగరాజు.

"వెళ్ళొస్తానండి. వెళ్ళొస్తానమ్మా" అంటూ వెళ్ళిపోయాడు బలరామయ్య.

"నేను అలా వెళ్ళొస్తా" అంటూ లింగరాజు కూడా బయటికి వెళ్లాడు.

వాళ్లు వెళ్ళినవేపు చూస్తూ కూచుంది భాగ్యమ్మ.

"ఏం భాగ్యమ్మా... ఒక్కదానివే కూచున్నావే?" లోనికి వస్తూ పలకరించింది పొరుగింటి కమలమ్మ.

"రండి పిన్ని ఈమధ్య కనిపించలేదే! ఎక్కడికెళ్లారు?"

"మా అమ్మాయిని చూసి వద్దామని వెళ్లానమ్మా"

"ఎవరిని... శాంతమ్మనా? అందరూ బావున్నారా?"

"దేవుని దయవల్ల బావున్నారమ్మా!"

"కూచోండి పిన్నీ కాఫీ తెస్తాను" అంటూ భాగ్యమ్మ ఇంట్లోకి వెళ్ళింది. ఆమెవెంట వంటగదిలోకి వెళ్ళింది కమలమ్మ.

పొయ్యిదగ్గర పీట వాల్చి "కూచోండి పిన్నీ" అంది భాగ్యమ్మ. పీటమీద కూచొని, గోడకు ఆనుకుంది కమలమ్మ.

ఫ్లాస్కులోని కాఫీ కప్పులోకి వొంపి కమలమ్మకు ఇస్తూ "తాగండి పిన్నీ" అంది భాగ్యమ్మ.

"ఆరుగంటలవుతోంది ఇప్పుడేం కాఫీ తల్లీ! ఇప్పుడు తాగితే రాత్రికి నిద్రరాదు"

"మీరు నిద్రరాదంటారుగాని, ఎన్నిసార్లు తాగినా నాకు హాయిగా నిద్రవస్తుంది"

"మీకేమ్మా... వయసులో ఉన్నారు అన్నీ అరిగించుకుంటారు! కాస్త వయసు మళ్ళనీ నీకే అర్థమవుతుంది"

"అంత వయసొచ్చేవరకూ మేం బతుకుతామా పిన్నీ"

"ఎందుకు బతకర్లేమ్మా, ఆస్పత్రులు, డాక్టర్లూ కొల్లలుగా ఉన్నారు... సరేగానీ... ఊళ్ళోవాళ్ళంతా ఏదో అనుకుంటున్నారు... నిజమేనా..." అంది కమలమ్మ గునగునగా.

"ఏమనుకుంటున్నారు పిన్నీ?"

"ఏంనంగనాచివే తల్లీ... నీకు తెలీదా?"

"విషయం ఏమిటో చెప్పకనే ఎలా తెలుస్తుంది పిన్నీ విచిత్రంగా మాట్లాడతావు"

"శ్రీనివాసులుకు ఉద్యోగం వచ్చిందని అనుకుంటున్నారు"

"అవును... వచ్చిందట! అతగాడికి



ఉద్యోగం రావడం వింతగాఉంది మనూరివా ళ్ళకు. ఇది పల్లెగాదూ పట్నమూగాదు'' అంటూ విసుక్కుంది భాగ్యమ్మ. "అయ్యో పిన్నీ నేను గమనించనేలేదు. మీరు మాటల్లో పడి కాఫీ తాగడం మరిచిపోయారు, తాగండి చల్లారిపోతుంది'' అంది మళ్ళీ.

''శకుంతల అదృష్టవంతురాలు'' అంది కమలమ్మ కాఫీ తాగుతూ

''శకుంతల ఎవరు పిన్నీ? వాళ్ళకు అక్క-చెల్లెళ్ళు లేరట. అన్న దమ్ములిద్దరేన టగా?'' అంది భాగ్యమ్మ ఆశ్చర్యంగా.

''అయ్యో... ఎంతవెర్రిదానివే భాగ్యా! నువ్వు ఊళ్ళో కాపురం చేస్తున్నావాలేదా? అందరికీ తెలిసిన సంగతి నీకు తెలీదంటే ఆశ్చర్యమే'' అంది కమలమ్మ ముక్కుమీద వేలేసుకొని.

''నీ ఒట్టుగా నాకు తెలీదు పిన్నీ''

''సుబ్బయ్య తెలుసా?''

''ఏ సుబ్బయ్య?''

''పంచాయతీ మెంబరు''

''తెలును''



''అతని కూతురే శకుంతల''

''మరి, శీనుకు ఉద్యోగమొస్తే శకుంతల అదృష్టవంతురాలంటావే?''

''మొగుడికి ఉద్యోగమొస్తే పెళ్ళానికి అదృష్టంకాదా?''

''శ్రీనివాసులుకు పెళ్ళయిందా పిన్నీ?''

''కాకపోతే చేసుకుంటాడు''

''శకుంతలనే చేసుకుంటానని మాటఇచ్చాడా?''

''అయ్యో పిచ్చితల్లీ, నీకుతెలీదా! ఆ పిల్లకూ - వానికీ సంబంధమట. దాన్ని చేసుకోక ఎవర్ని చేసుకుంటాడు?'' భాగ్యమ్మ చెవిలో చెప్పింది కమలమ్మ. ''నేను చెప్పినట్లు ఎవరికీ చెప్పకు, కొంపలంటుకుంటాయి'' అంది లోగొంతుకతో.

భాగ్యమ్మ ముఖంలో మారిన రంగుల్ని గమనించలేదు కమలమ్మ. తన మాటలు ఎవరేనా వింటున్నారేమోనని ఇటుఅటు చూస్తోంది గాని, భాగ్యమ్మ ముఖంలోకి చూడలేదు కమలమ్మ.

''నిజామా పిన్నీ... మీకెలాతెలుసు?'' అడిగింది భాగ్యమ్మ.

''నాకేగాదమ్మా, ఊరందరికీ తెలుసు. నీకు తెలీదంటే ఆశ్చర్యంగా ఉంది''

''నిజంగా తెలీదు పిన్నీ''

''పోనీలే... కూర ఏమన్నా ఉంటే కాస్తవెయ్యి తల్లీ, పొద్దుటి అన్నమే ఉంది తింటాను.''

గిన్నెలో కూరవేసి కమలమ్మ చేతికిచ్చింది భాగ్యమ్మ. కమలమ్మ వెళ్ళిపోయినా ఆమె చెప్పిన మాట భాగ్యమ్మ మనసులో పిశాచంలా తిష్టవేసింది. శ్రీనివాసులు అలాంటివాడా? సౌజన్య, శకుంతల ఇద్దరూ కలిసే ట్యూషనుకు వెళ్తున్నారు. శ్రీనివాసులు అలాంటివాడయితే అమ్మాయి నాతో చెప్పదా? అసలు అతని వద్దకు ట్యూషనుకు వెళ్తుందా...?

ఏమో వయసులో ఉన్నవాడు...? పెళ్ళికాని యువకుని వద్దకు యుక్తవయసులో ఉన్న అమ్మాయిని పంపడమే పొరపాటేమో...

శ్రీనివాసులు హిందీ బాగా చెబుతాడని శకుంతలే చెప్పిందట... తామిద్దరికీ సంబంధం ఉంటే మధ్యలో మా అమ్మాయిని ఎందుకు పిలుచుకొని పోతుంది...?

అంతా అయోమయం! అసలు కమలమ్మ మాటలే అయోమయంగా ఉంటాయి. ఎప్పుడూ ఎవరిమీదో ఏవో ఆరోపణలు చేస్తూనే ఉంటుంది... 'శ్రీనివాసులుకు మా అమ్మాయిని ఇవ్వాలని అనుకుంటున్నాం' అంటే ఏంచెప్పేదో! శ్రీనివాసులు చాలా బుద్ధిమంతుడు అనేదేమో!... లోకులు కాకులు... ఎవరయినా బాగుపడుతున్నారంటే అసూయతో ఆరోపణలు చేయడం సహజం.

కమలమ్మ చేసింది ఆరోపణకాదని, వాస్తవమని ఎలా అనుకోవడం? అసలు శ్రీనివాసులుకు అలాంటి దురలవాట్లుంటే ఇలా చదువుకొని పాసవుతాడా...?

ఆమె ఆలోచనాస్రవంతి సాగుతూనే ఉంది.



సాయంత్రం స్కూలునుండి వచ్చి ముందు గుడ్డలు మార్చుకొన్నాడు శ్రీనివాసులు. బాత్‌రూముకెళ్ళి, కాళ్ళూ, ముఖం కడుక్కొని, టవల్తో ముఖం తుడుచుకుంటూ వంటగదిలోకి వెళ్ళాడు. స్టౌ ముట్టించి, కాఫీ చేసుకోవడానికి నీళ్ళు పాత్రలోపోసి, స్టౌమీద పెట్టాడు.

ఇంతలో శకుంతల, సౌజన్య ఇంట్లోకి వచ్చి కూచున్నారు. అంతవరకూ గుండెలకు ఆనించుకొని భద్రంగా పట్టుకున్న పుస్తకాలు కిందపెట్టి గుసగుసలాడసాగారు.

''సార్‌కు కంగ్రాచ్యులేషన్సు చెబుదామా?'' అంది శకుంతల.

''నీ ఇష్టం చెబుదామంటే చెబుదాం'' అంది సౌజన్య.




# గుర్తుంచుకోండి, పోషణనిచ్చే సమపాళ్ళలోని ఆహారాన్నివ్వకపోతే జరిగేదిది-మీ పాప విటమిన్, మినరల్ వీటి లోపానికి గురికావచ్చు.

## "అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

విటమిన్‌లు, మినరల్స్ సమపాళ్ళలో ఉన్నట్లయితే పోషక పదార్థాలను హరించుకొనడంలో తోడ్పడతాయని మీకు తెలుసా. ఇది, మీ పాపాయి కొరతకు గురి కాకుండా చూస్తుంది.

మీ డాక్టర్‌ని అడగండి. ఈ విటమిన్‌లనూ, మినరల్స్‌నూ పొందేందుకు పోషణ రూపేణా సమతూకంలోని ఆహారమే ఉత్తమ మార్గమని మీ డాక్టర్ చెబుతారు. అటువంటి సమతూకమైన పోషకాహారంలో ప్రొటీన్లూ, కార్బొహైడ్రేట్లూ, కొవ్వుపదార్థాలు, ఇనుము, కాల్షియం కూడ సరైన పాళ్ళల్లో ఉంటాయి-ప్రతిసారి ఆహారం యిచ్చినప్పుడు, ప్రతి రోజు క్రమం తప్పకుండా.రోజు రోజూ లభించాలి.

చాలా మంది తల్లులకు మామూలుగా పారంపర్యంగా యిచ్చే ఆహారంతో యిలా సమతూక ఆహారం యివ్వడం సాధ్యం కాని పని.

దీనికి పరిష్కారం ?

సెరిలాక్. ఇది పాపాయిలకు యిచ్చేందుకు పోషణ రూపేణా సమతూకమైన ఘన ఆహారం వారికి నాలుగు నెలల నుంచి యిచ్చేందుకు.ఎందుకంటే, పిల్లలకు ఆ వయసు నుంచి పాలు ఒక్కటే చాలవు.

సెరిలాక్ ఎ.డి.సి.బి కాంప్లెక్స్ మరియు 'ఇ' విటమిన్లతో బలవర్ధకం చేయబడింది. దీనిలో ప్రొటీన్లూ, కొవ్వు పదార్థలూ, కార్బొహైడ్రేట్లూ, ఇనుము, కాల్షియం కూడా ఉన్నాయి-అన్నీ మంచి సమపాళ్ళలో. దాని రుచి పిల్లలకు చాలా యిష్టం.

కాబట్టి, పోషణనిచ్చే సమతూకంలోని సెరిలాక్ సమకూర్చే లాభాలన్నింటిని మీ పాపాయికి అందించండి. పాపాయికి 6 నెలలు రాగానే వీట్-ఆపిల్, వీట్-ఆరెంజ్, వీట్-వెజిటబుల్ యొక్క అదనపు ప్రయోజనాన్ని పాపాయికి సమకూర్చండి. ప్యాక్ మీద యివ్వబడిన సూచనలను దయచేసి పాటించండి.

---

ఉచితం సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి : సెరిలాక్, పోస్ట్ బ్యాగ్ నం. 21, న్యూఢిల్లీ-110 029

---

నెస్లె వారి నాణ్యమైన ఉత్పాదన




మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

Mudra:D.NES.0019.TEL

రెండు గ్లాసుల్లో కాఫీతెచ్చి చెరోటి ఇచ్చాడు శ్రీనివాసులు.

లేచి గ్లాసులు అందుకుంటూ "కంగ్రాచ్యులేషన్సు సార్!" అన్నారు ఇద్దరూ ఒకేసారి.

"కాఫీ ఇచ్చినందుకా?" అన్నాడు శ్రీనివాసులు నవ్వుతూ.

"కాఫీ ఇచ్చినందుకు థాంక్సు చెబుతాంగాని, ఇవి కంగ్రాచ్యులేషన్సు" అంది శకుంతల.

"ఎందుకు?"

"మీకు ఉద్యోగం వచ్చినందుకుసార్" అంది సౌజన్య.

"థాంక్యూ!" అన్నాడు ఆనందంగా.

"జాయినయ్యారా?" ప్రశ్నించింది శకుంతల.

"అవును... ఈరోజే చేరాను"

"లక్ష్యాన్ని చేరుకున్నారు!" అంది శకుంతల.

"అభివృద్ధిపథంలో పయనించాలనే వ్యక్తి ఎప్పటికీ లక్ష్యం చేరుకోలేడు శకూ"

"మరి ఎవరు చేరుకుంటారుసార్?" అడిగింది సౌజన్య.

"ఒక పరిమితపరిధి ఏర్పరచుకొని, ఆ గీటే లక్ష్యం అనుకున్న వ్యక్తి దాన్ని సాధించినట్లు భావిస్తాడు. అంతేగాని అపార జ్ఞానాంబుధిలో మునిగి జ్ఞానమనే ఆణిముత్యాల్ని సేకరించడమే తన జీవిత పరమావధిగా భావించే వ్యక్తి లక్ష్యాన్ని చేరుకున్నట్లు భావించలేడు"

అతని మాటలు విని ఆశ్చర్యపోయారు అమ్మాయిలిద్దరూ. జీవిత లక్ష్యానికి కొత్తభాష్యం చెప్పిన అంత గొప్ప భావుకునివద్ద చదువుకుంటున్నందుకు ఆనందంతో పులకించిపోయారు.

"సార్... మీ బావమరిది వస్తున్నారు" అంది శకుంతల దూరంగా వస్తున్న రామలింగాన్ని చూసి.

"కొత్తేముందమ్మా... రోజూ వచ్చేవాడేగా!"

"నమస్కారం బావా" అంటూ చేతులు జోడించి నమస్కరించాడు రామలింగం.

"ఏమిటోయ్ కొత్త మర్యాద?"

"గురువువి అయ్యావుగదా?"

"ఇంతకుముందు కాదా?"

"శంకులో పోస్తేనే తీర్థం"

"మరి గురువును బావా అనొచ్చా?"

"తప్పు... తప్పు" అంటూ లెంపలేసుకున్నాడు రామలింగం.

"తప్పో ఒప్పోగాని ముందు కూచో... పొగడ్తలు అహంభావాన్ని పెంచుతాయి"

"మామగారొస్తున్నారే" అన్నాడు రామలింగం కుర్చీలో కూర్చుంటూ.

బజారుకేసి చూసి, "ఓహో... మా చిన్నాన్నగారా?" అన్నాడు శ్రీనివాసులు.

"మహానుభావులు ఊరకరారు గదా?" అన్నాడు రామలింగం.

"రండి బాబాయ్..." అంటూ కుర్చీలో నుంచి లేచి నిల్చున్నాడు శ్రీనివాసులు. రామలింగం లేచి, "కూచోండి మామగారూ" అంటూ తన కుర్చీవేపు చూపించాడు. శకుంతల, సౌజన్యలు లేచి నిల్చున్నారు.

"కూచోండర్రా... నేనేం మీ టీచర్నా? అంతా లేచి నిల్చోడానికి?" అన్నాడు బలరామయ్య.

"మీరు వయసులో మాకంటే పెద్ద. మిమ్మల్ని గౌరవించడం మా బాధ్యత" అన్నాడు శ్రీనివాసులు.

"అంతే... అంతే..." అన్నాడు రామలింగం.

"కూచోండి చిన్నాన్నా... కూచో రామలింగం" అంటూ ఇంట్లోకి వెళ్లాడు శ్రీనివాసులు.

"ఇదో శీనూ... లోనికి వెళ్తున్నావు కాఫీ గీఫీ ఏమీవద్దు. ఇప్పటికే నాలుగయిదు సార్లయింది" అన్నాడు బలరామయ్య కుర్చీలో కూచుంటూ.

"ఉండండి మామగారూ... మీ పేరుచెప్పుకొని నేనూ తాగుతాను" అంటూ కుర్చీలో కూచున్నాడు రామలింగం.

శకుంతల, సౌజన్యల వేపు కాసేపు తదేకంగా చూసి, "ఏం చదువుతున్నారు అమ్మడూ, ఇద్దరూ ఒక క్లాసేనా?" అన్నాడు బలరామయ్య.

"అవును పెద్దయ్యా... బి.ఏ. సెకండియరు




చదువుతున్నాం'' అన్నారు ఇద్దరూ ఒకేసారి.

''బి.ఎ. అంటే ఇంగ్లీషు చదువుగదా, మరి మా శీనూ వద్ద ఏం చదువుకుంటారు?'' ధర్మ సందేహం వెలిబుచ్చాడు బలరామయ్య.

''హిందీ చదువుకుంటాం పెద్దయ్యా!'' అంది శకుంతల.

''బి.ఎ.లో హిందీ ఉంటుందా?''

''ఇంగ్లీషుతోబాటు ఏదో ఒక భారతీయ భాష చదవాలి'' అంది సౌజన్య.

''ఏమిటో నాకు అర్థం కాలేదమ్మా''

''ఇంగ్లీషు తప్పనిసరిగా చదవాలి. తరువాత తెలుగు, ఉర్దూ, తమిళం, కన్నడం, హిందీలాంటి భారతీయ భాషల్లో ఏదో ఒకటి చదవాలి'' అంది శకుంతల.

''అయితే తెలుగు చదువుకోవచ్చు గదా? అది మనకు అర్థమయ్యే భాష. ట్యూషను చెప్పించుకోవలసిన అవసరం ఉండదు''

''నిజమేననుకోండి. అయినా కష్టపడి చదువుకుంటే మరో కొత్తభాష నేర్చుకున్నట్లు ఉంటుంది కదా?'' అంది సౌజన్య.

''అంతేకాదు హిందీ మన జాతీయభాష. మనదేశంలో సగం మందికిపైగా హిందీ మాట్లాడేవాళ్లు, అర్థంచేసుకొనేవాళ్లూ ఉన్నారు. అందువల్ల హిందీ చదువుకుంటే భారతదేశంలో ఎక్కడికయినా సులభంగా వెళ్లిరావచ్చు'' అన్నాడు శ్రీనివాసులు కాఫీ అందిస్తూ.

''ఇప్పుడు బాగా అర్థమయింది హిందీవల్ల లాభమేమిటో'' అన్నాడు బలరామయ్య కాఫీ గ్లాసు అందుకుంటూ.

''హిందీ చదువుకుంటే ఇన్ని లాభాలున్నాయని ఇంతవరకు నాకూ తెలియదు మామా'' అన్నాడు రామలింగం కాఫీ అందుకుని తాగుతూ.

''రోజూ కాలేజీకి వెళ్ళి వస్తారా?'' ప్రశ్నించాడు బలరామయ్య.

''అవును పెద్దయ్యా!'' అంది సౌజన్య.

''రోజూ బస్సుల్లో తిరగడం మంచిది కాదమ్మా, కాలం బాలేదు''

''భయపడితే మనం బతకలేం పెద్దయ్యా! రోజురోజుకూ పెరిగిపోతున్న అరాచకాలు ఇలాగే కొనసాగితే స్త్రీ పురుషులంతా అంటే ఈతరం యువతీయువకులంతా తప్పనిసరిగా సైనిక శిక్షణ పొందాలేమో'' అంది శకుంతల.

''మా మామ మీకు పెద్దయ్య ఎలా అవుతాడు, మీకూ మామే'' అన్నాడు రామలింగం.

''పెద్దయ్యంటే తప్పా?'' అన్నారు శకుంతల, సౌజన్యలు.

''తప్పా తప్పున్నరా!''

''వావి వరసల సంగతి ఉండనీ కానీ, నీతో ముఖ్యమయిన విషయం మాట్లాడాలి; కాసేపు ట్యూషను వదలి వేయలేవూ?'' అన్నాడు బలరామయ్య ఆడపిల్లల్ని శ్రీనివాసుల్ని మార్చి మార్చి చూస్తూ.

''అవును... ఉద్యోగంలో చేరిన శుభసందర్భం పురస్కరించుకొని అమ్మాయిలకు సెలవు వదిలేస్తే బావుంటుంది'' అన్నాడు రామలింగం కాఫీ గ్లాసు కింద పెడుతూ.

''సరే, వెళ్ళండమ్మా... తెల్లవారి రండి'' అన్నాడు శ్రీనివాసులు.

అమ్మాయిలు పుస్తకాలు సర్దుకొని, వెళ్లడానికి సిద్ధపడుతుండగా, ''నేను ఉండొచ్చా లేక నన్నూ వెళ్లమంటారా మామా?'' అన్నాడు రామలింగం.

''అల్లుడివి నువ్వు లేకపోతే ఏం బావుంటుంది? నిన్ను పిలుచుకొని రావాలని మీ ఇంటికి వెళ్లాను. ఇప్పుడే అన్నయ్యగారింటికి వెళ్లారని చెప్పింది మా అమ్మాయి''

''అయితే నేను ఉండొచ్చన్నమాట''

''శీనూ...''

''చెప్పండి చిన్నాన్నా''

''స్టౌ మీద ఏమయినా పెట్టావా?''

''వంటగదిలోకి వెళ్దామంటారా?'' అన్నాడు శ్రీనివాసులు.

''రామలింగం... మీ బావ భలే తెలివయినవాడోయ్. నా మనసు కనిపెట్టాడు చూడు'' అంటూ లోనికి నడిచాడు బలరామయ్య. ఒకరి ముఖం ఒకరు చూసుకుంటూ బలరామయ్యను అనుసరించారు రామలింగం, శ్రీనివాసులు.

బలరామయ్య కూచున్న తరువాత తను కూచొని, రామలింగాన్ని కూచోమన్నాడు శ్రీనివాసులు.

"ఉద్యోగం వచ్చినట్లేగా?" అడిగాడు బలరామయ్య.

"ఇంకా అనుమానమా బాబాయ్?"

"అది కాదు బాబూ, పర్మనెంటు ఉద్యోగమే కదా?"

"ఆర్డర్సులోనేమో టెంపరరీ అన్నారు. అయినా రెగ్యులరైజ్ చేస్తారు. సెలక్టయిన వాళ్ళను తీసివేయడం జరగదు"

"వంట చేసుకొని సమయానికి స్కూలుకు వెళ్లాలంటే కష్టం కదా?"

"భుజంగం ఉన్నాడు కదా?"

"వానికి మాత్రం కష్టంకదా వంటాచేసి, వ్యవసాయమూ చేయాలంటే"

"వీలు లేనప్పుడు ఏంచేయాలి మరి?" అన్నాడు శ్రీనివాసులు.

"పెళ్ళి చేసుకోవచ్చుగదా?" అన్నాడు బలరామయ్య.

"మామయ్య మంచి మాట చెప్పారు" సమర్థించాడు రామలింగం.

"పెళ్లికేం తొందర చిన్నాన్నా?"

"రెండేళ్ల క్రితం అడిగితే ఇదే మాటన్నావు. ఇంకేం... పెళ్లి వయసొచ్చింది, ఉద్యోగమూ వచ్చింది. పైగా ఇంట్లో ఆడదిక్కు లేదు. ఎన్నాళ్లని చెయ్యి కాల్చుకుంటారు?"

"ఎవరేనా అడిగారా?" ప్రశ్నించాడు రామలింగం.

"బంధుత్వం పోగొట్టుకోలేక, ప్రధానంగా మా అన్నగారికిచ్చినమాట నిలబెట్టుకోవాలన్న అభిప్రాయంతో మళ్లీ ఒకసారి అడిగి వెళ్దామని వచ్చాను"

"మీ అన్నగారా? ఎవరు? మీ తండ్రికి మీరొక్కరేగదా?" సందేహం వెలిబుచ్చాడు రామలింగం.

"నాకు స్వంత అన్నదమ్ములు లేకపోయినా శ్రీనివాసులు తండ్రి నాకు అన్నలాంటివారే. ఆయన పోతూ పోతూ చేతిలో చెయ్యివేయించుకొనిపోయారు. ఆయనకు ఇచ్చిన మాట నిలబెట్టుకోవాలిగా?"

"ఏమని ప్రమాణం చేయించుకున్నారు?"

"నా పిల్లలు దిక్కులేనివాళ్లయిపోతున్నారు. వాళ్లు పెద్దయ్యేవరకు పెద్దదిక్కుగా ఉండి, కనీసం శీనుకు పెళ్లిచేసే బాధ్యత వహించు. చేస్తానని నాచేతిలో చెయ్యివెయ్యమని వేయించుకున్నాడు. ఆయనకు ఇచ్చిన మాట ప్రకారం శీనుకు పెళ్లిచేయవలసిన బాధ్యత నాదేకదా?" అన్నాడు బలరామయ్య.

"అవునా బావా?" శ్రీనివాసుల్ని అడిగాడు రామలింగం.

"ఏమో... నాకు జ్ఞాపకంలేదు. మా చిన్నాన్నగారు మాత్రం అబద్ధం చెబుతారా? అయినా కాస్త ఆలోచించుకోనివ్వండి చిన్నాన్నా" అన్నాడు శ్రీనివాసులు అభ్యర్థనగా.

"ఆలోచించుకోబాబూ... ఆలోచించుకో! ఓ పదిరోజుల్లో నీ నిర్ణయం చెప్పు. తొందరేంలేదు" అంటూ లేచి, "వస్తామరి... ఓ వారం తరువాత వచ్చి మాట్లాడతా" అన్నాడు.

"అదేపనిగా మీరు రావాలా బాబాయ్? నేనే మీ ఇంటికి వచ్చి నా అభిప్రాయం తెలియజేస్తాను" అన్నాడు శ్రీనివాసులు వినయంగా తనూలేచి నిల్చుని.

"మంచిది బాబూ, వెళ్లొస్తాను మరి!" అంటూ వెళ్లిపోయాడు బలరామయ్య.

"ఈ విషయంలోనే అప్పుడేదో అవకతవకలు చేశారు కదూ?" అన్నాడు రామలింగం కొంచెంసేపు ఆగి.

"నిండిన చెరువులోకి కప్పలు చేరతాయని చెప్పాడుగా సుమతి శతక కర్త!"

"వారం రోజులు గడువుందిగా, మళ్లీ వస్తా" అంటూ వెళ్లిపోయాడు రామలింగం.

బియ్యం కడిగి స్టౌ మీదపెట్టి ఆలోచించసాగాడు శ్రీనివాసులు.

బలరామయ్యగారేమో మానాన్న చేతిలో చెయ్యేసి మాట ఇచ్చానని, ఆ మాట నిలుపుకోవడం తన ధర్మమని చెబుతున్నారు. అయితే నాకు తెలిసినంతవరకూ ఆయనకూ, మానాన్నగారికి పెద్దస్నేహంలేదు. మా అమ్మ చనిపోయినప్పుడు, ఆ తరువాత మాకు అండగా ఉండి





ఆదుకున్నవాళ్లు దామోదరయ్య, సంజీవయ్య లేగానీ వీరెవ్వరూకాదు.

వాళ్ల పేర్లు జ్ఞాపకం రాగానే వాళ్లకు సంబంధించిన సంఘటన, వాళ్లకూ, తనకూ జరిగిన సంభాషణ శ్రీనివాసులు మస్తిష్కంలో మెదిలాయి.

ఉదయం ఏడుగంటలు. పొయ్యిదగ్గర కూచొని కట్టెలు ఎగదోస్తూ మరోవేపు ఏదో పుస్తకం చదువుతున్నాడు తను. ఆకాశమంతా మబ్బులు కమ్మాయి. సూర్యోదయమయినా అయినట్లులేదు. బయట ఎవరో గుసగుసలా డుతున్నట్లు అస్పష్టమయిన సవ్వడి. ఇంత పొద్దున్నే ఎవరొచ్చారబ్బా, అనుకుంటూండగా, "అన్నయ్యున్నాడా భుజంగం?" అన్నమాట వినిపించింది.

"ఆ.... మస్తుగా ఉన్నాడు....!" అన్నాడు వెటకారంగా భుజంగం.

"ఏంచేస్తున్నాడు నాయనా?" ప్రశ్నించింది మరో కంఠం.

"సదుగుతా ఉండాడు" మరీ వెటకారంగా జవాబిచ్చాడు భుజంగం.

"బాబూ, శీనూ?" బిగ్గరగా పిలిచారు ఇద్దరూ ఒకేసారి.

"ఎవరూ?" అంటూ లేచి, వాకిట్లోకి వచ్చి, "రండి రండి... చిన్నాన్నగార్లిద్దరూ పొద్దున్నే వచ్చారే- కూచోండి!" అన్నాడు చాపపరచి తను.

"రాక తప్పుతుందా నాయనా?" అన్నాడు సంజీవయ్య.

"ఎవరితోనయినా చెప్పి పంపితే నేనే వచ్చేవాణ్నిగా" అన్నాడు తను.

"మాతో నీకు పనిఉంటే నువ్వు మా వద్దకు రావాలి. నీతో మాకు పని పడితే మేం రావడమే మర్యాదగదా" అన్నాడు దామోదరం.

"కొత్తగా మాట్లాడుతున్నారే, పిల్లవాడికి నాకేం మర్యాద?"

"చిన్న పామయినా పెద్ద కర్రతో కొట్టాలన్నారు పెద్దలు" అన్నాడు సంజీవయ్య.

"నన్ను పాముతో పోలుస్తారేం చిన్నాన్నా?"

"అవును... నిన్ను పాముతో పోల్చడం పొరపాటే, తప్పు ఒప్పుకుంటున్నాం. పాముకంటే ప్రమాదమయిన ప్రాణి ఏదయినా ఉందేమో మాకు తెలియక పాముతో పోల్చాము" అన్నాడు దామోదరం.

"అయితే నేను పాముకంటే చెడ్డవాడినన్న మాట?"

"అది నువ్వు నిర్ణయించుకోవలసిన విషయం" అన్నాడు సంజీవయ్య.

"చేతనయితే సాటిమానవునికి మేలుచేయాలి. లేకపోతే ఊరక ఉండాలి. అపకారం మాత్రం చేయకూడదని నాసిద్ధాంతం"

"మరి మేం సాటిమానవులంకాదా..." అన్నారు ఇద్దరూ.

"కాదని నేనన్నానా?"

"ఏ ఉద్దేశంతో మాకు చెడుతలపెట్టావు మరి?" అడిగాడు సంజీవయ్య.

"నేనా... మీకు చెడువు తలపెట్టానా?" ప్రశ్నించాడు తను ఆశ్చర్యపడుతూ.

"అవును... నువ్వే చెడుతలపెట్టావు కను కనే పొద్దున్నే మీ ఇంటికి వచ్చాం" అన్నాడు దామోదరం.

"డొంక తిరుగుడుగా మాట్లాడకండి. నాకు తెలిసినంతవరకూ మీకేకాదు, ఎవరికీ ఎలాంటి అపకారం చేయలేదు. అపకారికి కూడా ఉపకారం చేయాలనే సిద్ధాంతం నాది" అన్నాగు తను.

"అయితే నీకు ఎలాంటి అపకారమూ చేయని మామీద తప్పుడు సాక్ష్యం చెప్పడానికి ఎందుకు సిద్ధపడ్డావు?" అడిగాడు సంజీవయ్య.

సూటిగా గుండెకు తగిలిన కరెంటు షాక్ లాంటి ఆ మాటకు నిశ్చేష్టుడయి కాసేపు నోరు మెదపలేకపోయాడు తను. అంతలోనే తేరుకొని- "నేను తప్పుడు సాక్ష్యం చెప్పడానికి సిద్ధమయ్యానా?" అన్నాడు దీనంగా.

"అయితే మేం అబద్ధం చెబుతున్నామని అనుకుంటున్నావా?" ఎదురు ప్రశ్నవేశాడు దామోదరం.

"విషయమేమిటో అర్థమయ్యేలా ఉన్నది ఉన్నట్లు చెప్పండి"

"అయితే సాక్ష్యం గురించి నీకేమీ తెలియ

దంటావా?'' అన్నాడు సంజీవయ్య.

''తెలియనిదే తెలుసునని చెప్ప మంటారా?''

జేబులోనుంచి ఓ కాగితంతీసి తన చేతికి చ్చాడు సంజీవయ్య.

కాగితం ఇటుఅటు తిప్పిచూసి, ''ఇదేమిటో ఇంగ్లీషులో ఉంది. విషయం చెప్పండి'' అన్నా డు.

''కనీసం నీపేరయినా కనుక్కోలేవా?'' అన్నాడు దామోదరం.

''ఏబిసిడిలే రావుగా''

''లింగరాజుగారి మామిడిచెట్లు నరికివేసిన విషయం తెలునుగదా?'' అడిగాడు దామో దరం.

''ఎవరో చెప్పారు''

''చెప్పడంకాదు... నేనూ, దామోదరం నరు కుతూండగా సువ్వు స్వయంగా చూసినట్లు, కోర్టులో ప్రయివేటు కంప్లయింటు ఇచ్చారు. అందులో నువ్వు మొదటి సాక్షివి'' అన్నాడు సంజీవయ్య.

''నన్ను సాక్షిగా వేసుకున్నారా? చూడని విషయాన్ని చూసినట్లు ఎలా చెబుతాననుకు న్నారో?''

''నిన్ను సంప్రదించకుండా సాక్షిగా వేసుకు న్నారా?'' ప్రశ్నించాడు దామోదరం.

''సంప్రదించకపోవడమేకాదు. ఈనాటికీ ఎవరూ, ఏమీ చెప్పలేదు. బహుశా నన్నూ ఓ పెంపుడు కుక్కగా భావించిఉంటారు'' అన్నా డు తను ఆవేశంగా.

''అంతేకాదు... మిగతా ఇద్దరు సాక్షులూ ఎవరో తెలుసా?'' అన్నాడు సంజీవయ్య.

''తెలియదు''

ఎవరో ఇద్దరు పేర్లు చెప్పారు.

''వాళ్లస్థాయి ఏమిటో తెలుసా?'' అన్నాడు మళ్లీ సంజీవయ్య.

''తెలియదు... అయినా వాళ్లస్థాయితో మనకు పనేముంది?''

''అదికాదు నాబాధ, నిన్ను ఆ తాగుబోతుల సరసన నిలబెట్టారే అని'' అన్నాడు సంజీవ య్య బాధపడుతూ.

''మొత్తానికి సాక్ష్యం విషయంలో నీ అభి ప్రాయం చెప్పలేదు'' అన్నాడు దామోదరం.

''చెప్పను''

''బలరామయ్య బలవంతం చెయ్యొచ్చు'' అన్నాడు సంజీవయ్య.

''చూడని విషయాన్ని చూసినట్లు చెప్ప మని బ్రహ్మదేవుడే వచ్చి చెప్పినా చెప్పను''

''బెదిరించవచ్చు''

''కుందేలునా బెదురుకోవడానికి?''

''ప్రలోభపెట్ట వచ్చు''

''దేనికీ లొంగను''

''తినబోతూ రుచి అడగనేల, వెళ్తాం'' అన్నాడు దామోదరం.

''మంచిది... వెళ్లిరండి!''

''మరో విషయం నాయనా! ఆనాడు మీ అమ్మ చనిపోయినప్పుడు శవాన్ని కాటికి తీసుక పోవడానిక్కూడా ఎవరూ లేరు. ఈనాడు మీ చిన్నాన్నని చెప్పుకుంటున్న బలరామయ్య మీ ఇంటి పరిసరాలకు కూడా రాలేదు. మేం ఇద్దరమే మీ అమ్మశవాన్ని కర్రకు కట్టుకొని శ్మశానానికి తీసుకెళ్లి అంత్యక్రియలు జరిపాం. బహుశా నీకు జ్ఞాపకం ఉండే ఉంటుంది'' అన్నాడు సంజీవయ్య వెళ్తూ వెళ్తూ.

మాడువాసన ముక్కుపుటాల్ని అదరగొట్టే సరికి ఈ లోకంలోకి వచ్చి చూశాడు శ్రీనివాసు లు. స్టౌమీది అన్నం మాడిపోయింది. ఆ పాత్ర దించాడు.

వెళ్తూ వెళ్తూ సంజీవయ్య అన్న మాటలు గతస్మృతుల మీద కప్పిన మరుపు అనే దు మ్మును దులిపేశాయి.

రాత్రి అన్నం తినిపడుకున్నాడుగానీ నిద్ర రాక పరుపుమీద పొర్లసాగాడు. చిన్ననాటి జ్ఞాప కాలు మనోనేత్రం ముందు సినిమా రీలులా తిరగసాగాయి. ఆలోచనల వెల్లువలో కొట్టుకొని పోతున్నాడు శ్రీనివాసులు.

సంజీవయ్య చెప్పింది అబద్ధంకాదు. అమ్మ చనిపోయేనాటికి తన వయసు ఐదారేళ్లకంటే ఎక్కువలేదు. కనీసం అమ్మ ఆకారం లీలగాన యినా జ్ఞాపకంలేదు. అమ్మ ఫొటో కూడా లేదు.




జీవితవిధానంలో ఎంతమార్పువచ్చింది. ఈనాడు బారసాలరోజు, నామకరణంరోజు శిశువు ఫొటోలు తీస్తున్నారు. కాస్త ఉన్నవాళ్లయితే వీడియోకేసెట్టు తీయిస్తున్నారు. మరి ఆనాడు మా అమ్మ ఫొటో ఏ సందర్భంలోనూ తీయలేదు. అమ్మ ఫొటో ఒక్కటే కాదు. నాన్న ఫొటో కూడా లేదు. అమ్మ తరవాత నాన్నే నన్నూ నా తమ్ముణ్ణీ తల్లిలా పెంచాడు. మరో ఐదేళ్ళకు నాన్న ఆరోగ్యం చెడిపోయింది. ఇక బతకనన్న అనుమానం కలిగిందేమో చదువుమాన్పించేసి నాకు దర్జీపని నేర్పించారు. ఆయనకు మంత్ర-తంత్రాలమీద నమ్మకం. అందువల్ల నాటువైద్యుల పట్ల ఉండే నమ్మకం డాక్టర్లమీద ఉండేదికాదు. ఆయనకేం పెద్ద జబ్బేంకాదు. మలేరియా అని నా ఊహ. కడుపులో గడ్డ వచ్చింది. ఆ వ్యాధికి ఆయన చేయించుకున్న చికిత్సనాకు ఇప్పటికీ జ్ఞాపకం ఉంది. కొబ్బరికాయకు రంధ్రంచేసి, అందులో కొన్ని వస్తువులువేసి, ఆ కొబ్బరికాయను పొయ్యిలో పూడ్చిపెట్టి, దానిమీద మామూలుగా రోజూ మంట వేయమన్నాడు నాటువైద్యుడు. వారం తరవాత కొబ్బరికాయ బయటికి తీసి, మాడిపోయిన కొబ్బరిని రోటిలోవేసి మెత్తగా నూరి, అందులో తాటిబెల్లము, తేనె, ఎండుద్రాక్ష కలిపి రోజూ ఉదయమూ, సాయంత్రమూ గచ్చకాయ ప్రమాణం సేవించమనీ ఆ లేహ్యం అయిపోయేసరికి కడుపులో గడ్డకరిగిపోయి మనిషి యువకునిలా తయారవుతాడని, ప్రస్తుతం తనకు ఏమీ ప్రతిఫలం అవసరంలేదని, జబ్బునయమయితే సంవత్సరం తరువాత ఆవును ఇవ్వాలని చెప్పి కోడిపెట్ట, ఐదు రూపాయలు తీసుకొని వెళ్లిపోయాడు వైద్యుడు. లేహ్యం అయిపోయేసరికి కడుపులో గడ్డ కరిగిపోలేదుకానీ మనిషేవెళ్లిపోయాడు. నాటువైద్యుల్ని చూస్తే ఈనాటికీ ఆ వైద్యుడు, అతనితోబాటు నాన్న జ్ఞాపకంవస్తారు.

గుడ్డలు కుట్టగా వచ్చిన డబ్బుతో ఇంటి అవసరాలు తీరుతున్నాయిగానీ, అందరితో బాటూ చదువుకోలేకపోయాననే అన్నభావం తరచుకలుగుతూనే ఉంది. నేను తెలివయిన వాడినన్న విషయం ఎలిమెంటరీ స్కూల్లో చదివేటప్పుడే ఊళ్లో కొంతమంది పెద్దలకు తెలుసు. పెద్దవెంకటరెడ్డిగారు జామెంట్రీ భిన్నాలు, భూగోళం, చరిత్రబోధించి ఐదో తరగతితో ఆగిపోయిన చదువును ముందుకుసాగేలా చేశారు.

పాపిరెడ్డిగారు, నరసరాజుగారు హిందీ బోధించి, పరీక్షలకు చదవవలసిన పద్ధతి తెలియజేశారు.

ఆలోచిస్తూ, ఆలోచిస్తూ ఎప్పుడో నిద్రపట్టింది.



రాత్రంతా నిద్రసరిగా లేనందువల్ల తెల్లవారి ఆలస్యంగా లేచాడు శ్రీనివాసులు. లేచాడుకానీ కళ్లలో నిద్రమత్తు తగ్గలేదు. పళ్లుతోముకుంటూ బాత్‌రూములోకి వెళ్లాడు. ముఖం కడుక్కొని టవల్తో తుడుచుకుంటూ ఇంట్లోకి వచ్చి, స్టౌ వెలిగించి పాత్రలో నీళ్లుపోసి స్టౌమీద పెట్టాడు. కాఫీ తయారుచేసి తమ్మునికిచ్చి, తను తాగుతూ ఉండగా శకుంతల, సౌజన్యలు వచ్చి- ''నమస్కారం సార్'' అన్నారు.

ప్రతినమస్కారం చేసి, ''కూచోండి!'' అన్నాడు.

కూచుని ఏదో గుసగుసలాడసాగారు.

శ్రీనివాసులు వచ్చి, కుర్చీలో కూచుని ''నిన్న కావలసిన పాఠం అనవసరంగా ఈ రోజుకు వాయిదా పడింది'' అన్నాడు.

''గడిచిపోయిన కాలాన్ని గురించి ఆలోచించకూడదని మీరే చెప్పారుగా?'' అంది శకుంతల.

''ఆలోచించీ ప్రయోజనం లేదుగా? అందుకే ఆలోచించకూడదని చెప్పారు. సరే... పాఠం తీసుకోండి చదువమ్మా సౌజన్యా!''

''సాథ్‌బడే పరమారథీ, ఘన్‌జ్యోం బరసే ఆయ్.''

తపన్ బుఝావై ఔర్‌కీ, అప్నో పారస్‌లాయ్

సత్పురుషులను గురించి కబీరుదాసు ఎంత చక్కగా చెప్పాడో చూడండి.

కబీరుదాసుగారు సాధు పురుషులను మేఘాలతో పోల్చారు. మేఘాలు భేదభావం లేకుండా సర్వత్రా వర్షించి లోకులకు మేలు చేసినట్లే సజ్జనులు కూడా పరోపకారమే తమ జీవితలక్ష్యంగా భావించి ప్రజాసేవ చేస్తారు- అని ఈ దోహా భావం. తరువాత?

''వృచ్ఛకబహుమః నహీః ఫల్‌భఖై, నదీన నంచైనీర్

పరమారథకే కారనే, సాధున్ ధరా సరీర్.''

''ఈ దోహాలో సత్పురుషులను వృక్షములతోను, నదితోను పోల్చారు కబీరుదాసుగారు. ఎలాగ అంటే? వృక్షాలు కాచిన ఫలాలను స్వయంగా భక్షించవు. అలాగే నదులు కూడా తమలో ప్రవహిస్తున్న నీటిని తాగవు. వృక్షాలు పరులకు ఇవ్వడానికే ఫలాలు కాస్తాయి. అలాగే నదులు కూడా ప్రాణికోటి దాహం తీర్చడానికి, పొలాలను తడిపి పంటలు పండించి, పరులకు మేలు చేయడానికి తమలో నీరు నింపుకుంటాయి. అదేవిధంగా సజ్జనులు జీవితాంతమూ పరోపకారార్థం పాటుపడతారు.

''అబ్దుల్ రహీమ్‌ఖాన్ ఖానా కూడా ఇదే అర్థం వచ్చేలా ఓ దోహా చెప్పారు. చెబుతాను వినండి, అవసరమయితే రాసుకోండి.

''తరువర్ ఫల్ నహీః ఖాత్‌హై, సరవర్ పియహిన పాన్

కహి రహీమ్ పరకాజ్ హిత్, సంపతి సంచహి సుజాన్ ''

''తులసీదాసు కూడా ఇలాంటి అర్థం వచ్చేలా ఒక దోహా చెప్పారు కద సార్''. అంది శకుంతల.

''అవునమ్మా చెప్పారు. అది చెప్పగలవా?''

''చెబుతాను సార్!''

''చెప్పమ్మా!''

''తులసీ సంత్‌సు అంబతరు, ఫూలి ఫలహిః పరహేత్ ''

ఇత్‌తే యే పాహన్ హనత్, ఉత్‌తేవే ఫల్ దేత్''- చెప్పింది శకుంతల.

''భావం చెప్పగలవా?'' అడిగాడు శ్రీనివాసులు.

''మీరే చెప్పండి సార్''

''చూడండమ్మా... తులసీదాసు సాధువులను గురించి తన అభిప్రాయం వెల్లడించడానికి కబీరుదాసు, రహీమ్‌ల కంటే మరో అడుగు ముందుకువేశాడు. సత్పురుషులను ఆయన మంచి మామిడి వృక్షంతో పోల్చారు. మామిడి వృక్షం పరులకోసమే పూచి కాస్తుందట. కాయలు కాసినప్పుడు రాళ్లతో కొడతారుకదా జనం? జనం వేసిన రాళ్ల దెబ్బలు తిని, రాళ్లతో కొట్టినవారికే అది తీయని ఫలాలు ఇస్తుంది. ఆదే విధంగా సజ్జనులు కూడా స్వయంగా కష్టాలు అనుభవించి, తమకు అపకారం చేసినవారికి కూడా ఉపకారం చేస్తారు''

''తరువాత నువ్వు చదువు శకుంతలా!''

''జాతినపూఛో సాధుకీ, పూఛ్‌లీజియే జ్ఞాన్.

మోల్ కరో తర్‌వార్‌కా, పడా రహన్ దో మ్యాన్''

సాధు పురుషుల కుల-మతాల గురించి ప్రశ్నించకూడదని చెప్పారు కబీరుదాసుగారు. ఒకవేళ వారిని గురించి తెలుసుకోవాలన్న జిజ్ఞాస కలిగితే వారి జ్ఞానాన్ని గురించి తెలుసుకోమన్నారు. కత్తిని కొనాలని అనుకున్నవాళ్లె వరయినా పదును పరీక్షించి కొంటారుగాని, ఒర మంచిదో కాదోనని ఎవరూ ఆలోచించరు. అంటే కులాన్ని ఒరతోను, జ్ఞానాన్ని పదును గల కత్తితోను పోల్చారు.

''ఒర అంటే ఏమిటి సార్?'' అడిగింది సౌజన్య.

''బాణాలు పెట్టుకోవడానికి పొది ఉంటుంది కదమ్మా. అలాగే కత్తిని ఒరలో ఉంచుతారు. డ్రామాల్లోనో, సినిమాల్లోనో చూసే ఉంటారు. యుద్ధంలో వీరులు తమ నడుములో కట్టుకున్న ఒరలో నుంచి కత్తి తీసి ఝుళిపిస్తూంటారు'' వివరించాడు శ్రీనివాసులు.

''టి.వి.లో ప్రదర్శించే పౌరాణిక నాటకాల్లో కూడా చూశాం సార్''

''కులమతాలు, గుణగణాల విషయంలో




యోగి వేమన కూడా ఇదే అభిప్రాయం వెల్లడిస్తూ పద్యం చెప్పారు'' అన్నాడు శ్రీనివాసులు.

''చెప్పండి సార్- చెప్పండి సార్'' అన్నారు అమ్మాయిలిద్దరూ ఒకేసారి.

''వినండి... గుణములు కలవాని కుల మెంచగానేల
గుణము కలిగెనేని కోటిసేయు
గుణము లేకయున్న గుడ్డి గవ్వయులేదు
విశ్వదాభిరామ వినురవేమ''

పద్యం చెప్పి, ''తరువాత చదువమ్మా'' అన్నాడు శ్రీనివాసులు.

''గురు, గోవింద దోవూఖడే, కాకేలా గ్రొంపాంయ్''
బలిహారీ గురు ఆప్నే గోవిందదియో బతాయ్''
చదివింది శకుంతల.

''భావం చెప్పగలరా?'' అడిగాడు శ్రీనివాసులు.

''చెప్పండి సార్!'' అంది సౌజన్య.

''చూడండి... కబీరుదాసు ఎంత గొప్ప విషయం చెప్పారో- గురువు, దేవుడు ఒకేచోట నిలుచున్నారట. ఇద్దరిలో ఎవరికి నమస్కరించాలన్న సందేహం కలిగిందట. ఆలోచించి ఆలోచించి ఆఖరుకు గురువుకే నమస్కరించాడట. దేవునికంటే గురువే గొప్పవాడు కాబట్టి గురువుకే నమస్కరించడం మంచిది అనుకున్నాడు. ఎందుకంటే దేవుడు ఉన్నాడని తెలియజెప్పిన వ్యక్తి గురువేనని, అందువల్ల దేవునికంటే గురువే గొప్పవాడు అని చెప్పారు.

''జపానులో కూడా గురువుకు మించిన దేవుడు లేడని భావిస్తారట. తల్లి-దండ్రులు తమ పిల్లలకు అలాంటి భావం కలగజేస్తారు. విద్య అభ్యసించడానికి శ్రద్ధ, భక్తి, పట్టుదల, క్రమశిక్షణ అవసరం. వీటిలో ఏది లోపించినా విద్య సక్రమంగా అభ్యసించలేం. మనకు తెలియని విషయాన్ని తెలియజెప్పిన ప్రతివ్యక్తి- గురువే. ప్రతి మనిషికి ప్రథమ గురువు తల్లి. తరువాతి గురువు తండ్రి. సమాజం, ప్రకృతి, విద్య గరపిన వ్యక్తి వీళ్లంతా గురువులే. పూర్వం గురువులకు చాలా ప్రాధాన్యం ఇచ్చేవాళ్లు. విలువిద్య నేర్చుకోవడానికి కర్ణుడు, ఏకలవ్యుడు ఎన్ని ఇబ్బందులుపడ్డారో మనం చదువుకున్నాం. విద్య అభ్యసించదలచుకున్నవారికి గురువు పట్ల పూజ్యభావం ఉండటం అవసరం. తనకు ఇష్టమయిన వస్తువును అపురూపంగా, ఆప్యాయంగా ఉంచుకోవడం మానవ స్వభావం. గురువుపట్ల భక్తి భావం పెంపొందితే ఆయన చెప్పేది వేదవాక్యంగా భావిస్తాడు శిష్యుడు. అలా భావించినప్పుడు గురువు బోధించిన ప్రతి విషయాన్ని శ్రద్ధగా నేర్చుకుంటారు. అందుకే గురుశిష్య సంబంధం సక్రమంగా ఉండాలంటారు అనుభవజ్ఞులు''

''మీకు గురువు లేరుగా?'' అడిగింది శకుంతల.

''ఎందుకు లేరు... ఒకరు కాదు, ఎంతో మంది గురువులున్నారు. ఒకవిధంగా చెప్పాలంటే నువ్వు కూడా గురువువే'' అన్నాడు శ్రీనివాసులు.

''నేనా... ఎలా సార్?'' అంది శకుంతల.

''ఇంగ్లీష్ నేర్చుకోవడానికి దారి చూపావు కదా?''

''నేను చెప్పకపోయినా మీరు తెలుసుకోలేరా స్వయంగా- ఇంగ్లీష్ నేర్చుకోవడానికి చదవవలసిన పుస్తకం ఏమిటో?''

''కామాయని చాల గొప్ప కావ్యమటగద సార్?'' అడిగింది సౌజన్య.

''ఎవరన్నారు?''

''మా లెక్చరరు చెప్పారు''

''అవును... చాలా గొప్ప కావ్యం. భారతీయ సంస్కృతిని ప్రతిబింబింపచేశారు కవి ఆ కావ్యంలో''

''ఎవరు రాశారు సార్?''

''జయశంకర్ ప్రసాద్''

''వెళ్తాం సార్... కాలేజికి టైం అవుతోంది'' అన్నారు అమ్మాయిలు.

''మంచిది- వెళ్లి రండి''

అమ్మాయిలిద్దరూ వెళ్లిపోయారు.

''హిందీ అంటే సాయిబులు మాట్లాడుకునే భాష అనుకున్నాను బావా, ఇంత మంచి సాహిత్యం ఉందని నాకు తెలీదు'' అన్నాడు రామలింగం అంతవరకూ విగ్రహంలా

కూర్చుని వింటున్నవాడల్లా.

"తెలీనివాళ్లంతా అలాగే అనుకుంటారు. నన్ను ఎందరో హేళన చేశారుగదా హిందీ చదివి ఊళ్లు ఏలుతాడని" అన్నాడు శ్రీనివాసులు.

"మనుషులకు అదేదో వింతరోగం బావా, తమకు లేనిది ఇతరులకు ఉండకూడదని అనుకుంటారు"

"అలా అనుకునేవాళ్లతో ప్రమాదంలేదు. తనకు అన్నీ ఉండాలి, ఇతరులకు ఏదీ ఉండకూడదు అనే అన్యాయపరులున్నారు- అలాంటివాళ్లతోనే ప్రమాదం"

"ఏం ప్రమాదం? వాళ్ల గాలి సోకకుండా దూరంగా ఉంటేసరి"

"ఇప్పుడు చర్చించడానికి సమయంలేదు గాని, మరెప్పుడయినా వివరంగా చెబుతాలే. ఈరోజు నీకు కృతజ్ఞతలు తెలియజేయాలని అనుకుంటున్నాను"

"ఎందుకూ... ఏంమేలు చేశానని?"

"మేలు చేయలేదా? ట్యూషను ప్రారంభించిన తరువాత వచ్చి ఒక్క మాటకూడా మాట్లాడకుండా, మవునంగా కూచోవడం మేలు చేసినట్లు కాదా?" అంటూ నవ్వాడు శ్రీనివాసులు.

"మాట్లాడి చీవాట్లు తినడం మంచిదా?"

"అయితే ఆరోజు పెట్టిన చీవాట్లు ఇంకా మరిచిపోలేదన్నమాట"

"ఎలా మరిచిపోతాను?"

"మరిచిపోకుండా జ్ఞాపకం ఉంచుకున్నందుక్కూడా కృతజ్ఞతలు చెప్పాలి"

"టైం లేదంటున్నావుగా, తరువాత చెబుదువులే- ఇప్పుడు నాకూ పని ఉంది. స్కూలుకు వెళ్లిరా సాయంత్రం మాట్లాడుకుందాం" అన్నాడు రామలింగం.

"సరే, అలాగే! సాయంత్రం కూడా ట్యూషనుంటుందిగా, రాత్రికి మాట్లాడుకుందాం. స్నానం చేయాలి" అంటూ బాత్‌రూమ్‌లోకి వెళ్లాడు శ్రీనివాసులు.

రామలింగం ఇంటికెళ్లాడు

'గణ... గణ... గణ...'మంటూ స్కూలు గంట మోగింది.

బిలబిలమంటూ పిల్లలు క్లాను రూముల్లో నుంచి ప్రేయరుగ్రౌండులోకి చేరసాగారు.

వరుసలు- వరుసలుగా వచ్చిన విద్యార్థులంతా క్లాసులవారిగా నిల్చున్నారు.

ఆడపిల్లలంతా ఒకవక్క నిల్చున్నారు.

క్లాను టీచర్లంతా పిల్లల వెనుక నిల్చున్నారు.

తను క్లాను టీచరు కాదు, ఎక్కడ నిల్చోవాలో పాలుపోలేదు శ్రీనివాసులుకు. ఇంతలో తెలుగు టీచరు వచ్చి బాలికల వెనుక నిల్చుంది. ఆమె కూడా క్లాను టీచరు కాదు. అందువల్ల అన్నిక్లాసులకు సంబంధించిన ఆడపిల్లల వెనుక నిల్చుందికాబోలు. తనూ ఆడపిల్లలవెనుకే నిల్చోవాలి కాబోలు అనుకున్నాడు. అంతలోనే ధర్మసందేహం కలిగింది- ఆమె ఆడమనిషి, అందువల్ల ఆడపిల్లలవెనుక నిల్చుందేమో, తను నిల్చోవచ్చో లేదో- ఓ క్షణం తటపటాయించాడు. పిల్లలందర్నీ సక్రమంగా నిల్చోబెట్టడంలో ఎస్‌పిఎల్‌కు సహాయంచేసిన డ్రిల్లుటీచరు వచ్చి బాలికల వెనుక, తెలుగు టీచరుకు కాస్త దూరంలో నిల్చున్నాడు. తను తప్పుగా ఊహించలేదని, తన ఊహ సక్రమమయినదేనని అనుకున్న శ్రీనివాసులు డ్రిల్లుటీచరు పక్కన నిల్చున్నాడు.

పిల్లలందర్నీ సరిగా నిలబెట్టి, హెడ్మాస్టరు గదిముందుకు వెళ్లి వాకిట్లో నిల్చుని సెల్యూట్ చేశాడు ఎస్‌పిఎల్. అతని ఆహ్వానం పురస్కరించుకొని, ప్రార్థనామైదానంలోకి వెళ్లి పిల్లలకు అభిముఖంగా నిల్చున్నాడు హెడ్మాస్టరు.

"స్కూల్ అటెన్షన్" అన్నాడు ఎస్.పి.ఎల్.

పిల్లలంతా అటెన్షన్‌లో నిల్చున్నారు.

"సిపిఎల్స్ రిపోర్టు" అన్నాడు ఎస్‌పిఎల్.

"సిక్స్‌క్లాస్ ఫార్టీటు బై ఫిఫ్టీ ప్రెజెంటు సార్!"

"సెవెంత్ క్లాస్ సెవెంటీత్రీబై నైంటీ సార్!"

వరుసగా పదోతరగతివరకూ ఆయా క్లాసు లీడర్లు తమ క్లాసుల హాజరు చెప్పారు.

ఎస్.పి.ఎల్. హెడ్మాస్టరుకు సెల్యూట్‌చేసి,

మొత్తం హాజరు చెప్పి తిరిగి తన స్థానంలోకి వెళ్లి నిల్చుని, "ప్రేయర్" అన్నాడు.

ప్రార్థన చెప్పారు ఇద్దరమ్మాయిలు కలసి.

"ప్లెడ్జ్..." అన్నాడు ఎస్.పి.ఎల్.

పిల్లలంతా కలిసి ప్రతిజ్ఞ చెప్పారు.

"స్టాండ్ అట్ ఈజ్" అన్నాడు ఎస్.పి.ఎల్.

విశ్రాంతిగా నిల్చున్నారు పిల్లలు.

"సోదర ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులారా, పిల్లల్లారా... ఈనాడు మనకందరికీ శుభదినం. నిన్న మన స్కూల్లో జాయినయిన కొత్త హిందీ పండితులు శ్రీనివాసులుగారిని పరిచయం చేస్తాను. నిన్ననే చేయవలసింది. అయితే ప్రేయరు ముగిసిన తరువాత వచ్చి జాయిన యినందువల్ల నిన్న పరిచయం చేయలేకపో యాను" అంటూ శ్రీనివాసులువేపు చూసి, "ఇక్కడికి రండి!" అన్నాడు హెడ్మాస్టరు.

శ్రీనివాసులు వెళ్లి హెడ్మాస్టరుగారికి-ఎస్.పి.ఎల్.కు మధ్య నిల్చున్నాడు.

"శ్రీనివాసులుగారు ఈ ఊరివారేకాబట్టి వీరి నిగురించి నాకంటే మీకే బాగా తెలును. అయినా కొత్తగా వచ్చిన టీచరును పరిచయం చేయడం హెడ్మాస్టరుగా నా బాధ్యత. ఇంతవ రకూ వచ్చిన ఉపాధ్యాయులకు, వీరికీ ఒక ముఖ్యమైన భేదం ఉంది. మిగతావాళ్లంతా హైస్కూల్లోనో, కాలేజీలోనో చదువుకొని టీచ రుగా వచ్చారు. వీరు హైస్కూల్లో చదవకుండా హైస్కూలు టీచర్గా వచ్చారు. అదే వీరి ప్రత్యేకత. తల్లిదండ్రుల మరణంతో వీరి చదువు అయిదోతరగతితో ఆగిపోయింది. తరువాత తన తెలివితేటలు ఉపయోగించి ఇంటివద్దనే ప్రైవేటుగా హిందీ చదువుకొని 'కృషితో నాస్తి దుర్భిక్షం' అనే సామెతను రుజువుచేసిన వీరిని చూసి చదువుపట్ల నిర్ల క్ష్యంతో వ్యవహరించే ఈనాటి ఆకతాయి విద్యా ర్థులకు కనువిప్పు కలుగుతుందని విశ్వసిస్తు న్నాను. వీరి రాకతో మన స్కూలుకు కొత్తవెలు గు వస్తుందని ఆశిస్తూ, వీరు పిల్లలకు నాలుగు మాటలు చెప్పగలరని కోరుతూ విరమిస్తున్నా ను" అంటూ ఉపన్యాసం ముగించాడు హెడ్మా స్టరు.

పిల్లల కరతాళ ధ్వనులతో ప్రేయరు గ్రౌండు మార్మోగింది.

చాలామంది ఉపాధ్యాయులు ఒకరిముఖా లొకరు చూసుకొని భావగర్భితంగా నవ్వుకున్నా రు. బాలికల వెనుక నిల్చున్న డ్రిల్లుమాస్టరు, గణితోపాధ్యాయునివద్దకు వెళ్లి పలికరించాడు.

శ్రీనివాసులు ఒక అడుగు ముందుకువేసి-"గౌరవనీయులయిన ప్రధానోపాధ్యాయులుగా రు, సోదర ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు, బాల, బాలికలారా!" అంటూ సంబోధించాడు. అంతవరకూ గుసగుసలాడుతున్న పిల్లలు, ఉపాధ్యాయులు నిశ్శబ్దంగా నిల్చున్నారు.

"ప్రధానోపాధ్యాయులుగారు అనుమతిస్తే నేను ఓ విషయం చెప్పదలచుకున్నాను" అన్నాడు శ్రీనివాసులు.

"నో అబ్జక్షన్- చెప్పండి" అన్నాడు హెడ్మాష్ట రు.

"ఎండలో చాలాసేపు నిల్చున్నందువల్ల కొంతమంది పిల్లలు విసుక్కుంటున్నట్లు కనబ డుతోంది. ఇంకా నిల్చుంటే కొంతమంది కళ్లు తిరిగి పడిపోవచ్చు. కాబట్టి పిల్లలంతా ఎవరె వరి స్థానంలో వాళ్ళు కూచోండి" అన్నాడు.

పిల్లలంతా కూచొని హాయిగా గాలి పీల్చుకు న్నారు.

"హెడ్మాష్టరుగారికి, ఉపాధ్యాయులకు కుర్చీలు వేయండి" అన్నాడు.

"అవసరంలేదు... అవసరంలేదు. నిల్చుంటాం... త్వరగా ముగించండి!" అన్నా రు కొంతమంది ఉపాధ్యాయులు.

"ఇంతవరకూ మన హెడ్మాష్టరుగారు నన్ను గొప్పగా పొగిడారు. ఆయనకు నాపట్ల గల ప్రేమానురాగాలు ఆ రూపంలో ప్రతిబింబించా యని నా అభిప్రాయం. పట్టుదల, ప్రయత్న మూ ఉంటే మానవుడు ఏ కార్యమయినా సాధించవచ్చునని, 'సాధనమున పనులు సమ కూరు ధరలోన' అని యోగివేమనగారు ఏనాడో చెప్పారు. వాయిదా వేయకుండా ఏరోజు చేయ వలసినపని ఆరోజే చేసుకుంటూపోతే ఎంతటి ఘనకార్యమయినా అవలీలగా సాధించవచ్చు. రోజూ కొద్దికొద్దిగా వండుకొని తింటున్న బియ్యం సంవత్సరకాలంలో ఒక మనిషి ఒక




క్వింటాలు బియ్యం తినవచ్చు. అయితే ఒకే రోజు క్వింటాలు బియ్యం అన్నం వండి ఒకడే తినలేడు కదా? అలాగే మీరు ఏ రోజు జరిగిన పాఠాలు ఆరోజే నేర్చుకుంటే సంవత్సరాంతంలో పరీక్ష రాయడం సులభం. రేపు చదువుదాం, ఎల్లుండి చదువుదాం అని వాయిదావేస్తూపోతే పాఠ్యాంశాలు పెరిగిపోతాయి. ఆఖరుకు ఏది చదవాలో దిక్కుతోచక ఏమీ చదవలేరు. విలువైన కాలాన్ని వృధాగా గడిపివేయకూడదని, ఎప్పుడు చేయవలసిన పని అప్పుడే చేయాలని కబీరుదాసుగారు అంటారు.

రేపు చేయవలసిన పని ఈరోజు, ఈరోజు చేయవలసినపని ఇప్పుడే చెయ్యాలి. ఏ క్షణంలో ఏ ప్రమాదం ముంచుకొస్తుందో మనకు తెలియదు. అలా ఏదయినా ప్రమాదం జరిగితే చేయాలకున్నపని చేయలేంగదా. ఎంతసేపయినా ఉపన్యసించడానికి ఇదేం ఉపన్యాస వేదిక కాదు. పైగా ఇక్కడున్నవాళ్లంతా విద్యావంతులు, వయసులో పెద్దవాళ్ళు. అంటే పిల్లల్ని గురించి చెప్పడంలేదు. ఉపాధ్యాయులు నాకంటే పెద్దవాళ్లని, అనుభవజ్ఞులని, బాగా చదువుకున్నవారని, వాళ్లంతా నన్ను సోదరునిగా భావించి, నా తప్పులను సరిదిద్ది, అవసరమయిన సలహాలిచ్చి, బోధన విషయంలోను, క్రమశిక్షణలోను నాకు సహకరించగలరని కోరుతూ, నాకు ఈ అవకాశం ఇచ్చిన ప్రధానోపాధ్యాయులుగారికి కృతజ్ఞతలు తెలియజేస్తూ, నేను చెప్పిన విషయాల్ని ఓపిగ్గా విన్న విద్యార్థినీవిద్యార్థులను అభినందిస్తూ విరమిస్తున్నాను'' అంటూ నమస్కరించాడు శ్రీనివాసులు.

పిల్లలంతా ఒక్క నిమిషంపాటు చప్పట్లు కొట్టారు.

''చిల్డ్రన్ స్టాండప్... అటెన్షన్... నేషనల్ యాంథెమ్ బిగిన్' అన్నాడు ఎస్.పి.యల్. జాతీయ గీతం పూర్తికాగానే, ''డిస్పర్స్'' అన్నాడు.

''జైహింద్!'' అంటూ అందరూ ఒకేసారి సెల్యూట్ చేసి, ఎవరెవరి క్లాసు రూములకు వారు వెళ్ళారు పిల్లలంతా.

ఉపాధ్యాయులు క్లాసులకు వెళ్లడానికి సూచనగా 'టంగ్...టంగ్' అంటూ గంట కొట్టాడు అటెండరు

★ ★ ★

సాయంత్రం శ్రీనివాసులు స్కూలు నుండి ఇంటికి వచ్చీరాగానే హాజరయ్యారు రామలింగం.

''ఉద్యోగం ఎలాఉంది బావా?'' అన్నాడు.

''ఉండవోయ్... ఇంకా ఇప్పుడిప్పుడే వచ్చాను. ముఖం కడుక్కొని, పాలో గీలో తాగింతరువాత మాట్లాడుకుందాం!'' అన్నాడు శ్రీనివాసులు.

''అదేంటి కొత్తగా, పాలూ గీలూ అంటున్నావ్? కాఫీ తాగవా?''

''తాగకూడదనుకున్నాను''

''తాగొద్దని ఎవరన్నా చెప్పారా... నువ్వే తాగ్గూడదనుకున్నావా?''

''విమలమ్మను చూశావా?''

''ఎవరు... ఏదో పోగొట్టుకొని వెదుకుతున్నట్లు నేలచూపులు చూస్తూ పోతుందే ఆమేనా?''

''అవును... ఆమే, తెలుగు టీచరు! అయినా నువ్వుకూడా ఏం అలా మారిపోయావు?''

''ఏం... ఏంమారిపోయాను?''

''చెబుతా ఉండు... ముఖం కడుక్కొని వస్తాను'' అంటూ బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు శ్రీనివాసులు.

ముఖం కడుక్కొని, టవల్తో తుడుచుకుంటూ ఇంట్లోకి వెళ్ళి, స్టౌ వెలిగించి, పాలు కాచి, రామలింగానికి ఒక గ్లాసు ఇచ్చి, తనూ ఓ గ్లాసు తీసుకొని తాగసాగాడు.

''ఏం మారాను బావా?''

''మారకపోతే ఏమిటోయ్? ఎదుటిమనిషి ఎలా ప్రవర్తించినా తప్పుపట్టడమేనా? పక్కకు చూడకుండా కిందికి చూస్తే నేల చూపులు చూస్తుందంటారు. పక్కలకు చూస్తే మనుమలవేపు భలే చూస్తుందంటారు. ఆమె విషయమే కాదు, డబ్బు ఖర్చుచేస్తే దుబారా చేస్తాడంటారు, ఖర్చు పెట్టకపోతే పిసినిగొట్టు అంటారు, ఎక్కువగా మాట్లాడితే వదరుబోతంటారు. మాట్లాడకపోతే ముచ్చువెధవంటారు. ఎవరు



ఎలాపోతే మనకెందుకులే అని ఇతరుల విష యాల్లో జోక్యం చేసుకోకపోతే పనికిరాని దద్దమ్మంటారు. జోక్యం చేసుకుంటే లిటిగెంటు అంటారు...''

''ఆపండి స్వామీ... బుద్ధి గడ్డితిని నోరు జారాను. పాలు తాగు- చల్లబడిపోతాయి'' అన్నాడు రామలింగం.

''సంతోషం... పశ్చాత్తాపపడ్డమే చేసిన తప్పు ఒప్పుకున్నట్లు''

''కాఫీ ఎవరన్నా తాగొద్దన్నారా అంటే, 'విమలమ్మను చూశావా?' అని అడిగావు. ఆమె తాగొద్దని చెప్పిందా?''

''చెప్పలేదుకానీ, ఆమె తాగదు''

''ఆమె తాగకపోతే నువ్వూ తాగకూడదా?''

''ఎందుకు తాగలేదని అడిగితే కాఫీ తాగడం వల్ల కలిగే చెడువులు గురించి చెప్పింది. తెలీక ముందు తాగాం. తెలిసి తెలిసి ఆరోగ్యం చెడకొట్టుకోవడం ఇష్టంలేక కాఫీ తాగకూడదని నిర్ణయించుకున్నాను''

''మంచి సలహా ఎవరిచ్చినా పాటించవల

Uma

సిందేననుకో. ఇంతకీ ఉద్యోగం ఎలా ఉందో చెప్పనేలేదు''

"ఎంతో థ్రిల్లింగుగా ఉంది" అన్నాడు నవ్వుతూ.

"ఇంగ్లీషు నేర్చుకోమని నీకు సలహా ఇవ్వడం నాదే తప్పు."

"ఎందుకని?"

"తెలుగులో చెప్పకుండా ఇంగ్లీషులో చెబితే నాకేం అర్థమవుతుంది మరి?"

"హిందీలో అయితే రోమాంచకారీ అనవచ్చు"

"పిల్లి అంటే అర్థంకాదని మార్జాలమన్నారట ఎవరో. నాకు రాని భాషల్లో చెబితే ఎలా అర్థమవుతుంది. చక్కగా మాతృభాషలో చెప్ప రాదూ?"

"తెలుగులో అయితే పులకరింపుగా ఉందనో, గగుర్పాటుగా ఉందనో చెప్పాలి అనుకుంటా"

"భయమో, చలో అయితే కదా గగుర్పాటు కలిగేది. ఉద్యోగం చేయడం భయంగా ఉందా లేక చలిగా ఉందా?" ప్రశ్నించాడు రామలింగం.

"సంతోషం కలిగినా గగుర్పాటు కలగవచ్చుగదా?"

"అవున్లే... నవ్వినా, ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి అన్నారు అదేదో సినిమాలో"

"ఓహో... ఎంత మంచిమాట చెప్పావు, పనికొస్తావోయ్ ఫరవాలేదు"

"మరి పనికిమాలినవాణ్ణి అనుకున్నావా ఇన్నాళ్ళూ?"

"అనుకోలేదుగాని- ఆ పాట ఏ సినిమాలోదో, ఎవరు రాశారో చెప్పుమరి"

"అవన్నీ జ్ఞాపకంలేవు. ఎలాగో పాట జ్ఞాపకం వచ్చింది... చెప్పాను. నీకు తెలిస్తే చెప్పు మరి"

"మూగమనసులు సినిమాలో ఘంటసాల పాడినట్లు జ్ఞాపకం; ఆత్రేయగారు రాశారు" అన్నాడు శ్రీనివాసులు.

"అబ్బ... నీ జ్ఞాపకశక్తి అమోఘం బావా! అందుకే హైస్కూల్లో చదవకపోయినా ఇంటివద్ద చదువుకొని హైస్కూలు టీచరయ్యావు... నేను ఓ మాట చెప్పాలనుకుంటున్నాను బావా!"

"ఒకటేం ఖర్మ, ఎన్నయినా చెప్పు - వినడానికి చెవులున్నాయి."

"ఈ చెవితో విని ఆ చెవితో వదిలేస్తావేమో?"

"లేదులేవయ్యా - ఒక చెవి మూసుకుంటాలే"

"మూసుకుంటావో తెరుచుకుంటావో నాకు తెలీదు. నా మాట వింటానంటే చెబుతా!"

"ఎప్పుడయినా వినలేదన్నానా?"

"ఉద్యోగం వచ్చింది, వయసూ వచ్చింది. అవసరమూ ఉంది. పెళ్ళిచేసుకో మరి"

"అవసరమేముంది"

"అవసరం లేదా... ఇంట్లో ఆడదిక్కు లేదుగా? 'ఆడదిలేని ఇల్లు అడవి, మగవాడు లేని ఇల్లు మఠము' అన్నారు పెద్దలు"

"అమ్మాయిని చూశావా?"

"చేసుకుంటానంటే రేపు సాయంత్రానికి సంబంధం చూస్తా"

"జీవిత భాగస్వామిని తెచ్చుకోవటంలో తొందరపడరాదు. ఆలోచించి నిర్ణయించుకుందాం"

"నీ ఇష్టం, ఆలోచించుకో, వెళ్తా బావా - ఇంటి వద్ద పనుంది"

"సరే... వెళ్లు. నాకూ పనులున్నాయి" అన్నాడు శ్రీనివాసులు.

వెళ్ళిపోయాడు రామలింగం.

క్లాసు పుస్తకాలు తీసుకొని, కుర్చీలో కూచొని పేజీలు తిరగేయసాగాడు శ్రీనివాసులు.

★ ★ ★

"శకూ... ఓ శకూ..." పిలిచింది అలివేలమ్మ.

అలివేలమ్మ శకుంతల తల్లి. ప్రతిరోజూ సాయంత్రం దేవాలయానికి వెళ్లడం ఆమె దినచర్యల్లో ఓ భాగం. పూర్వాచారాల పట్ల మక్కువ ఎక్కువ.

తన గదిలో కూర్చుని పుస్తకంలో తలదూ




# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------ కూపన్ ------

మార్చి 'చతుర' నవల 'శకుని'

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

ర్చిన శకుంతలకు తల్లి పిలుపు వినిపించలేదు.

"ఏమే తల్లీ... చెవుల్లో చెట్లు మొలిచాయా?" అంది బిగ్గరగా.

"ఏమ్మా... పిలిచావా?" అంది శకుంతల వినయంగా.

"అవునే... ఎంతసేపయింది, నోరు నొప్పిపుట్టేలా అరుస్తున్నాను"

"వినిపించలేదమ్మా... వినిపిస్తే ఎందుకు పలకను?" అంది.

"వినిపించిందిగా - ఇలా రా!"

చదువుతున్న పుస్తకం మూసేసి వంటగదిలోకి వెళ్ళింది శకుంతల.

"మగరాయుడిలా అస్తమానూ పుస్తకం ముందేసుకుని కూచోకపోతే కాస్త నాకు సాయంచేస్తే అరిగిపోతావా, అలసిపోతావా?"

"సాయంచేస్తే అరిగిపోను, అలసిపోనుగాని మగరాయుడిలా అనేమాట బాగులేదమ్మా"

"ఏం... ఎందుకు బాగులేదు?"

"మగపిల్లలేనా చదువుకోవలసింది? ఆడపిల్లలు చదువుకోకూడదా?"

"ఏం చదువే తల్లీ... ఎంత చదివినా అంట్లు తోముకోవలసిందేగా?"

"అందుకేనమ్మా... ఆడదానికి ఆడదే శత్రువన్నారు. తన కూతురు కూడా చదువుకోకూడదని తల్లి సంకుచితంగా ఆలోచించి అణగదొక్కుతూ ఉంటే స్త్రీజాతి ఎలా ప్రగతిపథంవైపు పయనించగలదు?" అంది కాస్త ఆవేశంగా. అయితే ఆ ఆవేశంలో ఆవేదన కూడా కలిసి ఉన్నట్లు అమ్మాయి స్వరం వింటే స్పష్టంగా అర్థమవుతోంది.

"ఏందో- నీ చదువుకున్న మాటలు నాకు తెలీవుగాని, నీ మూలంగా అందరి నోళ్లలోనూ నేను కరుగుతున్నానే" అంది అలివేలమ్మ బాధపడుతూ.

"ఎందుకమ్మా... ఏం తప్పు చేశానని?"

"ఇంతకన్నా ఇంకేం తప్పు చేయాలి? ఎదిగిన కూతురుకు ఇంకా పెళ్ళిచేయలేదని అమ్మలక్కలంతా చెవులు కొరుక్కుంటున్నారు"

"కొరుక్కుంటే వాళ్లకే నొప్పి"

"చెవులు కొరుక్కోవడమంటే కొరుక్కోవడం కాదే తల్లీ- మన గురించి ఏవేవో అవాకులు-చెవాకులు అనుకుంటున్నారని"

"డొంక తిరుగుడెందుకమ్మా చెప్పేదేదో సూటిగ్గా చెప్పరాదూ?"

"అలా రా దారికి. నీ వయసువాళ్లంతా పెళ్ళిచేసుకొని తల్లులయ్యారు. పెళ్ళి చేసుకుంటే ఈపాటికి నీకూ ఇద్దరు పిల్లలుండేవారు"

"పిల్లల్ని కనడానికి ఇంకా ఎంతోకాలం ఉందిలేమ్మా... నన్ను చదువుకోనీండి"

"పెళ్ళి చేసుకుంటే చదువుకోకూడదా?"

"పెళ్ళి చేసుకొని కాలేజికి వెళ్తే ఏం బావుంటుందమ్మా?"

"కాలేజికి వెళ్లకపోతే ఇంటివద్ద చదువుకోకూడదూ? ఆ శ్రీనివాసులు చూడు ఇంటివద్ద చదువుకొని హైస్కూలు టీచరయ్యాడట. పెళ్ళి చేసుకోవడానికి ఒప్పుకుంటే ఆ రామలింగంతో చెప్పి శ్రీనివాసులు సంబంధం చూడాలని అనుకుంటున్నాం" అంది అలివేలమ్మ.

శ్రీనివాసులు సంబంధం అనేసరికి సిగ్గుతో బుగ్గలు కెంపులయ్యాయి. తలవంచుకొని తన గదిలోకి వెళ్ళింది శకుంతల.

తన కూతురు పెళ్ళికి సుముఖంగా ఉన్నట్లు అర్థంచేసుకుంది అలివేలమ్మ.

శకుంతల గదిలో కూచొని పుస్తకం తెరిచిందికాని, మనసు చదువుమీద లగ్నం కాలేదు. ఊహల ఊయలలో ఊగసాగింది.

శ్రీనివాసులు తనకు దూరపు బంధువు. నాన్నను 'మామా' అంటాడు. శ్రీనివాసులు దర్జీపని చేసేటప్పుడు అతణ్ణి తను 'బావా' అని పిలిచేది. ఒరోజు జాకెట్టు కుట్టించుకోవాలని బావ వద్దకు వెళ్లింది తను.

"జాకెట్టు కుడతావా బావా?" అంది ముసిముసిగా నవ్వుతూ.

"అందుకేగా నేనున్నది?" అన్నాడు నవ్వుతూ.

"గుడ్డ బావుందా?"

"బావుంది"



"కొలతలు తీసుకో మరి?"

"పాత జాకెట్టు తీసుకొని రాకూడదూ?"

"అన్నీ బిగుతుగా ఉన్నాయి."

"కాస్త ఎక్కువ చేస్తే సరి"

"లేదులే కొలతలు తీసుకో"

"కాలేజీలో చేరావా శకూ?" అన్నాడు బావ మాట మార్చుతూ.

"చేరాను... నీవద్ద ట్యూషను చెప్పించుకోవాలని హిందీ తీసుకున్నాను"

"హిందీ చదువుకొని ఏంచేస్తావు?"

"నువ్వు ఎందుకు చదువుకుంటున్నావు?"

"ఇంగ్లీషు చదువుకోవడానికి నాకు స్తోమత లేదుగా?" అన్నాడు బావ.

ఎంత ఆత్మనిగ్రహం. నేను కవ్విస్తే తను మాట మార్చాడు. ఆ మంచి గుణమే నన్ను ఆకట్టుకుంది. ఆరోజునుంచి మనసారా ఆరాధిస్తున్నాను బావను. హిందీ చదువుతున్నాడంటే ఊళ్ళోవాళ్ళందరూ గేలిచేశారు. దిక్కులేనివాడన్నారు. తల్లిదండ్రులను పోగొట్టుకున్న దరిద్రుడన్నారు. నిరుపేద అన్నారు. బావను విమర్శించడంలో అమ్మకూడా పాలుపంచుకుంది.

"భోం చేయవా శకూ...?" అన్న అమ్మ పిలుపుకు ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చి, లేచి వంటగదిలోకి వెళ్ళింది శకుంతల.



"బాబూ- భుజంగం... మనం చిన్నప్పుడే తల్లి-దండ్రుల్ని పోగొట్టుకున్న దురదృష్టవంతులం. దిక్కూమొక్కూలేని మనల్ని సంజీవయ్య, దామోదరం తప్ప ఆనాడు ఆదుకున్నవాళ్ళెవ్వరూ లేరు. దురలవాట్లకు దాసులం కాకుండా, దుష్టులకు దూరంగా ఉంటూ, ఇతరులది ఆశించకుండా, చేతనయిన పనులు చేసుకుంటూ, కష్టపడి చదివి, ఉద్యోగం సంపాదించుకొని, మనకాళ్ళమీద మనం నిలబడగల ప్రయోజకుణ్ణి అయినందువల్ల ఈనాడు అందరూ "శ్రీనివాసులు మావాడంటే మావాడు' అంటున్నారు. నువ్వు నా స్వంత సోదరునివయినా నిన్ను తమవాడని చెప్పుకొనేవాళ్ళు ఎవరూ లేరు. ఈనాటి సామాజిక వ్యవస్థ అలా ఉంది. నాతోబాటు నిన్నూ చదువుకోమని చెప్పాను. నామాట వినిఉంటే నువ్వూ ప్రయోజకుడివి అయ్యేవాడివి. కానీ చదువుకోలేదు చదువుకోకపోగా నా చదువుకు ఆటంకాలు కల్పించడానికి ప్రయత్నించావు. వంట చేయనని మొండికేశావు. అయినా దేనికీ భయపడకుండా అన్నిపనులూ చేసుకుంటూ చదువు కొనసాగించాను. చదువుకుంటున్న నన్ను ఎందరో వెక్కిరించారు. గేలిచేశారు. వాళ్ల వెక్కిరింపులను, అపహాస్యాలను ఖాతరు చేశానా? నువ్వు కల్పించిన అడ్డంకులకు అదిరిపోయి నా ప్రయత్నం మానుకున్నానా? ఆనాడు వెక్కిరించిన వాళ్ళు, హేళన చేసినవాళ్ళు ఈనాడు నోళ్ళు మూసుకున్నారు. కొన్నాళ్ళకు పొగుడుతారు. బలీయమయిన అగ్నిజ్వాలలకు తోడ్పడే గాలి బలహీనమయిన దీపశిఖను ఆర్పివేస్తుంది. ఇది లోకనీతి. కాబట్టి ఇప్పటికయినా మించిపోయిందేం లేదు. చదువుకుంటే బాగుపడతావు- చదువుకో. నీ చదువుకు కావలసిన సౌకర్యాలన్నీ నేను చేస్తాను" అన్నాడు శ్రీనివాసులు తమ్మునితో.

"ఊఁహూ... నేను చదువుకోను. నాకు అంత ఓపికలేదు" అన్నాడు భుజంగం.

"గుర్రాన్ని నీళ్లవద్దకు తీసుకొనివెళ్లగలంకానీ, నోరు తెరిచి నీళ్ళు తాపగలమా?"

"ఎవరు తాపమన్నారు?"

"తల్లిదండ్రులు లేనప్పుడు ఇంటి పెద్దగా, నీ శ్రేయోభిలాషిగా నీ మేలుకోరి సలహా ఇవ్వటం నా బాధ్యత"

"ఏంబావా... ఇంటివద్దనే ఉన్నావు?" అంటూ వచ్చాడు రామలింగం.

''ఎక్కడికి వెళ్లమంటావు?''

''స్కూలుకు!''

''ఆదివారం కూడానా?''

''పొరపాటు పొరపాటు... జ్ఞాపకమే లేదు''

''ఏమోయ్, భుజంగం! మీ అన్నయ్య ఇంటివద్దనే చదివి ఉద్యోగి అయ్యాడు. నువ్వు చదువుకోరాదూ?'' అన్నాడు.

''ఇంతవరకూ నేనూ ఆ విషయమే చెబుతున్నాను'' అన్నాడు శ్రీనివాసులు.

''ఏమంటున్నాడు మరి?''

''సమయానికొచ్చావు- నువ్వే అడుగు''

''ఏమోయ్ భుజంగం- చదువుకోరాదూ?''

''మా అన్నతోబాటు నువ్వూ హిందీ అక్షరాలు నేర్చుకున్నావట, మరి నువ్వెందుకు చదువుకోలేదు?'' ఎదురు ప్రశ్నవేశాడు భుజంగం.

''అందరూ అందలమెక్కితే మోసేవాళ్లెవరు?''

''నచ్చజెప్పుతావనుకుంటే తాళం వేస్తున్నావే'' అన్నాడు శ్రీనివాసులు,

''అంతేబావా... నువ్వు చదివినంత శ్రద్ధగా చదవాలంటే మేం చదవగలమా? నాలుగేళ్ల క్రితం నువ్వు పొలంలో గుడిసెవేసుకొని రాత్రిళ్లు కిరసనాయిలు బుడ్డీ పెట్టుకొని చదివిన సంగతి నాకు ఇంకా జ్ఞాపకం ఉంది'' అన్నాడు రామలింగం.

''రాత్రిళ్లు పొలంలోకి ఎందుకు వెళ్లాడు, సార్?'' అడిగాడు ఎవరో కొత్తవ్యక్తి.

''ఎలుగుబంట్లు వేరుశనగ చెట్లు పీకేస్తూ ఉంటే పొలాల్లోకి కాపలావెళ్తుండేవాడు. మా బావకూడా కాపలావెళ్లి, వృధాగా కాలం గడపడం ఇష్టం లేక బుడ్డీపెట్టుకొని చదువుకొనేవాడు. ఒకరోజు నేను వేటగాళ్ల వెంట వెళ్లి చూశాను. అడవిలో బుడ్డీ ఉన్న విషయం తెలీక కొరవి దయ్యమని ఆ రోజు ఎంత భయపడ్డామో'' అన్నాడు రామలింగం.

''నచ్చజెప్పి ప్రోత్సహిస్తావనుకుంటే ఉన్న ఉత్సాహాన్ని నీరుగార్చేశావే'' అన్నాడు శ్రీనివాసులు.

''అన్ని పనులు అందరికీ రావులే బావా!'' అన్నాడు రామలింగం.

''ఏదో ఒక పనిలోనయినా నైపుణ్యాం సంపాదించాలిగదా''

''సంపాదిస్తాడు, ఎందుకు సంపాదించడు''

''ఏం సంపాదిస్తాడో ఏమో''

''కాదు భుజంగం... అన్నయ్యకు ఉద్యోగం వచ్చింది, ఇంకయినా నువ్వు వంటచేయకూడదూ?'' అన్నాడు రామలింగం.

''ఇంకెవరు చేస్తారనుకున్నావ్?'' అంటూ బయటికెళ్లిపోయాడు భుజంగం.

''ఏదో ఇష్టం ఉండీ లేక చేస్తున్నాడులే. ఈ రోజు ఆదివారంకదా, ట్యూషను కూడా లేదు; అందువల్ల నేనే చేస్తున్నాను'' అన్నాడు శ్రీనివాసులు.

''నీ ఓపిక మాకు రాదే!'' అంటూ అల్మారాలో ఉన్న దినపత్రిక తీసుకొని చూడసాగాడు రామలింగం. కాసేపు పేపరుచదివి,

''ఇదేం పేపరు బావా... దీన్నిండా హత్యలు, ఆత్మహత్యలు, దొంగతనాలు, రోడ్డుప్రమాదాలు, బందులు, నిరాహారదీక్షలు, ప్రతినిరాహారదీక్షలు...'' అన్నాడు.

''అలాంటి సంఘటనలు జరుగుతున్నాయి మరి''

''ఎందుకు జరుగుతున్నాయి?''

''మనిషిలోని మానవత్వం తగ్గిపోయి రాక్షసత్వం చోటుచేసుకుంటోంది''

''మనం చిన్నప్పుడు ఇలాంటి అత్యాచారాలు, అఘాయిత్యాలు జరిగినట్లు జ్ఞాపకం లేదు''

''జరిగితే గదా జ్ఞాపకం ఉండటానికి?''

''బందులు, హత్యలు చేసి దేశంలో అల్లకల్లోలం సృష్టించి, ప్రజల్ని బాధించడం వల్ల వాళ్లకు కలిగే లాభమేమిటో?''

''లాభం లేనిదే ఇలాంటి పనులు ఎందుకు చేయిస్తారు?''

''ఇలాంటి పనులు జరగకుండా చేయలేమా?''

''మనలో అవివేకం, అనైక్యత, ఉదాసీనత ఉన్నంతవరకూ చేయలేం.

వీటిని ఆధారం చేసుకొని, ప్రజల పేరుతో ప్రజలనే పావులుగా ఉపయోగించి రాజకీయ



నాయకులు ఆడుతున్న చదరంగంవల్ల ఇలాంటి అనర్థాలు కలుగుతున్నాయి''

''ఛ ఛ... రాజకీయ నాయకులు ఇలాంటి అవివేకం పనులు చేస్తున్నారంటే నమ్మలేం. పేదల్ని ఉద్ధరిస్తామని, దారిద్ర్యరేఖకు దిగువ ఉన్నవారిని పైకి తెస్తామని, ప్రజాసేవచేయడా నికే రాజకీయాల్లో ప్రవేశించామని చెప్పే రాజకీ యనాయకులు ఇలా బందులు చేయిస్తారంటే నమ్మలేం'' శ్రీనివాసులు అభిప్రాయాన్ని ఖండించాడు రామలింగం.

''మొన్న నాగయ్యకు నాగుపాము కరిచింది కదా? అతణ్ని కదిరికి తీసుకెళ్లాలని బస్సులో వెళ్లాం. దారిలో బస్సును ఆపివేశారు. ఎందుకు ఆపేశారంటే బందుచేస్తున్నాం అన్నారు.

ఇదేం బందండీ, మేం ఇంటివద్ద బయల్దే రేటప్పుడు బందు విషయం తెలీదే అన్నాం.

మాకు టెలిగ్రాం ఇప్పుడు అందింది అన్నా రు.

ఎందుకు బందు చేస్తున్నారంటే 'మా పార్టీ ఎం.ఎల్.ఎ.లను సస్పెండు చేశారు. అందుకు నిరసనగా బందుచేయమని పిలుపు ఇచ్చారు మా నాయకులు' అన్నారు.

స్పీకరు సస్పెండు చేస్తే ప్రతీకారం తీర్చుకు నేది ప్రయాణికుల మీదనా?'' అన్నాను.

అదంతా మాకు తెలీదు, చేయమని ఆదే శించారు, చేస్తున్నాం' అన్నారు.

''మనిషికి పాము కరచిందండీ, ప్రమా దంగా ఉంది, దయచేసి పోనివ్వండి'' అన్నా ము. 'బందు చేస్తున్నాం కాబట్టి పోవడానికి వీల్లేదు' అన్నారు. అయితే బస్సును వాపసు మళ్లించమని చెప్పాం.

''వాపసు వెళ్లడానిక్కూడా వీల్లేదన్నారు. ప్రా ణాపాయం జరుగుతుందని చెప్పినా ఖాతరుచే యనివాళ్లను మనం ఏమనాలి?'' అన్నాడు శ్రీనివాసులు ఆవేశంగా.

''ఏ పార్టీవాళ్లు బావా?''

''అవకాశవాదం పార్టీవాళ్లు''

''అదేం పార్టీ... నేనెప్పుడూ వినలేదే''

''ఏ పార్టీ అంటే ఏం చెప్పాలి మరి. ఏ పార్టీ గెలిచే అవకాశం ఉంటే అందరూ ఆ పార్టీలోకి దూరతారు. ఏ పార్టీవాళ్లని చెప్పడానికి వీలుంది?''

''మరి ఇలాంటివాళ్లను ఓటర్లు ఎలా గెలి పిస్తున్నారు?''

''వాళ్లు చేసే బూటకపు వాగ్దానాలు నిజ మని నమ్మి గెలిపిస్తున్నారు.''

''జనాన్ని మోసగించడం తప్పుకాదా?''

''అది వాళ్ల తప్పుకాదు. వాళ్ళు చేసే వాగ్దా నాలు బూటకమని ప్రజలు తెలుసుకున్న రోజు వాళ్లు అబద్ధాలు చెప్పరు. చెప్పినా ప్రయో జనం ఉండదు''

''ఏనాటికయినా ప్రజలు తెలుసుకుంటా రంటావా బావా?''

''తెలుసుకోవచ్చు... అది ఇప్పుడే జరిగే పనికాదు''

''అంతవరకూ వీళ్లు అధికారంలో కొనసాగ వలసిందేనా?''

''నీలాంటి వాళ్లు ఉన్నంతవరకూ వాళ్ల అధికారానికి ఎలాంటి ఢోకా ఉండదు'' అన్నా డు శ్రీనివాసులు నవ్వుతూ.

''ఏంది బావా అంత ఇదిగా మాట్లాడతావు, నేను అంత అమాయకుణ్నా?'' కోపగించుకున్నా డు రామలింగం.

''యాదృచ్ఛికంగా మాట్లాడిన నామాటల్లోని వ్యంగ్యాన్ని అర్థం చేసుకోలేక కోపగించుకున్న నువ్వు, పథకం ప్రకారం తయారుచేసుకొని, కంఠస్థం చేసి, సమయస్ఫూర్తి ఉపయోగించి, బల్లగుద్ది, హావభావాలు ప్రదర్శించి ఉపన్య సించే అవకాశవాద రాజకీయ నాయకుల మాటల్ని ఎలా అర్థం చేసుకోగలవు!'' అన్నా డు శ్రీనివాసులు.

''పోనీలే... రాజకీయాలు, రాజకీయనాయ కుల గొడవ మనకు అవసరంలేదు. నీ ఇంగ్లీషు చదువు ఎంతవరకూ వచ్చింది?''

''ఫరవాలేదు... వర్కింగు నాలెడ్జి సంపా దించుకున్నాను''

''ఇంగ్లీషు నేర్చుకోమని చెప్పడం నాదే పొర పాటు. నేర్చుకుంటే మాత్రం నాకు తెలియని ఇంగ్లీషులో మాట్లాడతావా?''

''అదేంటోయ్, తెలుగు ఓనమాలు రాని వాళ్లు పదే పదే ఇంగ్లీషు పదాలు వాడుతూ




ఉంటే, అంతోఇంతో ఇంగ్లీషు చదువుకున్న నీకు ఆమాత్రం ఇంగ్లీషు తెలీదంటే నాకు అవమానం''

''అప్పుడెప్పుడో ఆరో తరగతిలో చదువుకున్న ఇంగ్లీషు అంగడి చిన్నప్పు ఇంటికి పోయింది'' అంటూ నవ్వాడు రామలింగం.

''భలే తమాషాగా మాట్లాడతావోయ్, రాజులు లేరు కాని, ఉంటే ఏరాజు ఆస్థానంలోనో విదూషకుడుగా ఉండవలసినవాడివి. నీ ఇంగ్లీషు అంగడికి ఎలా పోయిందంటావు?''

''చదువుకున్నావుగాని, నీకు లోకజ్ఞానమే లేదు బావా! పరీక్షలు రాయగానే టెక్స్టు బుక్కులు, నోటు బుక్కులు, చిత్తుకాగితాలు అంగడివాళ్లకిచ్చి జంతికలు, బిస్కతులు కొనుక్కుంటే పుస్తకాల్లో ఉండే చదువు అంగడికి పోయినట్లా లేదా?'' అంటూ పకపకనవ్వాడు.

''పుస్తక ప్రపంచంలో ఉండిపోతే బయటి ప్రపంచం తెలియదేమో'' అంటూ నవ్వాడు శ్రీనివాసులు.

''టైమెంతయింది బావా?''

''తొమ్మిది''

''అప్పుడే తొమ్మిదయిందా? వెళ్తాబావా, ఎదురుచూస్తూ ఉంటుంది''

వెళ్లిపోయాడు రామలింగం.

వంటపని ముగించి, పుస్తకాలు తీసుకొని కుర్చీలో కూచున్నాడు శ్రీనివాసులు.

★ ★ ★

వరండాలోని వాలుకుర్చీలో కూచొని పేపరు చదువుతున్నాడు లింగరాజు.

కాఫీ గ్లాసు చేతికి అందిస్తూ- ''అనుకున్న పని అవుతుందో కాదో తెలుసుకోవాలన్న ధ్యాస ఉండదు మీకు!'' అంది అతని భార్య భాగ్యమ్మ.

''ఇప్పుడు ఏంమరిచిపోయానని సాధింపు?'' అన్నాడు లింగరాజు ఆలోచిస్తూ.

''శ్రీనివాసులు వద్దకు మధ్యవర్తిగా బలరామయ్యగారిని పంపారు. వెళ్లిన పని 'కాయా, పండా?' అని తెలుసుకున్నారా?''

''అవునే... మరిచేపోయాను. దాదాపు పదిరోజులయింది కదూ! అయినా అప్పగించిన పనిఅవుతుందా కాదా అని తెలియజెప్పడం ఆయన బాధ్యత కాదా?''

''తీటబట్టిన వాళ్లే గోక్కోవాలి గదా?''

''మా అన్నగారు చూసి రమ్మంటే కాల్చివచ్చేరకమని అతగాణ్ని ఆకాశానికి ఎత్తితివి. కాల్చి రాకపోయినా, కనీసం చూసి రావాలి గదా? ఏ కొండ గుట్టల్లో, చెట్లు- చేమల్లో గంతులేస్తున్నాడో?''

''కొండగుట్టల్లోకి ఎందుకు వెళ్తాడండీ? వెళ్లినా గంతులెందుకేస్తాడు?''

''అడవి జాతుల వాళ్లు కొండల్లోకి గుట్టల్లోకి వెళ్లక ఎక్కడకెళ్తారు?''

''చాల్లేండి వేళాకోళం. బలరామయ్య అడవిజాతివాడా?''

''నువ్వు చెప్పిందేరదే వెర్రిమొహమా? చూసిరమ్మంటే కాల్చి వచ్చింది ఎవరు? ఆంజనేయులు. ఆంజనేయులు వానరుడు కదా? స్పష్టంగా చెప్పాలంటే కోతిజాతి- కోతులు ఎక్కడుంటాయి?'' అన్నాడు నవ్వుతూ.

''మా అన్నయ్యని హేళన చేస్తే నాకు కోపమొస్తుంది. మన పనిమీద పంపించాం. ఏమయిందో తెలుసుకోవటానికి ఆయన ఇంటికెళ్లి అడగొచ్చుకదా?''

''అడగకూడదని అనుకున్నానా? ఆయన రోజూ మన ఇంటికి వచ్చేవాడుకదా! ఈరోజొస్తాడు, రేపొస్తాడు- అనుకుంటూ ఎదురుచూస్తున్నాను. అప్పుడే పదిరోజులయింది. ఊళ్లో ఉన్నాడో లేదోమరి!''

''శ్రీనివాసులు, రామలింగం ప్రాణస్నేహితులట. బలరామయ్యను నమ్ముకొనే కంటే రామలింగం ద్వారా ప్రయత్నించడం మంచిదేమో!'' అంది భాగ్యమ్మ.

''నీ వాలకం చూస్తే అందరికాళ్లూ పట్టుకోమనేలా ఉందే?''

''కలసి మాట్లాడితే కాళ్లు పట్టుకున్నట్టా? అవసరమొస్తే కాళ్లు కూడా పట్టుకోవలసి వస్తుందేమో. వసుదేవుడులాంటివాడు గాడిద కాళ్లు పట్టుకున్నాడట మనం పట్టుకుంటే తప్పా?''

''పిలిపించి చెబుదామంటావా?''

"ఎవరికి చెబుదామంటారు?"

"రామలింగానికి చెప్పమన్నావుగా?"

"మన పనికోసం మనం ఆయనింటికి వెళ్లాలిగాని, మన ఇంటికి పిలిపించడం ఏం బావుంటుందండీ?"

"ఇద్దరమూ వెళ్దామంటావా?"

"నేనెందుకు?"

"మనమంటే ఇద్దరమూ అనుకున్నాలే!" అన్నాడు లింగరాజు నవ్వుతూ.

"హాస్యానికి సమయమూ-సందర్భమూ ఉండాలండీ!"

"హాస్యమేముంది? ఇద్దరమూ వెళ్దామనడం తప్పా?"

"తప్పుకాదుగాని, ఓమాట బలరామయ్యగారిని అడిగి తరువాత అవసరమయితే ఆయన వద్దకు వెళ్లడం మంచిదేమో!"

"బలరామయ్య ఇంటివద్ద ఉన్నాడో లేడో చూసి రమ్మందాం... రామన్నా! ఓ రామన్నా!!" పిలిచాడు బిగ్గరగా.

"వస్తున్నానయ్యా...!" అంటూ ఆదరాబాదరా వచ్చి నిల్చున్నాడు బిల్ కలెక్టరు రామన్న.

"బలరామయ్య ఊళ్ళో ఉన్నాడా?"

"ఉన్నారండీ!"

"ఎప్పుడు కనిపించాడు?"

"రోజూ కనిపిస్తున్నారండీ"

"విన్నావా భాగ్యా... బలరామయ్య ఊళ్ళోనే ఉన్నాడట. ఈ పక్కకే రాలేదు. రమ్మందామంటావా?"

"మీరే వెళ్తే బావుంటుందేమో!"

"ఏం బాగులే... రమ్మందాం! రామన్నా బలరామయ్యను పిలుచుకొని రా పో" అన్నాడు లింగరాజు.

రామన్న వెళ్లాడు.

"ఊళ్ళో ఉండి రాలేదంటే వెళ్లిన పని విఫలమయినట్లుంది"

"ఏమయిందో ఆయనొస్తే తెలుస్తుంది... అదుగో.. మా అన్నయ్య వస్తున్నారు... నూరేళ్లాయుష్షు అన్నయ్యా!" అంది భాగ్యమ్మ ఆనందంగా.

"ఎందుకులేమ్మా ఇంకా నూరేళ్ళు!" అన్నాడు బలరామయ్య.

"కూచోండి బావగారూ!... రామన్న రాలేదా...?" అన్నాడు లింగరాజు.

"రాలేదే... నాకోసం పంపారా?" అన్నాడు బలరామయ్య కుర్చీలో కూచుంటూ.

"అవును... ఇప్పుడే పంపాను"

"ఎక్కడ చచ్చాడో... వానికి అందరూ బంధువులే" అన్నాడు బలరామయ్య.

"ఇంతకుముసుపు రోజూవచ్చేవాడివి. ఇప్పుడు చూడాలనుకుంటే పిలిపించుకోవలసి వస్తోందే" అన్నాడు లింగరాజు.

"మనసు బావుంటేగదా, ఎక్కడికయినా వెళ్లాలనిపించేది?"

"పోనీలే... మీరు వెళ్ళిన పని ఏమయింది?"

"అంతా తలకిందులయింది"

"అందరూ శీర్షాసనం వేశారా?"

"ఎందుకు?"

"తల కిందికి పెడితే గదా తలకిందులయ్యేది."

"వేళాపాళా లేకుండా వేళాకోళం చేస్తారన్నయ్యా!" అంటూ వచ్చిన భాగ్యమ్మ చెరో గ్లాసు కాఫీ ఇచ్చింది.

"ప్రశ్నకు జవాబు చెప్పకుండా తలకిందులయిందంటే ఏమనుకోవాలి మరి?" అన్నాడు లింగరాజు కాఫీ చప్పరిస్తూ.

"అనుకొనేదేముంది? మీ అమ్మాయిని వానికివ్వాలని అనుకోవడం మొదటి తప్పు. నామాట వింటాడని రాయభారం వెళ్లడం రెండో తప్పు" అన్నాడు బలరామయ్య.

"అయితే వినలేదన్నమాట. ఇలా జరుగుతుందని నాకు అనుమానంగానే ఉంది- వినకపోవడం మనమేలుకే"

"వినకపోతే పోయాడులే. ఎన్ని మాటలన్నాడని!"

"ఏమన్నాడు?"

"అవన్నీ వద్దులే! ఆ ఆలోచన వదిలేయండి. అనాడు మనం పొత్తం చెప్పమన్న




విషయం వాడు ఇంకా మరిచిపోలేదు'' అన్నాడు బలరామయ్య.

''ఇలాంటిది జరుగుతుందని ఊహించాను. నాకైతే ఇష్టమే లేదనుకో. అయినా ఆడవాళ్ల అభిప్రాయం కాదనలేక 'ఊ' కొట్టాను'' అన్నాడు లింగరాజు.

పుస్తకాలు గుండెలకు అదుముకొని, ఇంట్లోకి వచ్చిన సౌజన్యను చూసి, ''ట్యూషనుకి వెళ్ళిందా?'' అన్నాడు బలరామయ్య.

''అవునన్నయ్యా!'' అంది భాగ్యమ్మ.

వాళ్ల మాటలు వినిపించుకోకుండా లోనికి వెళ్లింది సౌజన్య.

''అమ్మాయి చదువుకుంటోంది, అప్పుడే పెళ్ళికి ఏంతొందర?'' అన్నాడు బలరామయ్య.

''శ్రీనివాసులు సంబంధం మానుకోవడమే మంచిదంటారా?'' అడిగింది భాగ్యమ్మ.

''మానుకోక మళ్ళీ వెళ్లి మనవి చేసుకోవాలంటావా?'' అన్నాడు లింగరాజు.

''సంబంధం ఒక్కటేగాదు, ట్యూషను కూడా మానిపించడం మేలేమో'' అన్నాడు బలరామయ్య.

''ట్యూషను మానిపించడానికి అమ్మాయి ఒప్పుకుంటుందో లేదో' సందేహం వెలిబుచ్చింది భాగ్యమ్మ.

''ఏమోనమ్మా... మీఇష్టం! చెప్పేమాట చెప్పాను... వస్తానండి బావగారు, అర్జెంటు పనుంది'' అంటూ లేచాడు బలరామయ్య.

''అప్పుడప్పుడు కనబడుతూ ఉండవయ్యా మహానుభావా!'' అన్నాడు లింగరాజు

''అలాగే... వెళ్తానమ్మా...'' అంటూ వెళ్లిపోయాడు.

''అసలు ఈయన శ్రీనివాసులు వద్దకు వెళ్లాడో లేదో?'' అంది భాగ్యమ్మ.

''వెళ్లకపోతే అబద్ధం ఎందుకు చెబుతాడు?''

''అమ్మాయిని చేసుకోవడానికి ఇష్టం లేకపోతే మిమ్మల్ని ఎందుకు దూషిస్తాడు శ్రీనివాసులు. ఒకవేళ దూషిస్తే మాత్రం అప్పుడే వచ్చి మీకు చెప్పడా బలరామయ్య. అమ్మాయిని కూడా ట్యూషనుకు పంపవద్దని సలహా ఇచ్చాడు. ఆయన మాటలు వింటూంటే అనుమానంగా ఉందండీ''

''నీకు అన్నీ అనుమానాలే''

''ఏదో ఎత్తు వేశాడండీ బలరామయ్య. ఆయన మేనకోడలికి పెళ్లయిందా?''

''కాకపోయినా శ్రీనివాసులుకు మాత్రం ఇవ్వడు. ఇవ్వకూడదని అప్పుడే తన బావమరిదికి చెప్పాడుగా''

''మన కేసులో సాక్ష్యం చెప్పలేదని మనమూ కోపంగా ఉన్నాం కదా అప్పుడు? మరి అవన్నీ మరిచిపోయి మనమ్మాయిని ఇవ్వాలనుకున్నాం గదా?''

''అయితే ఏమంటావు?''

''అసలు బలరామయ్య శ్రీనివాసులు వద్దకు వెళ్లాడా? వెళ్తే మన విషయం చెప్పాడా లేదా- తెలుసుకోవాలి''

''ఎవర్ని అడుగుతావు?''

''అమ్మాయిని అడిగితే చెప్పదూ?''

''ఏం చెబుతుంది?''

''బలరామయ్య శ్రీనివాసులు వద్దకు వెళ్లాడో లేదో చెబుతుంది''

''అమ్మాయి ఉన్నప్పుడే వెళ్లాలా?''

''లేకపోతే శ్రీనివాసులు స్కూలుకు వెళ్తాడు కదా?''

''సరేలే... అనుమానమెందుకు, అమ్మాయి నడుగు'' అన్నాడు లింగరాజు.

''అడుగుతా'' అంటూ ఇంట్లోకి వెళ్ళింది భాగ్యమ్మ.

అప్పుడప్పుడే భోజనానికి కూచున్న కుమార్తెకు వడ్డిస్తూ, ''బలరామయ్య ఈమధ్య మీ టీచరు వద్దకు వచ్చాడామ్మా?'' అంది భాగ్యమ్మ.

''ఏ టీచరు... శ్రీనివాసులు సార్ గారింటికా?'' ప్రశ్నించింది సౌజన్య.

''అవును'' అంది భాగ్యమ్మ.

''అవునమ్మా వచ్చారు. సార్ ఉద్యోగంలో చేరిన మరునాడో మూడోనాడో వచ్చారు'' అంది ఆలోచిస్తూ.

"ఇద్దరూ కలసి ఏమయినా మాట్లాడారా?"

"మాట్లాడాలనే కావచ్చు నన్ను శకుంతలను ఇంటికి పంపమన్నారు"

"ఎవరు... బలరామయ్యే పంపమన్నారా?"

"అవును"

"వాళ్లిద్దరే ఉన్నారా, ఇంకెవరయినా ఉన్నారా?"

"రామలింగం అన్నయ్య కూడా ఉన్నారు"

"ఏం కావాలమ్మా చారా, పెరుగా?" అడిగింది భాగ్యమ్మ.

"పెరుగు వెయ్యమ్మా"

పెరుగువేసి వరండాలోకి వెళ్లింది భాగ్యమ్మ.

టేబులు మీద 'భగవద్గీత' పెట్టుకొని శ్రద్ధగా చదువుతున్నాడు లింగరాజు.

"ఏమండీ..." అంది మెల్లగా కోపగించుకుంటాడేమోనన్న భయంతో.

"ఏం... పిలిచావా?" అన్నాడు.

"రామలింగంగారి వద్దకు వెళ్లాలండీ" అంది వినయంగా.

"ఏం ఇంకా శ్రీనివాసులు మీది ఆశపోలేదా?" అన్నాడు కటువుగా.

"అదికాదండీ"

"ఏది కాదే?"

"చెప్పనిస్తే కదా!"

"సరే చెప్పు"

"బలరామయ్య శ్రీనివాసులు ఇంటికి వెళ్లినరోజు రామలింగం కూడా ఉన్నాడటండీ!"

"ఉంటే?"

"బలరామయ్య చెప్పింది నిజమో కాదో తెలుసుకోవచ్చు గదా?"

"రామలింగం సమక్షంలో మాట్లాడి ఉంటారా?"

"అడిగితే తప్పేంటండీ?"

"సరేలే... అడుగుదాం- నీ కోరిక ఎందుకు కాదనాలి" అంటూ మళ్లీ 'భగవద్గీత'లో తల దూర్చాడు లింగరాజు.

వంటగదిలోకి వెళ్ళింది భాగ్యమ్మ తృప్తిగా నిట్టూరుస్తూ.

"ఏం బాబాయ్... ఉదయమే ఊడిపడ్డారే?" అన్నాడు రామలింగం, పళ్లు తోము కుంటూ వచ్చిన సుబ్బయ్యతో.

"నువ్వెక్కడి కొడుకువురా బాబూ... ఇంటికి వచ్చినవాళ్లకు మర్యాద చేయకపోయినా కనీసం కూచోమనైనా చెప్పకుండా ఉదయమే ఊడిపడ్డారంటూ వేళాకోళం చేస్తున్నావు" అన్నాడు సుబ్బయ్య.

"రండి చిన్నాన్నా... రండి! మిమ్మల్ని వేళాకోళంగా మాట్లాడతానా?" అంటూ లేచి ఇంట్లోకి వెళ్లి, కుర్చీ తెచ్చి వరండాలో వేసి, "కూచోండి" అన్నాడు.

"ఇంకా ముఖం కూడా కడుక్కోలేదురా నాయనా! కూచుంటే ఎలా?"

"కడుక్కోండి మామగారూ, ముఖం కడుక్కోవడానికి మా ఇంట్లో నీళ్లు లేవనుకున్నారా?" అంది రామలింగం భార్య రమాదేవి వంటగదిలో నుంచి.

"కొడుక్కంటే కోడలే మేలే" అంటూ కూచున్నాడు సుబ్బయ్య.

"ముఖం కడుక్కుందురు రండి" అంటూ సుబ్బయ్యను బాత్‌రూమ్‌లోకి తీసుకెళ్లి, "అదో అక్కడే సబ్బు, టవలు ఉన్నాయి" అన్నాడు.

ముఖం కడుక్కొని వచ్చి కుర్చీలో కూచున్నాడు సుబ్బయ్య.

ఓ కప్పులో కాఫీ, మరో కప్పులో పాలూ తెచ్చి కాఫీ సుబ్బయ్యకు, పాలు తన భర్తకు ఇచ్చింది రమాదేవి.

"కాఫీ బావుందమ్మా! అదేం... నువ్వు కాఫీ తాగవా?" అన్నాడు సుబ్బయ్య.

"మా బావ తాగనివ్వడే"

"అంటే... రమాదేవి అన్నగారా?"

"అయ్యోరామ... ఆయనకేం, అన్నీ తాగుతాడు కాఫీ ఏం ఖర్మ వారుణివాహిని కూడా వదలడు"

"ఆయన తాగుతూ నిన్ను తాగవద్దనడం ఏం న్యాయం?"

"ఆయనకాదు, శ్రీనివాసులుగారు. కాఫీ తాగితే ఆరోగ్యం చెడిపోతుందని, తాగొద్దని చెప్పారు"





"శ్రీనివాసులు తాగడా?"

"తాగడు బాబాయ్!"

"అవున్లే తను సిగరెట్టు తాగుతూ, ఇతరుల్ని బీడీ తాగొద్దని చెబితే వింటారా! ఇతరులకు చెప్పేముందు తను ఆచరించాలి"

"పూర్వం తానూ కాఫీ తాగేవాడు. ఉద్యోగంలో చేరిన తరువాత వదిలేశాడు. నన్నూ తాగొద్దన్నాడు"

"అయితే మీ బావ వాక్కు వేదవాక్కన్న మాట?"

"వేదవాక్కు అనడంకంటే లక్ష్మణరేఖ అంటే బావుంటుందేమో?"

"నీ మాట ఆయనకూ అంతే కదా?"

"సాధ్యమయినంత వరకూ అలాగే అనుకోవాలి"

"సాధ్యం కాకపోతే?"

"ఆయనకు నచ్చకపోతే ఎవరిమాటా వినడు"

"మరి మీ బావవద్దకు నిన్ను మధ్యవర్తిగా పంపాలని వచ్చానే" అంటూ కాఫీగ్లాను టేబులు మీద పెట్టాడు సుబ్బయ్య.

"మధ్యలో నేనెందుకు బాబాయ్? ఆయన మీకు తెలియని మనిషా?"

"తెలిసిన మనిషే- అయినా నేను వెళ్లరాని పని"

"అదేం చిన్నాన్నా?"

"నేను రాకూడదు బాబూ, నువ్వొక్కడివే వెళ్లాలి"

"అంత రహస్యమయిన పనా?"

"ఎంత రహస్యమయినా నీకు చెప్పకుండా ఎలా వెళ్లమంటాను? మన అమ్మాయిని చూశావుగదా?"

"ఎవరు? శకుంతలే గదా?"

"అవును"

"చిన్నబిడ్డగా ఉన్నప్పటి నుంచీ చూస్తూనే ఉన్నాను"

"సరిపోతే శ్రీనివాసులుకు ఇద్దామని" అన్నాడు నీళ్లు నములుతూ సుబ్బయ్య.

"అదేం రహస్యం... అడుగుదాంలే" అన్నాడు రామలింగం ఉత్సాహంగా.

"నీ స్వంత చెల్లెలు అనుకో నాయనా!"

"సరేలెండి బాబాయ్, బావగారిని అడుగుతాలెండి"

"అడగడం కాదు, పని సరిచేయాలి"

"అంతగా చెప్పాలా, నా స్వంతపనిగా చూసుకుంటాలెండి"

"మళ్లీ ఎప్పుడు రమ్మంటావు?"

"ఎందుకు?"

"విషయం తెలుసుకోవడానికి"

"నేనే వచ్చి చెబుతాలెండి."

"అయితే వెళ్తా నాయనా!" అంటూ లేవాడు సుబ్బయ్య.

"మంచిది బాబాయ్..." అంటూ తనూ లేచాడు రామలింగం.

చెప్పులు వేసుకొని, రామలింగంకేసి చూసి, వెళ్తానన్నట్లు తల ఊపి వెళ్లిపోయాడు సుబ్బయ్య.

కుర్చీలో కూర్చుని ఆలోచించసాగాడు రామలింగం.

"బెల్లం ఉంటే ఈగలు ముసురుతాయి" అన్నారు పెద్దలు. ఉద్యోగం వచ్చిందోలేదో "నా బిడ్డనిస్తామంటే నా బిడ్డనిస్తామంటూ" పోటీపడుతున్నారు. ఉద్యోగం లేకపోతే మాట్లాడించే వాళ్లు ఉండరు. లింగరాజుగారి మామిడిచెట్లు నరికిన కేసులో తప్పుడు సాక్ష్యం చెప్పించాలని తన మేడకోడల్ని ఇచ్చి పెళ్లిచేస్తానని ఆశపెట్టాడు బలరామయ్య. సాక్ష్యం చెప్పలేదని కూతుర్ని ఇవ్వవద్దని తన బావమరిదికి చెప్పాడట. ఇప్పుడు ఉద్యోగం వచ్చిందని మళ్లీ ఇస్తామంటూ వచ్చాడు. నిజమో, అబద్ధమో కాని ఏదో కథ కూడా చెబుతున్నాడు. ఎందుకో మరి, అది కట్టుకథలాగే అనిపిస్తోంది. ఆ రోజు... అంటే రెండేళ్ల క్రితం తను శ్రీనివాసులు ఇంటికి వెళ్లేసరికి సరిగా అదే టైముకు శకుంతల బయటికి వెళ్లింది.

"మా చెల్లాయితో ఏవో రహస్యమంతనాలు జరుపుతున్నావే బావా?" అన్నాడు తను.

"మంతనాలేమున్నాయ్, జరపడానికి? జాకెట్టు కొలతలు తీసుకోమంది" అన్నాడు.

"తీసుకున్నావా?"

"తీసుకోకపోతే ఎలా?"

"సరిపోతుందా?"

"ఛీ... వేళాకోళం"

"కాకపోతే కొలతలు తీసుకోవడమేంది? నమూనా జాకెట్టు చూసి కుట్టాలిగాని"

"నేనూ ఆ మాటే అన్నాను. నమూనా జాకెట్టు లేదు కొలతలు తీసుకోమంది"

"తీసుకుంటే తప్పేముందిలే? మామ కూతురేగా"

"పరాయివాళ్లను గురించి అలా మాట్లాడ్డం మంచిది కాదోయ్. మన చెల్లాయిల్ని అక్కగారిని ఎవరయినా ఏమన్నా అంటే మనం బాధపడమూ? 'ఒరులేయవి ఒనరించిన' అనే పద్యం చదవలేదా?"

"ఏ పుస్తకంలో ఉంది?"

"భారతంలో"

"భారతం, భాగవతం చదివి అర్థం చేసుకునేంత చదువు కాదులే"

"నాకు మాత్రం ఎవరు చెప్పారు? చదువుతూ ఉంటే అదే వస్తుంది. 'అనగనగరాగ మతిశయిల్లుచు నుండు, తినగతినగ వేము తియ్యనుండు, సాధనమున పనులు సమకూరు ధరలోన' అన్నాడుగదా వేమన"

"ఎంత సాధన చేసినా నాకు రాదుగానీ, రాత్రికి చెరువుకట్ట మీద విరాటపర్వం చదువుతారట వెళ్తావా?"

"విరాటపర్వమా... చెరువుకట్ట మీదనా?"

"అవును... నీకు చెప్పలేదా? వర్షంరాక పంటలు ఎండిపోతున్నపుడు చెరువుకట్ట మీద విరాటపర్వం చదివితే వర్షం వస్తుందని అప్పుడప్పుడు చదువుతారు గదా?"

"నేను పొలం కాపలా వెళ్లాలిగా?"

"ఒకరోజు భుజంగం వెళ్లలేడా?"

"వానికి ఏ పనిమీదా శ్రద్ధలేదు. ఏం చేయాలో తోచడం లేదు. చగువుకోమంటే, రాదంటాడు. వంట చేయమంటే నేను చేయలేను, పెళ్లిచేసుకో అంటాడు. వ్యవసాయం చేయమంటే చేయనంటాడు. దర్జీ పని చేయమంటే, కాళ్లునొప్పి అంటాడు"

"ప్రతి మనిషికి ఏదో ఓ సమస్య ఉండనే ఉంటుంది కదా?"

"సమస్యలుంటేనే జీవితం. లేకపోతే చప్పగా ఉండదూ?"

"ఆలోచిస్తూ కూచున్నారే, పొలంలోకి వెళ్లరా?" అంది రమాదేవి.

ఉలికిపడి ఈ లోకంలోకి వచ్చాడు రామలింగం. భోంచేసి పొలంలోకి వెళ్లడానికి బయల్దేరాడు. తనకు- శ్రీనివాసులుకు; శ్రీనివాసులుకు- శకుంతలకు లోగడ జరిగిన సంభాషణలు జ్ఞాపకం రాసాగాయి.

ఓ రోజు శ్రీనివాసులుతో మాట్లాడుతూ బజారుకేసి చూశాడు తను. దూరంగా శకుంతల కనిపించింది.

"మా చెల్లాయి వస్తోంది బావా, జాకెట్టు తయారుచేశావా?" అన్నాడు తను.

"జాకెట్టు కోసం కాదులేవోయ్!"

"ఓహో... లంగా కోసం కదూ?"

"నీదంతా వేళాకోళం లేవోయ్. హాస్యానికీ హద్దుండాలి"

"అప్పుడే ముదిరిపోయిందే"

"ఏమిటోయ్?"

"ప్రేమ!"

"ప్రేమా లేదు దోమా లేదు. యువతీ-యువకులు కలసి మాట్లాడితే వాళ్లిద్దరూ ప్రేమించుకున్నారనో, అక్రమసంబంధం ఉందనో చెవులు కొరుక్కోవడం ఈ సమాజానికిఉన్న భయంకరమయిన అంటు జాడ్యం"

"అయినా నువ్వు అదృష్టవంతుడివి బావా!"

"ఏ విషయంలో?"

"మంచి- మంచి అమ్మాయిలు నీ వద్దకు వస్తూ ఉంటారు"

"ఇన్ని రోజులు నా స్నేహితుడుగా ఉండి నన్ను అర్థం చేసుకున్నది ఇంతేనా?"

"శకుంతల రోజూ వస్తోంది, ఎన్ని బట్టలున్నాయి అమ్మాయివి?"

"కాదన్నానుగా... హిందీ చెప్పించుకోవడానికి వస్తోంది. మంచి తెలివయిన అమ్మాయి.





తెలివయినవాళ్లంటే నాకు ఇష్టం''

''అపార్థం చేసుకున్నానని బాధపడకు బావా! పొరపాటున తప్పటడుగు వేస్తావేమో నని హెచ్చరించాను''

ఆలోచిస్తూనే పొలంలోకి చేరుకున్నాడు రామలింగం. తెలివయినవాళ్లంటే ఇష్టమని చెప్పాడు. అవకాశం వస్తే ఇష్టమయినవాళ్ల మీద ప్రేమ కలగవచ్చుగదా, ప్రేమ కలిగితే పెళ్లికి మార్గం ఏర్పడుతుంది.



ఊళ్లో రచ్చబండ స్థానిక విషయాలు సేకరించి ప్రచారం చేసే విషయంలో వార్తాసంస్థ లాంటిది. ఊరుకు కేంద్రబిందువులాంటి రచ్చబండ అన్నిరకాల మనుషులకు చర్చావేదిక. అన్నిరకాలవారు చేరడంవల్ల సమస్త వార్తలూ అక్కడికే చేరతాయి. రాత్రి రంకు జరిగిందంటే ప్రొద్దున్నే రచ్చబండకు చేరతారు ప్రేయసి- ప్రియులు. ఎవరి పొలంలోనో దొంగతనం జరిగితే దొంగలపేర్లు ఈ వార్తాహరుల నాలుకల మీదుగా రచ్చబండ చేరతాయి. భార్యా- భర్తల కొట్లాట, అత్తా- కోడళ్ల పోట్లాట, ఎక్కడో రహస్యంగా జరిగిన చీట్లాట వగైరా- వగైరా వార్తలన్నీ రచ్చబండ చేరతాయి. ఒకరికి తెలిసిన వార్త మరొకరికి చెప్పుకుంటారు. అన్ని వార్తలూ అందరికీ తెలుస్తాయి. ఆ వార్తలన్నీ సాయంత్రానికి ఊరంతా వ్యాపిస్తాయి. వార్తలు సేకరించి ప్రచారం చేయడంలోనేకాక వదంతులు సృష్టించి, వ్యాపింపచేయడంలోనూ వాళ్లు సిద్ధహస్తులే. దొంగలకు, వ్యభిచారులకు, మోసగాళ్లకు, జూదరులకు, దొంగభక్తులకు రచ్చబండ ఓ గుడిబండలా తయారయింది.

రాత్రికి ఊళ్లో జరగబోవు భజన, భజన సంఘం రచ్చబండ సభ్యులకు చర్చనీయాంశమయిందీరోజు.

''రాత్రికి లింగరాజు ఇంట్లో భజన జరుగుతుందట. ఎక్కడెక్కడి భక్తులూ వచ్చారట'' అన్నాడు ఓ యువకుడు.

''లింగరాజు భక్తుల్లో చేరాడా?'' అడిగాడు మరో యువకుడు.

''లేకపోతే భక్తులంతా ఆయనింటికి ఎందుకొస్తారు?''

''ఆయన భక్తుడుగా మారడం ఆశ్చర్యం కదూ?''

''ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు. లింగరాజు ఒక్కడే కాదు, తొంభై అయిదు శాతంమంది అలాంటివాళ్లేనట ఆ సంఘంలో ఉండేది. ఆ సంఘం అధ్యక్షుడు నూటికి నెలకు అయిదు రూపాయలు వడ్డీవ్యాపారం చేస్తాడట''

''అతనికంటే ఘనుడు ఆచంట మల్లన్న' అన్నట్లు ఆ సంఘం కార్యదర్శి మరీ గొప్పవాడట?''

''ఏమిటో ఆ గొప్పతనం?''

''వారసుల్లేని ఆర్థికస్తోమతగల వితంతువుల్ని చేరదీసి, సంఘంలో చేర్చుకొని, మాయమాటలు చెప్పి, వాళ్లను వల్లో వేసుకొని ఆస్తిపాస్తులన్నీ కాజేసి లక్షాధికారి అయ్యాడట''

''ఈ అవివేకులంతా ఏం సాధించాలని సంఘంగా ఏర్పడినట్లు?''

''వాళ్లుకాదు నాయనా అవివేకులు, వాళ్ల మాటలు నమ్మి మోసపోతున్న అమాయకులు అవివేకులు'' అన్నాడు ఓ వృద్ధుడు.

''ఏదో ఎత్తు వేశాడు లింగరాజు''

''లింగరాజు ఒక్కడే కాదు... బలరామయ్య, వాళ్ల అనుయాయులూ ఆకస్మికంగా భక్తులయిపోయారు''

''ఎవరు ఎలాపోతే మనకేం!''

''అంత ఉదాసీనత పనికిరాదు నాయనా! ఎందుకొచ్చిన గొడవలే అనుకొని మీలాంటి యువకులంతా చేతులు ముడుచుకొని కూచున్నందువల్లే రోజురోజుకూ అఘాయిత్యాలు మి

తిమీరిపోతున్నాయి. మొన్న అదేదో రైల్లో అమాయకులయిన ప్రయాణికుల మీద కిరసనాయిలు చల్లి తగలబెట్టారట. స్త్రీలు, శిశువుల్తోసహా నలభై ఏడుమంది మరణించారట'' అన్నాడు వృద్ధుడు.

''మళ్లీ మనం ఆటవికులం అయిపోతున్నామా?''

''ఆటవికులు ఇలాంటి ఘోరకృత్యాలు చేయరు బాబూ. వాళ్లు స్త్రీలను, శిశువులను, నిరాయుధులను అనవసరంగా చంపరు. వాళ్లకు అపకారం చేసిన వాళ్లమీద ప్రతీకారం చేస్తారు. ఇప్పుడు జరుగుతున్న మానవాపహరణలు, హత్యలు తోడేలు- మేకపిల్ల కథను జ్ఞాపకం చేయడం లేదూ?'' అన్నాడు వృద్ధుడు ఆవేశంగా.

''మరి మమ్మల్ని ఏం చేయమంటావు తాతయ్యా?''

''ప్రజల్లో చైతన్యం కలిగించాలి. ప్రతి చిన్న విషయానికి ధర్నాలు, బందులు చేయించే రాజకీయనాయకులకు బుద్ధి చెప్పాలి''

''ధర్నాలు, బందులు చేయకపోతే మన అసమ్మతిని ప్రభుత్వానికి ఎలా తెలియజేయాలి తాతయ్యా?''

''అసమ్మతి తెలియజేయడానికి బందు ఒక్కటే మార్గమా? బందు చేసి బస్సులు, రైళ్లు ఆపివేస్తే ఎంతమందికి ఇబ్బంది కలుగుతుంది. పదిమంది కార్యకర్తలు వందలాది బస్సులను, లారీలను నిలిపివేస్తున్నారు. వేలాదిమంది ప్రయాణీకులకు ఇబ్బంది కలగజేస్తున్నారు. వాళ్లు చేసే పని మంచిదని ఒక్క ప్రయాణీకుడు అనుకుంటున్నాడా? పిరికితనం, ఉదాసీనత, అనైక్యతవల్ల కొద్దిమందికి భయపడి వేలాదిమంది మవునంగా చూస్తూ ఉండిపోతున్నారు. ప్రజలు చైతన్యవంతులయినప్పుడు బందు చేయించేవాళ్ల బుర్రలు రామకీర్తన పాడతాయి.

''ఆ... ఆ... ఏదేదో వాగాను... అసమ్మతి ఎలా తెలియజేయాలని అడిగావు కదూ... నిరాహార దీక్షలు చేయవచ్చు. ప్రజల్ని చేరదీసి ఊరేగింపులు, సభలు- సమావేశాలు నిర్వహించవచ్చు. అసలు ప్రజాసమస్యల కోసం బందు నిర్వహిస్తున్నారా? రాజకీయ ఎత్తుగడలతో ప్రజల్లో పాపులారిటీ సంపాదించడానికి ఈ అరాచకాలన్నీ చేస్తున్నారుగానీ'' ఆవేశంతో ఊగిపోయాడు వృద్ధుడు.

అతని ఆవేశం చూసి విస్తుపోయారు యువకులు.

కాంపోజిషన్ పుస్తకాలు, కాపీ పుస్తకాలు, చూచివ్రాత పుస్తకాలు, డిక్టేషను పుస్తకాలు గణితము, సైన్సు, సోషియల్ రికార్డుపుస్తకాలు కట్టలు కట్టలు తెచ్చిపెడుతున్నారు క్లాసులీడర్లు.

తరగతుల గదులన్నీ రంగురంగుల కాగితాలతో కనుల పండువుగా అలంకరించారు. సబ్జక్టులకు సంబంధించిన చార్టులు గోడలకు వేలాడదీశారు.

మూల పారవేసిన లెసన్ ప్లాన్లు తీసి దుమ్ము దులుపుతున్నారు కొంతమంది టీచర్లు. మొత్తంమీద హడావిడిగా ఉంది స్కూలు వాతావరణం.

''లెసన్ ప్లాన్లు అందరూ తెచ్చారా?'' అడిగారు హెడ్మాష్టరు.

''నా లెసన్ ప్లాన్ కనిపించలేదు సార్'' అన్నాడు గణితోపాధ్యాయుడు ప్రకాశం.

''ఉంటే కదా కనిపించడానికి, నాకు ఒక రోజు కూడా చూపించలేదే?''

''ఎందుకు చూపించలేదు సార్? మీరు మరచిపోయారు'' అంటూ తెలుగు పండిట్ విమలమ్మకేసి చూసి ముసిముసిగా నవ్వాడు ప్రకాశం.

అతని వెకిలిచేష్టలు పట్టించుకోకుండా పుస్తకాలు, క్లాసులువారీగా అమర్చుకోవడంలో నిమగ్నమయింది విమలమ్మ.

''జీపు వస్తోంది సార్, అందర్నీ రమ్మంటున్నారు హెడ్మాష్టరుగారు'' అన్నాడు అటెండరు స్టాఫ్‌రూమ్‌లోకి పరుగెత్తుకుంటూవచ్చి.

''వస్తే రానీలే... మా అందిరికీ ఏంపనుంది?'' అన్నాడు ప్రకాశం.

''అందరమూ వెళ్లి ఆహ్వానిస్తే బావుంటుంది'' అన్నాడు సైన్సు టీచరు ఆదినారాయణ.

''నువ్వు, హెడ్మాష్టరు వెళ్తే చాలదూ?''





అన్నాడు సోషియల్ అసిస్టెంటు.

"అందరమూ వెళ్తే తప్పేముంది?" అంటూ లేచాడు శ్రీనివాసులు.

ఆయనతోబాటు ఆదినారాయణ, విమలమ్మ, డ్రిల్లుమాష్టరు తదితరులు లేచారు.

"మోస్టు ఒబీడియంట్సంతా వెళ్లండి" అన్నాడు ప్రకాశం.

అందరూ లేచి స్కూలు వరండాలోకి వెళ్లేసరికి జీపు స్కూలు గేటుదాటి ఊళ్లోకి వెళ్లిపోయింది.

"జీపు ఎవరిదోలెండి సార్" అన్నాడు అటెండరు.

"డిప్యూటీ ఎడ్యుకేషనల్ ఆఫీసర్లందరికీ జీపులిస్తే గవర్నమెంటు దివాలా తీస్తుంది" అన్నాడు ప్రకాశం.

వరండాలోకి వచ్చిన ఉపాధ్యాయులంతా స్టాఫ్ రూమ్‌లోకి వెళ్లారు. ఆదినారాయణ, శ్రీనివాసులు హెడ్మాష్టరు గదిలోకి వెళ్లారు.

ఉదయం తొమ్మిది గంటలకే వస్తానని ప్రోగ్రాం పంపిన డి.ఇ.ఓ. పదిగంటలయినా రాకపోయేసరికి పాఠశాల కార్యక్రమం యధాప్రకారం ప్రారంభమయింది.

సాయంత్రం నాలుగ్గంటలకు, "సార్ సార్... ఇనస్పెక్టరు వస్తున్నారు సార్" అన్నాడు అటెండరు హడావుడిగా వచ్చి హెడ్మాష్టరుతో.

హెడ్మాష్టరు లేచి, వరండాలోకి వచ్చేసరికి గేటుదాటి స్కూలుగ్రౌండులోకి వచ్చాడు డి.ఇ.ఓ.

ఆదరాబాదరగా ఎదురుగా వెళ్ళి "నమస్కారం సార్" అన్నాడు హెడ్మాష్టరు.

నమస్కార సూచకంగా తల పంకించి, "అత్యవసరమయిన పనిపడటంవల్ల సకాలంలో రాలేకపోయానండీ" అన్నాడు అధికారి.

ఆఫీసరుగారిని లోపలికి పిలుచుకొని వచ్చి, కుర్చీలో కూచోబెట్టి, ఆదినారాయణకి ఏదో సైగ చేశాడు హెడ్మాష్టరు. ఆదినారాయణ అటెండర్ని పిలిచి మెల్లగా ఏదో చెప్పాడు.

ఆదరాబాదరా ఫ్లాస్కు తీసుకొని, వడివడిగా వెళ్లిపోయాడు అటెండరు.

"రేపు ఉదయం ఎనిమిది గంటలకే స్టూడెంట్సు, టీచర్సు వస్తే సాయంత్రానికల్లా ఇనస్పెక్షన్ ముగిద్దాం" అన్నాడు డి.ఇ.ఓ. హెడ్మాష్టరుతో.

"మీఇష్టంసార్... రమ్మంటే వస్తాం" అన్నాడు హెడ్మాష్టరు.

"ఎనిమిదివరకూ ఎందుకు, ఆరుగంటలకే రమ్మంటే వస్తారు" అంటూ గౌణిగారు అవతలి గదిలో కొంతమంది.

"అటెండరు రాలేదా?" అడిగాడు హెడ్మాష్టరు?

"అప్పుడే వస్తాడా? కాఫీగింజలు వేయించి, పొడికొట్టి, పాలుపితికి కాఫీ చేయాలి గదా?" అన్నాడు ఆదినారాయణ.

"అదో వస్తున్నాడు సార్!" అంది విమలమ్మ.

కాఫీ గ్లాసుల్లో వొంపి మొదట అధికారికి, హెడ్మాష్టరుకు ఇచ్చి తరువాత మిగితావాళ్లకు ఇచ్చాడు అటెండరు.

"టైమయింది, గంట కొట్టమంటారా సార్?" అన్నాడు అటెండరు.

హెడ్మాష్టరు ప్రశ్నార్థకంగా చూశాడు అధికారివేపు.

"టయిమయితే కొట్టవయ్యా, అడగడమెందుకూ?" అన్నాడు ఆఫీసరు.

టంగ్... టంగ్... టంగ్... టంగ్...నాలుగ్గంటలు కొట్టాడు అటెండరు.

పిల్లలంతా తరగతి గదుల్లోనుంచి బిలబిలమంటూ బయటికొచ్చారు. డ్రిల్లు మాష్టరు సైగచేశాడు లైనుగా వెళ్లమన్నట్లు. పిల్లలంతా వెళ్లిపోయారు.

ఉపాధ్యాయులంతా ఇళ్లకు బయల్దేరారు.

డి.ఇ.వో. వెంట వచ్చిన అటెండరు, స్కూలు అటెండర్ని పక్కకు పిలిచి చెవిలో ఏదో చెప్పాడు.

వెనుకనుంచి, "సార్" అన్నాడు అటెండరు ముందు వెళ్తున్న టీచర్లను.

వెళ్తున్న ఉపాధ్యాయులంతా ఆగి, తిరిగి చూసి, "ఏం?" అన్నారు.

"మీరు రావాలంట సార్" అన్నాడు ఆదినారాయణతో.

"ఏం?" అంటూ దగ్గరికి వచ్చిన ఆదినారా

యణతో, "టవలు, సబ్బు, టూత్‌పేస్టు, బ్రష్ కావాలట సార్" అన్నాడు అటెండరు.

"ఎవరికి?"

"ఇన్‌స్పెక్టరుగారికి"

"ఎవరు చెప్పారు?"

"ఇదో... ఇతడు చెబుతున్నాడు" అంటూ కొత్త అటెండర్ను చూపించాడు పాత అటెండరు.

"సరేలే" అంటూ వెళ్ళి, తనకోసం ఎదురు చూస్తూ నిల్చున్న టీచర్లని కలుసుకున్నాడు ఆదినారాయణ.

"వాడు ఏంచెప్పాడు సార్?" అడిగాడు సోషియల్ అసిస్టెంటు బయప్ప.

చెప్పాడు ఆదినారాయణ.

"ముంచేసేలా ఉన్నాడే" అన్నాడు ప్రకాశం. మరునాడు జరగబోవు ఇన్‌స్పెక్షను గురించి మాట్లాడుకుంటూ ఇళ్లకు వెళ్లారు ఉపాధ్యాయులందరూ.

హెడ్మాష్టరు, అటెండరు, గుమాస్తా మాత్రం స్కూల్లో ఉండిపోయారు.

మరునాడు ఉదయం ఎనిమిది గంటల నుండి సాయంత్రం నాలుగ్గంటలవరకూ ఇనస్పెక్షను జరిగింది. నాలుగున్నరకు స్టాఫ్ మీటింగు ఏర్పాటుచేశారు. టేబులుమీద ముదురునీలం రంగు బెడ్‌షీటు పరిచారు. ఫ్లవర్ వాజు, దాని పక్కన ఓ గ్లాసులో వెలిగించిన అగరొత్తులు ఉంచారు. ఉప విద్యాశాఖాధికారి, హెడ్మాష్టరు కుర్చీలమీద పక్కపక్కన కూచున్నారు. ఉపాధ్యాయులంతా వాళ్లకు ఎదురుగా కూచున్నారు.

ఉదయం నుండి జరిగిన ఇనస్పెక్షన్లో ఎవరెవరు ఏమేం తప్పులు చేశారో, ఎవరెవర్ని గురించి ఏమేం విమర్శలు చేస్తారోనని ఉపాధ్యాయులందరూ తమలోతాము ఆలోచిస్తున్నారు.

ప్రధానోపాధ్యాయులు లేచి- "గౌరవనీయులయిన డిఇవోగారూ, సోదర ఉపాధ్యాయినీ, ఉపాధ్యాయులారా! ఈనాటి మన సమావేశానికి అధ్యక్షత వహించమని మన డిప్యూటీ ఎడ్యుకేషనల్ ఆఫీసరుగారిని కోరుతున్నాను" అన్నాడు.

ఉపాధ్యాయులంతా చప్పట్లుకొట్టారు. బల్లమీది ట్రేలో వున్న పూలమాల తీసుకుని డి.ఇ.వో. మెడలోవేసి చప్పట్లు కొట్టాడు ప్రధానోపాధ్యాయులు. ఉపాధ్యాయులంతా చప్పట్లు కొట్టారు.

"ఎంత శిక్షణపొందినా, ఎంత అనుభవం ఉన్నా తప్పులు చేయడం మానవసహజం. మన తప్పులు మనకు తెలియవు కాబట్టి తప్పులు చేస్తుంటాం. అలాంటి తప్పులను ఎత్తిచూపి, సరియయిన సలహాలిచ్చి విద్యాభివృద్ధికి తోడ్పడాలనే ఉద్దేశంతో సంవత్సరానికి ఒకసారి ఇనస్పెక్షను జరుగుతుందన్న విషయం మీ అందరికీ తెలుసు. ఈనాటి ఇకస్పెక్షన్లో మన ఆఫీసరుగారు గమనించిన మన తప్పులను అంటే బోధనలోని లోపాలను మనకు తెలియజేసి, వీటిని దిద్దుకోవడానికి తగిన సలహాలు ఇవ్వగలరని మీ అందరి తరపున కోరుతున్నాను" అంటూ కూచోవడానికి అనుమతి కోరినట్లుగా ఆయనవేపు చూసి కూచున్నారు.

ఉపాధ్యాయులంతా మళ్లీ కరతాళధ్వనులు చేశారు.

ఆఫీసరుగారు లేచినిల్చొని, గొంతు సవరించుకొని బల్లమీద ఉన్న పేపరు వెయిట్ కుడిచేతితో తిప్పుతూ, ఎడమచెయ్యి పాంటు జేబులోపెట్టి చేతిరుమాలు బయటికితీసి, ముఖం తుడుచుకొని మళ్లీ జేబులో పెడుతూ, ప్రారంభించారు.

"గౌరవనీయులయిన హెడ్మాష్టరుగారూ, ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులారా... మీ సర్వీసులో ఇది మొదటి ఇన్‌స్పెక్షను కాదు. ఎన్నో ఇనస్పెక్షన్లు చూసి ఉంటారు. ఎంతోమంది కొత్తా పాతా ఆఫీసర్లను చూసి ఉంటారు. ఏడాదికి ఒకసారి జరిగే ఇన్‌స్పెక్షన్లో మీ మేధాశక్తినీ, బోధనాచాతుర్యాన్ని బేరీజువేయడం సులభంకాదు. మీ కర్తవ్య నిర్వహణకు, మీ బోధనా పటిమకు ప్రత్యక్షసాక్షులు, న్యాయనిర్ణేతలు మీ విద్యార్థినీవిద్యార్థులే. అయినా నా దృష్టికి వచ్చిన కొన్ని అంశాల్ని మీ దృష్టికి తేవడం నా బాధ్యతగా భావించి వివరించదలచుకున్నాను. మనమంతా మానవాతీతులం కాదు కాబట్టి




తప్పు చేయడం సహజం. అలాగే చేసిన తప్పు అంగీకరించి సరిదిద్దుకోవడం బుద్ధి మంతుల లక్షణం. నేను ఇవ్వబోయే సలహాలు ఆచరణ సాధ్యాలేకాని అసాధ్యమయినవి, అసంబద్ధమయినవి కాదని నా నమ్మకం.

"ముఖ్యంగా భాషల బోధన విషయం తీసు కుంటే ఆయా భాషాబోధకులు క్లాసులో ఆ భాషా వాతావరణం కల్పించడం అవసరం. ఉపాధ్యాయుడు, విద్యార్థుల మధ్య జరిగే ప్ర శ్నోత్తరాలు అదే భాషలో జరగాలి. అనువాదప ద్ధతి అనుసరించకుండా ప్రశ్నోత్తర పద్ధతి అమలుజరపడం అవసరం. పిల్లలు ఇచ్చే జవాబుల్లో వ్యాకరణ తప్పులు దొర్లినా వాళ్లను కించపరచి అవమానించకుండా సున్నితంగా వ్యవహరించి తప్పులు సరిదిద్దడానికి ప్రయ త్నించాలి.

కొత్తపదాలకు అర్థంచెప్పవలసి వచ్చినప్పుడు వాటి అర్థాలు మాతృభాషలో చెప్పకుండా కొత్త పదాన్ని వేరువేరు వాక్యాల్లో ప్రయోగించి, అర్థా లు రాబట్టడానికి ప్రయత్నించడం మంచిది. ఈ విషయంలో హిందీ ఉపాధ్యాయుడు బోధించిన విధానం సమర్థవంతంగా ఉంది. ఆంగ్లభాష బోధన విషయంలో కొంతమంది కేవలం అనువాద పద్ధతి అనుసరించారు. క్రమేపి ఆ పద్ధతికి స్వస్తి చెప్పగలరని ఆశిస్తు న్నాను. ఇక లెక్కలవిషయం. జామెట్రీ బోధించేటప్పుడు కోణమానిని, వృత్తలేఖిని లాంటి పరికరాలు కంపల్సరీగా ఉపయో గించాలి. మోడలుకు ఒక లెక్కచేసి అభ్యాస మంతా హోమ్‌వర్క్ ఇచ్చి చేతులు దులుపు కోవడం కంటే కొన్ని లెక్కలు క్లాసులోనే విద్యా ర్థులచేత బ్లాక్‌బోర్డుమీద చేయిస్తే ఉపయో గంగా ఉంటుందని నా అభిప్రాయం. ఇక సైన్సు- సైన్సుబోధనలో ప్రాక్టికల్ చేయడం అవసరం. క్లాసులోటెక్స్టుపుస్తకం ముట్టనేకూడ దు. నల్లబల్లమీద చిత్రాలు గీసి కొన్ని విషయా లు బోధించవచ్చు. రసాయనికశాస్త్రం బోధించే టప్పుడు తప్పనిసరిగా ప్రాక్టికల్సు చే యించాలి. పరిసరాల్లో లభించే వస్తువులు సేకరించి మ్యూజియం ఏర్పాటు చేయవచ్చు. సోషియల్ బోధనలో మ్యాపు, గ్లోబు ఉపయో గించి తీరాలి. ఈరోజు నేను గమనించిన ఓ అద్భుతం తెలియజేస్తాను. గాంధీ మహాత్ముని గురించిన పాఠంలో దక్షిణ ఆఫ్రికా ఎక్కడుందో చూపించమని ఓ విద్యార్థిని అడిగాను. 'దక్షిణా ఫ్రికా ప్రపంచపటంలో ఉంటుందిసార్, ఇది ఇండియామ్యాపు' అన్నాడు. పిల్లవాని జవాబు బావుంది. ఇండియా మ్యాపులో దక్షిణాఫ్రికా ఉండదన్న విషయం నిర్వివాదాంశం. అయితే విచిత్రమేమంటే అక్కడ గోడకు వేలాడుతు న్నది ప్రపంచపటం"

నవ్వులు, గుసగుసలు వినిపించాయి. ఉపా ధ్యాయులంతా ఒకరి ముఖాలొకరు చూసుకు న్నారు.

"ఈ అద్భుతం జరిగింది ఎవరిక్లాసులో అనేది ప్రశ్నగాదు. ఎంతవరకూ మనం మన బాధ్యత నిర్వహిస్తున్నామనేది ముఖ్యం. ఈ స్కూల్లో నా దృష్టికివచ్చిన మరో విషయం. టీచరు పాఠం బోధిస్తూండగా అతని టీచింగు నోట్సు అంతా తిరగేశాను. అయితే అతడు బోధిస్తున్న పాఠం అందులో కనిపించలేదు. 'పాఠానికి సంబంధించిన లెసన్‌ప్లాను ఎక్క డండీ?' అన్నాను.

బోధించడం ఆపేసి, "ఏ పాఠానికి సార్?" అన్నాడు.

"ఇప్పుడు బోధిస్తున్న పాఠానికి" అన్నాను.

"పాఠం ఇంకా పూర్తికాలేదుగద సార్? అపు డే లెసన్ ప్లాను ఎలా రాయమంటారు?" అన్నాడు ఆ మహానుభావుడు.

"ఏంచెప్పాలో తోచక వచ్చేశాను. ఇలాంటి విషయాల్లో ప్రధానోపాధ్యాయులు అప్రమ త్తంగా ఉండాలి. లెసన్‌ప్లాను ఉద్దేశమే ఆ టీచరుకు తెలియలేదన్నమాట. వాస్తవంగా లెసన్‌ప్లాను ఉద్దేశం ఆ టీచరుకు తెలియదా లేక ఏదో సాకుచెప్పి తప్పించుకోవడానికి ఎత్తు వేశాడా అనే మనం ఆలోచించవలసిన విషయం"

"ఎవరు? ఎవరు?" అన్నట్లు పరస్పరం కళ్లతో ప్రశ్నించుకున్నారు ఉపాధ్యాయులంద రూ.

"ప్రేయరు సమయంలో నేను గమనించిన లోపాలు మీ దృష్టికి తెస్తున్నాను. రోజూ వార్తలు చదివించాలి. సోషియల్ టీచరు శ్రద్ధతీసు కొని, ముఖ్యమయిన వార్తలు రాయించి రోజూ

ఒకరిచేత చదివించాలి. తరువాత ఆ వార్తల్ని అందరూ రాసుకొనేలా చూడాలి. రోజూ ఒక భావలో సామెత చెప్పి ఆ సామెత గురించి వివరించాలి. జాతీయగీతం ఉదయమే చెబుతున్నారు. ఏ కార్యక్రమమయినా ముగిసిన తరువాతే జాతీయగీతం చెబుతాంగదా? కాబట్టి సాయంత్రం జాతీయగీతంతో పాఠశాలకార్యక్రమం ముగించాలి''

''సరేసార్... అలాగేసార్'' అన్నారు ఉపాధ్యాయులు.

''గత సంవత్సరం ఇనస్పెక్షను జరగక ముందు అలాగే సాయంత్రం చెప్పించేవాళ్లంసార్'' అంది విమలమ్మ లేచి నిల్చొని.

''మరి ఎందుకు మార్చుకున్నారు?'' అడిగాడు అధికారి.

''డి.ఇ.ఓ.గారి సలహామేరకు మార్చుకున్నాం సార్'' అంది విమలమ్మ.

''అవునా హెడ్మాష్టరుగారూ?'' అడిగాడు అధికారి.

''ఆ పాత గొడవెందుకు సార్- ఇప్పుడు మీరు చెప్పినట్లే చేస్తాం'' అన్నాడు హెడ్మాష్టరు.

''ఇదేం పద్ధతి సార్? ఒక్కో ఆఫీసరు వచ్చినప్పుడు ఒక్కో విధంగా చెప్పడం ఏం బావుంటుంది? జాతీయగీతం పాడటం మామూలు విషయం కాదుగదా? దేశానికంతటికీ ఒకే పద్ధతి ఉండాలి. అలా కాకుండా ఆఫీసర్ల వ్యక్తిగత అభిప్రాయాల్ని అభిరుచుల్ని విద్యాసంస్థలమీద రుద్దడం సబబుగా ఉంటుందా?'' అన్నాడు శ్రీనివాసులు.

''ఎవరెవరి అభిప్రాయాలు వాళ్లవి- ప్రభుత్వాలు మారినప్పుడల్లా పద్ధతులు మారడంలేదూ?'' అన్నాడు డి.ఇ.ఓ.

''జాతీయగీతంలాంటి ముఖ్యమైన విషయంలోగూడా వ్యక్తిగత అభిప్రాయాలా?'' అంటూ విస్తుపోయాడు శ్రీనివాసులు.

''మీరు చెప్పిన పద్ధతే బావుందిలెండి సార్'' అన్నాడు ప్రకాశం.

సాంఘికోపాధ్యాయుని వందనసమర్పణ తరువాత జాతీయగీతంతో సభ ముగిసింది.

★ ★ ★

వంట గదిలో స్టౌ ముందు కూచొని ఏదో చదువుకుంటున్నాడు శ్రీనివాసులు.

''నమస్కారం సార్'' అంటూ వచ్చిన శకుంతల, సౌజన్యలను చూసి లేచి వచ్చి, ''కూచోండమ్మా'' అన్నాడు.

అమ్మాయిలు కూచున్నారు.

''ఉద్యోగం చేస్తూ ట్యూషను చెప్పడం కాస్త ఇబ్బందిగా ఉందమ్మా''

''తొమ్మిదిన్నర వరకూ ఇంటి వద్దే ఉంటారుగదా, ఇబ్బందేముంది?'' అంది శకుంతల.

''వంట చేయాలి, స్కూల్లో పాఠాలు చెప్పడానికి ప్రిపేర్ కావాలి''

''భుజంగం బావ వంటచేయరా?''

''చేయడట''

''ఎందుకని?''

''నేను పెళ్ళి చేసుకోవాలట. అందుకని వంట చేయకుండా మొండికేశాడు''

''మాకు ట్యూషన్ చెప్పడం మాత్రం మానకండిసార్. మా లెక్చరర్ చెప్పే పాఠాలు మాకు అర్థం కావడంలేదు'' అంది సౌజన్య.

''అర్థం కాకపోతే, అర్థం కాలేదని అడిగి మళ్ళీ చెప్పించుకోవచ్చుగాని గురువుమీద ఆరోపణ చేయడం మంచిది కాదమ్మా! ట్యూషన్ చెప్పేవాళ్ళు కొంతమంది ఇలాంటి ఆరోపణల్ని చిలువలు-పలువలుచేసి, గోరంతలు కొండంతలు చేసి పబ్బం గడుపుకుంటారు'' అన్నాడు శ్రీనివాసులు కాస్త కటువుగా.

''మా మేడమ్ క్లాసులోనే మిమ్మల్ని విమర్శిస్తుంది సార్! ఎం.ఎ. పాసయిన మాకే కొన్ని సందర్భాలు అర్థం కావు, కేవలం ఓరియంటల్ టైటిల్ పాసయిన శ్రీనివాసులుకేం తెలుస్తుంది- అంటుంది'' అంది శకుంతల.

''పరీక్షలు పాసుకావడానికి, విషయం అర్థం చేసుకోవడానికి సంబంధం లేదు శకుంతలా! కొంతమంది సెకండరీ గ్రేడు ఉపాధ్యాయులు బి.ఎ. వాళ్ళకు ఇంగ్లీషు చెబుతున్నారు. ఏది యేమయినా మీటీచరు పిల్లల సమక్షంలో మరో ఉపాధ్యాయుణ్ణి విమర్శించడం మంచిది కాదు. ఆ విషయం మీరు అక్కడే మరచిపోకుండా జాగ్రత్తగా జ్ఞాపకం పెట్టుకుని నాకు





చెప్పడం అసలు మంచిది కాదు'' అన్నాడు శ్రీనివాసులు.

''పోనీలెండి సార్ పొరపాటయింది'' అంది సౌజన్య.

''ఇప్పుడే వస్తాను. కూచొని చదువు కుంటూండండి''

''ఇన్ని పనులు చేస్తూ మాకు ట్యూషన్ చెప్పడం ఇబ్బందే సార్- పెళ్ళి చేసుకోండి'' అంది శకుంతల.

''ఇప్పుడే వద్దు లెండి సార్'' అంది సౌజన్య.

వాళ్ళ మాటలు వినిపించుకోకుండా లోపలికి వెళ్ళాడు శ్రీనివాసులు.

''ఏమిటే శకూ... సార్‌తో అంత చనువుగా మాట్లాడతావు?''

''ఏం... మాట్లాడకూడదా? మా బావే కదా? నువ్వు రాకముందు బావా అనేదాన్ని''

''సార్ పెళ్ళి చేసుకుంటే మనకు ట్యూషను చెబుతారో లేదో? మన చదువు పూర్తయ్యేవరకూ బ్రహ్మచారిగానే ఉండనీ'' అంది సౌజన్య.

''పెళ్ళిచేసుకుంటే వంటపని తప్పుతుంది గదా! ట్యూషను చెప్పడానికి ఎక్కువ టైముంటుంది''

''పెళ్ళి చేసుకుంటే ట్యూషను చెప్పనిస్తుందో లేదో''

''ఎవరు?''

''ఆయన భార్య''

''ఏం... ఎందుకు చెప్పనివ్వదు?''

''పిచ్చిదానా ఆమె కూడా మనలాంటి ఆడదే కదా? అయ్యవారిని ఎక్కడ మనం వల్లో వేసుకుంటామోనని ట్యూషన్ మానిపించేయదూ?''

''మానిపించాలనుకున్నా మా బావ మానుకోడులేవే, నీకా భయం అక్కర్లేదు''

''మీ బావ మీద నీకంత నమ్మకం ఉందేమోగాని- నాకు మాత్రం అనుమానమే. 'కొమ్ములు తిరిగిన మగవాడు కూడా కొంగు తగిలితే పోలేడు' అన్నారు కదా?''

''ఎవరి కొంగే?''

''ఆడవారి కొంగు''

''నీ కొంగా-నా కొంగా?''

''ఛీ... వేళాకోళం నీది-నాది ఎందుకు తగుల్తుంది? ఆయన పెళ్లానిదే''

''ఆయన పెళ్ళాం కొంగు తగిలితే మనకేం నష్టం?''

''అసలు పాయింటు నీకు అవగతం కాలేదు. ఆమె గీచినగీటు దాటుతాడా అని'' అంది సౌజన్య.

''ఓహో... అదా సంగతి?''

''చదువు కొంటున్నారా, మాట్లాడుతున్నారా?'' అన్నాడు శ్రీనివాసులు లోపలి నుండి.

''ష్...ష్...'' అంటూ పెదాల మీద చూపుడు వేలు ఉంచుకున్నారు ఇద్దరూ ఒకేసారి.

ఇంతలో శ్రీనివాసులు వచ్చి, కుర్చీలో కూచొని పాఠం తీసుకోమన్నాడు. పాఠం తీసి, పుస్తకం అతని చేతికిచ్చింది శకుంతల.

''చదువు సౌజన్యా'' అన్నాడు.

-''నారీ తుమ్ కేవల్ శ్రద్ధాహో
విశ్వాస్ రజత్ నగ్‌పగ్ తల్ మేఁ''
పీయూష్ స్రోత్ సీ బహాకరో
జీవన్‌కే సుందర్ సమతల్ మేఁ''
చదివింది సౌజన్య.

భావం చెప్పసాగాడు శ్రీనివాసులు-బాల్యస్నేహితురాలు శ్రద్ధను గుర్తించిన మనువు ఆమె సౌందర్యాన్ని వర్ణిస్తూ తన హృదయాన్ని ఆమెకు అర్పించాడు. సిగ్గుతో ముడుచుకొని పోయింది శ్రద్ధ. ఏవేవో మాట్లాడాలనుకున్న శ్రద్ధ ఒక్కమాట కూడా మాట్లాడలేకపోయింది. సాయంకాలపు సూర్యుని ఎర్రని వెలుగులో ఓ ఆకారం కనిపించిందామెకు. ఆ ఆకారం శ్రద్ధను సంబోధించి ''నారీమణీ... నీవు సత్యము, ప్రేమ, విశ్వాసమనే భావాల సాకారమూర్తివి. నిన్ను శ్రద్ధ అని కూడా అంటారు. నీవు త్యాగమూర్తివి, వెండికొండల శిఖరాల నుంచి జాలువారిన మంచు కిందికి ప్రవహించి, అమృతంలాంటి నీటితో భూమిని తడిపి అక్కడ నివసించేవారికి సుఖం కలుగజేసినట్లు నీవు కూడా వెండి కొండలాంటి పవిత్రమయిన పురుషుని విశ్వసించి నీ సర్వస్వమూ అతనికి సమర్పించి, త్యాగము, తపము అనే సత్కార్యాలచే అతని జీవితంలోని లోటును

రూపుమాపి ఇరువురి జీవితమనే భూమిని సమతలం చేయడానికి ప్రయత్నించుము. జీవితమనే సమతల భూమిని అమృతంలాంటి పవిత్ర భావాలతో తడిపి ఇతరులకు కూడా సుఖసంతోషాలు కలిగించి ఆనందంగా జీవితం గడుపుము.''

స్త్రీ సద్గుణాల్ని తెలియజేయడానికి ఆమెను జీవనదితో పోల్చి గృహిణి గొప్పతనాన్ని చక్కగా చిత్రించాడు మహాకవి జయశంకర్‌ప్రసాద్ నది మిట్టపల్లాలను సమతలం చేసినట్లే స్త్రీ కూడా అందర్నీ సమానదృష్టితో చూస్తుంది. నిరంతరమూ ప్రవహిస్తూ అన్ని ప్రాణులకూ ఆనందం కలిగించే జీవనదిలా గృహిణి తన గృహంలో సేవ, ప్రేమానురాగాలతో అందర్నీ తృప్తిపరిచి ఆనందం కలుగజేస్తుంది. అందర్నీ భరించి, ఆదరించి, పోషించినందువల్లే పెళ్ళి కాగానే స్త్రీని భార్య అంటున్నారు. భార్య అంటే అర్థం భరించునది. మహాభారతంలో కూడా భార్య అనే పదాన్ని బహుచక్కగా వివేచించాడు కవి'' అంటూ ముగించి లేచాడు శ్రీనివాసులు.

''చెప్పండి సార్... చెప్పండి సార్...'' అన్నారు ఇద్దరూ ఒకేసారి.

''సాయంత్రం చెబుతాలెండి, స్కూలుకు టైమయింది''

''మహాకవి జయశంకర్ ప్రసాద్ అన్నారు. అయితే ఈ పద్యం 'కామాయని' లోనిదే కద సార్?'' అడిగింది శకుంతల.

''అవును... ఒకరోజు అడిగావు కదూ, కామాయని గొప్ప కావ్యమా అని! కవి పరిచయంలో అన్నివివరాలూ ఉన్నాయి. మనను లగ్నం చేసి చదివితే గదా?'' అన్నాడు శ్రీనివాసులు.

''వెళ్తాంసార్... నమస్తే!'' అంటూ వెళ్ళిపోయారు అమ్మాయిలు. ఆదరాబాదరాగా స్కూలుకు వెళ్ళాడు శ్రీనివాసులు.

అప్పుడప్పుడే ప్రేయరు ముగిసి క్లాసులకు వెళ్తున్నారు పిల్లలు.

విమలమ్మ, శ్రీనివాసులు తప్ప మిగిలిన టీచర్లు క్లాసులకు వెళ్లారు.

''ఇన్‌స్పెక్షను గురించి మీ అభిప్రాయమేమిటి సార్?'' అంది విమలమ్మ.

చదువుతున్న వార్తాపత్రిక పక్కన పెట్టి, ''మీకు తెలియందేముంది మేడమ్. ఆ విద్యాశాఖాధికారిగారు తనే సర్వజ్ఞుడినన్న భావం అడుగడుగునా ప్రదర్శించారు? విద్యాశాఖలో పనిచేసే వారికి జ్ఞానం అవసరం. చక్కగా చదివి జ్ఞానం సంపాదించుకోమని టీచర్లకు సలహా ఇవ్వాలి. అవసరమయిన క్వాలిఫికేషను కంటే ఎక్కువ చదువుకున్నవాళ్ళను మెచ్చుకోవాలి. ఇంకా చదువుకోమని ప్రోత్సహించాలి. అలా ప్రోత్సహించక పోగా ఆ డిగ్రీ ఎందుకు? ఈ డిగ్రీ ఎందుకు? సెకండరీ గ్రేడుకు బి.ఎ. ఎందుకు? ఎల్. టి. అసిస్టెంటుకు పోస్టు గ్రాడ్యుయేషన్ ఎందుకు? అంటూ నిరుత్సాహపరచడానికి శాయశక్తులా ప్రయత్నంచేశాడు పాపం! ఇతరులెవరూ తన కంటే ఎక్కువ చదువుకోకూడదన్న భావం కాబోలు! ఇలాంటి అసూయాపరులు విద్యాశాఖలో ఉంటే ప్రమాదం. అవసరమయిన చదువుకంటే ఎక్కువ చదువుకున్న వాళ్ళను ప్రశంసించడం ఇష్టంలేకపోతే తటస్థంగా ఉండాలిగాని అభిశంసించడం మంచిది కాదు. అడిగేవానికి చెప్పేవాడు లోకువ కదా? ఆఫీసరు హోదాలో ఆయన ఏం మాట్లాడినా చెల్లుతుంది. ఆయన స్థానంలో మనమూ మన స్థానంలో ఆయనా ఉంటే నోరు తెరవలేడనుకోండి. 'కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా' అన్నారు యోగివేమన. తెలిసిన వారెవరూ అనవసరంగా నోరు పారేసుకోరు'' అన్నాడు శ్రీనివాసులు

''అంతే కదసార్ ' నిండుకుండ తొణకదు' అన్నారు పెద్దలు'' అంది విమలమ్మ.

''చాలా మంచి సామెత చెప్పారు మేడమ్. అదే సామెతను హిందీలో మరోవిధంగా చెప్పారు - 'అధజల్ గగరీ ఛలకత్‌జాయ్' అని''

''అర్థమేం సార్?''

''వెలితి కుండ తొణుకును''

ఇంతలో అటెండరు వచ్చి, ''హెడ్మాష్టరు పిలుస్తున్నారు సార్'' అన్నాడు.

''ఎవర్ని శివప్పా?'' అంది విమలమ్మ.

''ఇద్దర్నీ మేడమ్''

'' మేం ఇద్దరమేనా, టీచర్లందర్నీ రమ్మ





న్నారా?" అడిగాడు శ్రీనివాసులు.

"అందర్నీ రమ్మన్నారు సార్"

"వస్తున్నాం వద!" అంటూ లేచాడు శ్రీనివాసులు. విమలమ్మ కూడా లేచింది. ఇద్దరూ హెడ్మాష్టరు గదిలోకి వెళ్ళారు.

అప్పటికే టీచర్లంతా హెడ్మాష్టరు గదిలో కూచున్నారు.

"శివప్పా!" పిలిచాడు హెడ్మాష్టరు.

"సార్" అంటూ వచ్చాడు అటెండరు.

"కాఫీలు"

"ఎన్ని సార్?"

"పది!"

ఫ్లాస్కు తీసుకొని బయల్దేరాడు శివప్ప.

"త్వరగా రా... కబుర్లు చెప్తూ అక్కడే ఉండొద్దు!" అన్నాడు ఆదినారాయణ.

"మీరు, అందరూ సహకరించి ఇనస్పెక్షను జయప్రదంగా ముగించినందుకు మరోసారి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. మరో ముఖ్య విషయమేమంటే ఇనస్పెక్షనుకు అయిన ఖర్చు ఎలా మీట్ చేయాలని ఆలోచించడానికి మిమ్మల్ని రమ్మన్నాను. అందరికీ ఆమోదయోగ్యమయిన సలహా ఎవరిచ్చినా పాటిద్దాం" అన్నాడు హెడ్మాష్టరు.

"ఎంతయింది?" ప్రశ్నించాడు ప్రకాశం.

"తెలీదు... ఆ బాధ్యతంతా డ్రిల్లుమాష్టరు గారికి అప్పగించాం కదా? ఆయనే చెప్పాలి - ఎంత ఖర్చయిందో!" అంటూ డ్రిల్లు మాష్టరు వైపు తిరిగి, "చెప్పండి సార్!" అన్నాడు హెడ్మాష్టరు.

"ఐదు వందల నలభైఆరు రూపాయలయింది సార్!" అన్నాడు.

"అయిదు వందలు నలభైఆరు రూపాయలా? ఇదేం పెళ్లా...?" మండి పడ్డాడు ప్రకాశం.

"నేనేమన్నా తినేశానా...? తను దొంగయితే పొరుగును నమ్మడట." అన్నాడు డ్రిల్లు టీచరు.

"గుమ్మడి కాయల దొంగంటే భుజాలు తడుముకుంటా వెందుకు?" అన్నాడు ప్రకాశం.

"పోట్లాడ్డమెందుకు, ఖర్చుల జాబితా ఉందికదా చూడండి!" అన్నాడు హెడ్మాష్టరు.

"జాబితాదేముంది సార్, ఎన్నయినా రాయొచ్చు" అన్నాడు ప్రకాశం.

"మీలా నేను లింగంతోబాటు గుడిని మింగనులెండి"

"నేను మింగానా?"

"మింగలేదా?"

"ఏం మింగాను చెప్పండి!"

"మన స్కూల్లో గ్రిక్సు జరిగినప్పుడు అందరమూ కలసి పల్లె పల్లె తిరిగి డబ్బులు వసూల చేసి మీ చేతికిస్తే స్వాహా చేయలేదూ? దాతల పేర్లు విరాళాలు రాసిన పుస్తకమే లేదని బుకాయించారు గదా? అప్పుడే మరచిపోయామనుకున్నారా?" ఆవేశంగా లేచి నిల్చున్నాడు డ్రిల్లు మాష్టరు.

"గతజల సేతుబంధనం ఎందుకు లెండి. ప్రస్తుతం జరగవలసిన పని చూడండి" అన్నాడు శ్రీనివాసులు

"అవునయ్యా... అనవసర ప్రసంగాలతో అర్థగంట గడిచిపోయింది" అన్నాడు ఆదినారాయణ.

"తెచ్చిన సరుకుల వివరాలు చెప్పండి సార్! " అన్నాడు హెడ్మాష్టరు.

జేబులోంచి ఓ కాగితం తీసి చదివాడు డ్రిల్లు మాష్టరు.

"ఇతర ఖర్చులు వంద యాభైరూపాయలు రాశారే - జబ్బు ఖర్చు ఇరవై, మందు ఖర్చు యాభై అన్నట్లు" అన్నాడు ప్రకాశం.

"ఛార్జీలు, మామూళ్ళు వగైరా!" అన్నాడు డ్రిల్లు మాష్టరు.

"ఛార్జీలు సరే... మామూళ్లేమిటి?" అన్నాడు ఎస్.జి. వెంకటస్వామి.

"మామూళ్లంటే తెలీదా సార్? గీతం!" అన్నాడు సోషియల్ అసిస్టెంటు బయప్ప.

"గీత మంటే?"

"అక్విటెన్సులో సంతకం పెట్టి అఫీషియల్గా తీసుకోనేది జీతం"

అనవసర జాప్యంచేసి, ఏదో పరీక్షచేసి లేని తప్పులు వెదక్కుండా పనులు చే

సినందుకు తీసుకొనేది గీతం'' అన్నాడు సోషియల్ అసిస్టెంట్.

''అదేందిసార్... మామూళ్లంటే ఏమిటని అడిగితే గీతం గురించి చెబుతారు. పంచ పాండవులంటే మంచంకోళ్లలా ముగ్గురు అని రెండువేళ్లు చూపినట్లు?'' అన్నాడు వెంకట స్వామి.

అందరూ పకపక నవ్వారు.

''గీతమంటే బావుండదని ముద్దుగా 'మామూలు' అని పేరు పెట్టారు'' అన్నాడు సోషియల్ అసిస్టెంట్.

''గీతమో... గీతమోగానీ వందాయాభై రూపాయలు అదనంగా ఫైన్'' అన్నాడు ప్రకాశం.

''అయ్యా అడిగేవాడికి చెప్పేవాడు లోకువట. బాధ్యత వహించి చేసిందిగాక అదెందుకు? ఇదెందుకు? అదేమిటి? ఇదేమిటి? అంటూ నతాయిస్తే సొమ్ముపోయి దిమ్ము పట్టినట్లుంటుంది'' అన్నాడు హెడ్మాష్టరు.

''మీరిద్దరూ ఒకటేగా?'' అన్నాడు ప్రశాశం.

''మీరందరూ వేరా?''

''మాకు లేదుగా?'' అన్నాడు ప్రకాశం.

''మాకు ఇంతవరకూ తెలీదే'' అన్నాడు



ఆదినారాయణ.

"ఏం తెలియదు?" అడిగాడు సోషియల్ అసిస్టెంటు.

"అదే ప్రకాశంగారికి లేని విషయం"

ఉద్రిక్తంగా ఉన్న వాతావరణంలో నవ్వుల పువ్వులు విరిశాయి.

పొరపాటు అర్థం చేసుకున్న ప్రకాశం ముఖం చిన్నబోయింది.

"అదికాదండీ, వాళ్లిద్దరికీ చివర్న 'మాస్టరు' ఉందిగా? మనకందరికీ ఉందా?" అన్నాడు.

"అదా అసలు సంగతి?" అంటూ నవ్వాడు శ్రీనివాసులు.

"హాస్యాలు, పరిహాసాలు తరువాత చూద్దాం. ఇన్‌స్పెక్షను ఖర్చు ఎలా అడ్జెస్టు చేయాలో ఆలోచించండి" అన్నాడు సోషియల్ అసిస్టెంటు.

"మీరు తలా ఇరవై రూపాయలివ్వండి, న్యూసుపేపర్లు, ఓల్డు ఆన్సరు స్క్రిప్ట్సు అమ్మి మిగతా డబ్బు నేను అడ్జెస్టు చేస్తాను" అన్నాడు హెడ్మాష్టరు.

"గాడిదను, గుర్రాన్ని ఒకటిగా చేస్తే ఎలా సార్?" అన్నాడు వెంకటస్వామి.

"గాడిదెవరు? గుర్రమెవరు?" అడిగాడు ప్రకాశం.

"అదిగాదు సార్... పెద్ద టీచర్లు, చిన్న టీచర్లు ఒకటేనా సార్?"

"మీ అభిప్రాయమేమిటో చెప్పండి?" ప్రశ్నించాడు హెడ్మాస్టరు.

"బేసిక్ పే ఆధారంగా డివైడు చేయండి" సలహాఇచ్చాడు వెంకటస్వామి.

"అదేంసార్... బేసిక్ ఆధారంగా ఇనస్పెక్షన్ జరిగిందా?" అంది విమలమ్మ.

"నీకు తెలీదు ఊరుకోమ్మా! కొన్ని స్కూళ్లలో ఇనస్పెక్షను ఖర్చంతా హెడ్మాస్టరే భరిస్తాడు" అన్నాడు వెంకటస్వామి.

"భరిస్తారు... ఎందుకు భరించరు? స్పెషలు ఫీజంతా మింగేసి వాళ్లు భరిస్తే నష్టమేమి?" అన్నాడు ఆదినారాయణ.

"నేనొప్పింది అందరికీ ఇష్టమేనా?" అడిగాడు హెడ్మాస్టరు.

"వెంకటస్వామి ఏదో అమెండుమెంటు పెడుతున్నాడే?" అన్నాడు డ్రిల్లుమాష్టరు.

"ఎందుకులెండి సార్... అందరమూ సమానంగా ఇద్దాం" అంది విమలమ్మ.

"పెళ్లీపెడాకులు లేకుండా ఏకాకిగా ఉన్నావు నీకేమ్మా, ఎంతఖర్చుచేసినా అడిగేవాళ్లు లేరు" అన్నాడు వెంకటస్వామి.

విమలమ్మ ముఖం వివర్ణమయింది.

"వ్యక్తిగత విషయాలు మాట్లాడ్డం మంచిది కాదు సార్" అన్నాడు శ్రీనివాసులు.

"ఉన్నమాటంటే ఉలుకెందుకు?" అన్నాడు వెంకటస్వామి.

"పోనీలెండి... పే వచ్చిన తరువాతే కదా డబ్బులు?" అడిగాడు హెడ్మాస్టరు.

"అంతేసార్... మంత్ ఎండింగులో ఎక్కడి నుంచి వస్తుంది?" అన్నాడు వెంకటస్వామి.

"కాఫీ వచ్చిందా?" అడిగాడు హెడ్మాస్టరు.

"శివప్పా, కాఫీ ఇవ్వు" అన్నాడు ఆదినారాయణ.

కాఫీ గ్లాసులో వొంపి అందరికీ ఇచ్చాడు. అందరూ తాగిన తరువాత, "లెటజ్ గో" అంటూ కుర్చీలో నుంచి లేచాడు హెడ్మాస్టరు.

మాట్లాడుకుంటూ అందరూ ఇళ్లకు వెళ్లారు.



"బావా వేంకటేశ్వరా నమస్కారం! నమస్కారం!!" అన్నాడు రామలింగం.

"ఏమిటోయ్... నాపేరు మార్చావా?"

"శ్రీనివాసులన్నా బాలాజీ అన్నా వేంకటే

శ్వరుడు అన్నా ఒకటేకదా?''

''అవి శేషాద్రివాసుడు వేంకటేశ్వర స్వామి పేర్లు. వడ్డికాసులువాడని మరోపేరు కూడా ఉంది. అయినా లోగడ ఎప్పుడూ పిలవని పేరుతో ఈరోజు పిలవడం వింతగా ఉంది''

''వింతగాదు విశేషం''

''విశేషమా... ఏమిటో అంతా కొత్తగా ఉందే? టేపురికార్డరు కూడా తెచ్చావే- ఎందుకు?''

''ఆ సంగతి తరువాత చెబుతాకాని వేంకటే శ్వర స్వామికి ఎంతమంది భార్యలు?''

''ఎంతమంది? శ్రీదేవి మాత్రమే కదా?''

''అలివేలు మంగమ్మ కూడా ఉందట గదా?''

''అయినా స్వామిని గురించిన సమాచా రంతో పనేముంది?''

''నువ్వు కూడా ఇద్దరు ముగ్గుర్ని చేసుకోవ లసి వస్తుందేమోనని''

''బహువచనంలోకి దిగితే ఉద్యోగం ఊడు తుంది''

''ఎంతోమంది ఉద్యోగులకు చిన్నిల్లు-పెద్ది ల్లు ఉన్నాయేమరి''

''ఒకటి మాత్రమే లెక్కలో ఉంటుంది''

''నువ్వో అంతే- లోకానికి తెలిసేట్లు ఒకర్ని చేసుకొనేది, మిగిలినవాళ్లు అమానతులో ఉంటారు''

''ఇదేం రాజుల కాలమనుకున్నావా- ఎంత మందంటే అంతమందిని చేసుకోవడానికి?''

''వత్తిడి వచ్చినప్పుడు ఏంచేయాలి మరి? ఎవరిని చేసుకొనేది, ఎవరిని వదిలేసేది?''

''ఇంతకూ అసలు సంగతి చెప్పలేదు. ఎవరు ఇస్తామంటున్నారు? ఎంతమంది వత్తి డి చేస్తున్నారు?''

''బలరామయ్యేమో మీ నాన్నగారికి ఇచ్చిన మాట నిలుపుకోవాలని అంటున్నాడు''

''మనకూ నచ్చాలిగదా?''

''మరో సంబంధం ఉంది. కొత్తదేమీ కాదు, నీకు నచ్చేదే''

''నాకు నచ్చేదా? ఏమిటో తోచడంలేదే?''

''అయితే విను!'' అంటూ తను తెచ్చిన టేపురికార్డరు ఆన్‌చేశాడు రామలింగం.

''నమస్కారం బావా!''

''నమస్తే... రా శకూ... రా... కూచో''

''చదువు ఎలా సాగుతోంది శకూ?''

''ఏ చదువు?''

''అంటే?''

''హిందీనా లేక అన్ని సబ్జక్టుల గురించి అడుగుతున్నారా?''

''అన్ని సబ్జక్టులు. హిందీ మాత్రమే చది వితే ఏం ప్రయోజనం?''

''ప్రయోజనంలేదని తెలుసు. అయినా హిందీ అర్థమయినట్లు మిగిలిన సబ్జక్ట్సు అర్థ కావడంలేదే''

''అర్థం కావాలంటే లెక్చరర్లంతా బావగార్లు కావాలేమో?''

''పో బావా... ఎప్పుడూ ఇంతే!''

''ఎప్పుడూ అంటున్నావు, ఎంతోకాలం నుంచి పరిచయం ఉన్నట్లు''

''అన్నం ఉడికిందో లేదో తెలుసుకోవడానికి మెతుకులన్నీ పట్టిచూడాలా?''

''అబ్బో... సామెతలు కూడా వచ్చే, ఉపయో గపడతావు- ఎవరికయినా?''

''ఎవరికయినా ఉపయోగపడటానికి నేనేం పనికిమాలినదాన్నా?''

''ఉపయోగించుకొనే వాళ్లకు మాత్రమే''

''అదేం కుదరదు, నాకు నచ్చిన వాళ్లకే ఉపయోగపడతాను''

''వచ్చింది చదువుకోవడానికా, మాట్లాడ్డాని కా?''

''ఈ దోహా సరిగా అర్థంకాలేదు''

''ఏదీ, చదువు''

''ప్రేమన బాడీ ఉపజై, ప్రేమ్ నహాట్ బికాయ్.

రాజా పరజా జెహిరుచై, సీస్‌దేయ్ లై జాయ్''

''భావం చెప్పాలా''

''చెప్పండి''

''ప్రేమ తోటలో పండదు, సంతలో కొనడాని

కి దొరకదు; రాజుకానీ, సామన్య ప్రజలుకానీ ప్రేమకు పాత్రులు కావాలనుకుంటే అహంకారం మాని, అవసరమయితే సర్వస్వ మూ త్యజించి ప్రేమను పొందవచ్చు''

''సీస్‌దేయ్ అంటే అహంకారం వదిలేసి అని అర్థమా?''

''అవును... సర్వస్వం త్యాగం చేసి అని కూడా. సర్వస్వం త్యజించడమంటే అహంకా రాన్ని త్యజించడమనే కదా?''

''అర్థమయింది, బావా''

''గురువుకు గురువు కావడం నీకిష్టమేనా?''

''అంటే, గుగ్గురువా?''

''ఏమో... నాకు తెలియదు. నువ్వు నాకు ఇంగ్లీషు నేర్పించాలి''

''నేను నేర్పడమేంటి బావా, ఆంగ్లో-తెలుగు ప్రైమరు తెచ్చుకో, సులభంగా నేర్చుకోవచ్చు. కొన్నాళ్లకు నాకు ఇంగ్లీషు కూడా చెబుతావు''

''నాకు ఎక్కడ దొరుకుతుంది. నువ్వు రోజూ కాలేజికి వెళ్తావు కదా ఒక పుస్తకం తీసుకురా''

''తెస్తానుకానీ, మిమ్మల్ని ఒకటి అడగాలి''

''ఒకటేం ఖర్మ, ఎన్నికావాలంటే అన్ని అడుగు''

''అదికాదు బావా... సౌజన్య కూడా ట్యూష నుకు వస్తుందట''

''ఎవరమ్మాయి?''

''సర్పంచ్ లింగరాజుగారి అమ్మాయి''

''నీ క్లాసేనా? శ్రద్ధగా చదువుకుంటుందా?''

''నాకంటే శ్రద్ధగా చదువుకుంటుంది''

''అయితే రమ్మను''

''వెళ్తా బావా... టయిమయింది''

''మంచిది.''

టేపురికార్డరు ఆగిపోయింది.

''ఎప్పుడు రికార్డుచేశావు?'' అడిగాడు శ్రీని వాసులు.

''మీరు మాట్లాడినప్పుడు. సరేగానీ- శకుంతల పెళ్లి సంగతేమిటి?''

''అమ్మాయికి తల్లిదండ్రులున్నారుగా మరి. నువ్వు వకల్తా పుచ్చుకున్నావేమిటి?''

''వకల్తా కాదు, మధ్యవర్తిత్వం''

''నా అభిప్రాయం తెలుసుకోమన్నారా?''

''అవును... అడగమన్నాడు సుబ్బయ్య''

''ఆయనకేం ధనవంతుడు. నాకంటే మంచి అల్లుణ్ని చూసుకోగలడు''

''అదంతా అనవసరం. నీ అభిప్రాయం చెప్పు''

''నీ అభిప్రాయం చెప్పు. బలరామయ్య మేనకోడలు మేలా? శకుంతల మేలా?''

''బలరామయ్య మేనకోడలు విషయం నాకు తెలీదు. అమ్మాయిని కూడా చూడలేదు. చదువు - సంధ్యలు గురించి కూడా తెలీదు. శకుంతల చిన్నప్పటినుంచి తెలిసినమ్మాయి''

''అప్పుడే పెళ్లికి తొందరేమొచ్చింది?''

''ఇంట్లో ఆడదిక్కు లేదుకదా?''

''అమ్మాయి డిగ్రీ పూర్తి చేయాలిగా? అర్థాంతరంగా ఆపేయడం ఎందుకు?''

''అయితే ఇష్టమేనన్న మాట?''

''ఇష్టాఇష్టాలు ఇప్పుడే చెప్పలేను. ముఖ్య మయిన నిర్ణయాలు తీసుకొనేటప్పుడు తొంద రపడకూడదు''

''తొందరేం అవసరం లేదు. తాపీగా ఆలో చించే చెప్పు''

''కాసెట్టులో బంధించిన మా సంభాషణ ఎవరికయినా వినిపించావా?''

''నా భార్యకు కూడా వినిపించలేదు. భద్రంగా పెట్టెలో దాచాను''

''దాన్ని చెడగొట్టి వేరే ఏదయినా రికార్డు చెయ్యడం మంచిదేమో. అలాంటివి ఒక్కప్పు డు ఇబ్బంది కలిగిస్తాయి''

''సరే... అలాగే చేస్తాలే. వెళ్తామరి''

''మంచిది'' అన్నాడు శ్రీనివాసులు.

వెళ్లిపోయాడు రామలింగం.

★ ★ ★

రెగ్యులర్స్‌గా అపాయింటు చేసిన అసిస్టెంటు ఎగ్జామినర్సు అందరూ హాజరు కాకపోవడంతో కొంతమంది టీచర్లను వెంటనే రిలీవుచేసి పంపించమని కొంతమంది హెడ్మా ష్టర్లకు టెలిగ్రామ్‌లు పంపారు జిల్లా విద్యాశా ఖాధికారి. హిందీ, తెలుగు, సైన్సు సబ్జక్టులకు





సంబంధించిన టీచర్లను పంపించమని కూడా ఆ టెలిగ్రామ్‌లోనే తెలిపారు. ఆదినారాయణ, శ్రీనివాసులు, విమలమ్మలను రిలీవు చేశాడు హెడ్మాష్టరు ఆ టెలిగ్రామ్ పురస్కరించుకొని.

మరునాడు తెల్లవారుజామున నాలుగ్గంటలకే లేచి, కాలకృత్యాలు తీర్చుకొని, సూటుకేసులో గుడ్డలు సర్దుకుంటున్నాడు శ్రీనివాసులు. ఆ అలికిడికి లేచి, కళ్లు నులుముకుంటూ వచ్చి "ఎక్కడికో ప్రయాణం కట్టినట్టుందే?" అన్నాడు భుజంగం.

"స్కూల్ పనిమీద ఊరు వెళ్తున్నాను" అన్నాడు శ్రీనివాసులు.

"ఇంటిపనులు వదిలేసి ఉద్యోగం చేసేది గాక, ఊరూరు తిరుక్కుంటూ ఉంటే ఇంటి వద్ద చేసేవాడు ఎవడో?" అన్నాడు భుజంగం.

"ఇదికూడా ఉద్యోగంలో భాగమే, ఆన్సరు స్క్రిప్ట్సు వాల్యూచేయాలి" అన్నాడు శ్రీనివాసులు.

"ఏంచేస్తారో నాకనవసరం, వెళ్లడానికి వీల్లేదు" అన్నాడు భుజంగం.

"వెళ్లవలసిన పనికి వెళ్లకుంటే కుదరదు భుజంగం. నీకు చేతనయిన పనులు చెయ్. వీలుకాకపోతే మరో మనిషిని ఏర్పాటు చేసుకుందాం"

"నువ్వేమో ఇస్త్రీ గుడ్డలేసుకొని జల్సాగా తిరగాలి, నేను కూలిమనిషిలాగా పనిచేయాలి. ఇదేం కుదరదుగాని నా భాగం నాకిచ్చేయ్" అన్నాడు ఆవేశంగా.

"చీటికి మాటికి వేరుకాపురం పెడతానంటే ఎంబావుంటుంది భుజంగం. నువ్వు పనే చేయొద్దు. జీతగాణ్ణి ఏర్పాటు చేసుకుందాం. ఓపికుంటే వానికి సలహాలివ్వు, లేకపోతే ఆ పనికూడా నేనే చేస్తాను. ఎప్పుడో తల్లిదండ్రులు చనిపోతే పెద్దలు సంపాదించిన ఆస్తిలో చిన్న మెత్తుకూడా పోగొట్టకుండా కాపాడుకున్నాం. వ్యవసాయం చేసే బలం లేనప్పుడు దర్జీపని చేసి సంసారం సాగించాను. మన కృషి ఫలితమో, అదృష్టమో, దేవునిదయో చెప్పలేం-ఉద్యోగం వచ్చింది. ఇక ఆర్థికంగా ఇబ్బందిపడవలసిన పనిలేదు. నలుగుర్లో గౌరవంగా బతికే అవకాశం కలిగింది. కలసి ఉంటే బాగుపడతాం. వెన్న పడుతున్న సమయంలో భాండం పగులగొట్టే ప్రయత్నం చేయకు. ఎప్పుడూ ఏదో ఆటంకాలు కలుగచేస్తూ ఇలా తయారవుతున్నావు. చెప్పుడు మాటలు వింటే చెడిపోయేది మనమే. మనం బాగుపడతామన్న అసూయతో ఎవరో నిన్ను రెచ్చగొడుతున్నట్లు అర్థమవుతోంది" అన్నాడు శ్రీనివాసులు దీనంగా.

"చెప్పుడు మాటలు వినడానికి నేనేం పసిపిల్లవాడినా? నీమాటలు నమ్మినేను చెడిపోయాను. చదువుకొని నువ్వు బాగుపడ్డావు"

"నిన్నూ చదువుకొమ్మని చెప్పాను కానీ, నీలాగా ఆటంకాలు కల్గించలేదు. నువ్వు చదువుకోలేనందుకు తప్పునాదా? నిన్ను చదువుకోమని కనీసం నేనయినా ప్రోత్సహించాను. నాకు ఆ మాత్రం ప్రోత్సాహం ఇచ్చేవాళ్లు లేకపోయారు గదా? ప్రోత్సాహం ఇవ్వకపోగా హేళన చేశారు. హైస్కూల్లో, కాలేజీలో చదివినవాళ్లు చదువురాక ఉద్యోగం దొరక్క, ఇతర పనులు చేయలేక బేకారుగా తిరుగుతూ ఉంటే నీ అన్న హిందీ చదివి తాసీల్దారవుతాడు అంటూ ఎగతాళి చేశారు. ఆనాడు ఎగతాళి చేసినవాళ్లే ఈనాడు మెచ్చుకుంటున్నారు"

"అందుకే నువ్వు కరంటు లైటువయిపోయావు. నేను కిరసనాయిలు బుడ్డీ అయిపోయాను"

"రెండు కిరోసిన్ బుడ్డీలకంటే ఒక లైటు కూడా ఉండటం మంచిదే కదా?"

"ఏం మంచిది... అందరూ లైటువేపే చూస్తారుగాని, బుడ్డీవేపు ఎవరు చూస్తారు? నువ్వు లైటులాగా వెలిగిపోతున్నావు కాబట్టి బిడ్డనివ్వడానికి పోటీపడుతున్నారు"

"అభివృద్ధి చెందేవాళ్లను - అందులోనూ ఒక తల్లి గర్భంలో పుట్టిన నేను అభివృద్ధి చెందుతున్నానంటే చూసి ఆనందించాలిగాని అసూయపడ్డం ఎందుకు? 'అసూయ' మనిషిని అథఃపాతాళానికి తొక్కేస్తుంది... అయినా ఇప్పుడు వాదప్రతివాదాలకు సమయం కాదు. బస్సుకు టైమయింది" అంటూ సూటుకేసు తీసుకొని గడపదాటాడు శ్రీనివాసులు.

అప్పటికే చాలామంది ప్రేక్షకులు, శ్రోతలు

చుట్టువక్కల చేరారని అప్పుడుగానీ తెలిసిరా లేదు శ్రీనివాసులుకు.

★ ★ ★

"రామలింగంగారూ" అన్న పిలుపు విని, వడివడిగా పోతున్న రామలింగం ఆగి చుట్టూ చూశాడు- ఎవరబ్బా పిలిచిందీ అని. లింగ రాజు తప్ప మరో మనిషి కనిపించలేదు అతని కళ్లకు. లింగరాజుగారికి తనతో ఏం పనుంది పిలవడానికి? పిలిచినా 'గారూ', 'గీరూ' అని అంత మర్యాదగా పిలుస్తాడా? అనుకున్నాడు తనలోతాను. ఎవరూ పిలవలేదులే అనుకొని ముందుకు అడుగు వేశాడో లేదో అంతలోనే, "రామలింగంగారూ!" అన్న పిలుపు మళ్ళీ వినిపించింది. తిరిగి చూశాడు అనుమానంగా.

"మిమ్మల్నేనండీ! రండి" అన్నాడు ఆప్యా యంగా లింగరాజు.

పూర్వకాలంలో అదేదో యుగం ఉండేదట. ఆ యుగంలో ధర్మం నాలుగు పాదాలతో నడిచే దట. ఆ యుగం మళ్ళీ వచ్చిందా? అనుకు న్నాడు రామలింగం.

"రండి... అనుమానిస్తున్నారే!" అంటూ కుర్చీలోనుంచి లేచి నిల్చొని సాదరంగా ఆహ్వా నించాడు.

తటపటాయిస్తూ వరండాలోకి వెళ్లి, "నమ స్కారం సార్!" అన్నాడు రెండు చేతులు జోడించి.

చేతులు జోడించి, కళ్ళు మూసుకొని, "దేవు నికి!" అంటూ పైకి చూపెట్టాడు లింగరాజు.

లింగరాజుగారికి అంత వినయ విధేయత లు ఎలా వచ్చాయో రామలింగానికి పాలుపోలే దు. లింగరాజేనా లేక పగటి కల కంటున్నానా అన్న అనుమానం కూడా కలిగింది రామలింగా నికి. అంతలోనే తేరుకొని ఎదురుగా లింగరాజు నిల్చొని మాట్లాడుతూ ఉంటే కల అనుకోవడం అవివేకం! అనుకున్నాడు.

రెండు కళ్ళ మధ్య ముక్కుమీద కుంకుమ రేఖ తీర్చిదిద్దుకున్నాడు లింగరాజు. మెడలో రుద్రాక్షమాల కూడా వేసుకున్నాడేమోనన్న అనుమానంతో పరిశీలనగా చూశాడు రామ లింగం.





"నా వేపు అదేపనిగా చూస్తున్నారేమండీ? నేనేం కొత్తవాణ్నా? రండి కూచోండి!" అంటూ కుర్చీకేసి చూపెట్టాడు.

తనొక్కడు కుర్చీలో కూచుంటే మిగతావాళ్లు కింద కూచోవలసిందే. అంత మించరానివాళ్ళొ వరయినా వస్తే తను లేచి పచార్లు చేస్తూ మాట్లాడతాడుగాని, ఎవరినీ కుర్చీలో కూచోమ నడు లింగరాజు. అలాంటివాడు తనను కుర్చీలో కూచోమంటాడా? తన మనసు భ్ర మించినట్లుంది అనుకుంటూ అలాగే నిల్చు న్నాడు రామలింగం.

"రా నాయనా రామలింగం, కూచో!" అంటూ కుర్చీ చూపించాడు లింగరాజు.

కూచోవడానికి తటాపటాయించాడు రామ లింగం.

"కూచో నాయనా... తటాపటాయిస్తా వెందుకు?" అన్నాడు లింగరాజు.

కూచున్నాడు రామలింగం.

"మీ ఇంటికి రావాలని ఎన్నాళ్ళనుంచో ప్రయత్నిస్తున్నాను. అయినా తీరిక దొరకలేదు. ఏమిటో బాబూ బతికినంత కాలమూ తాప త్రయం. ఒకటే తాపత్రయం. వెళ్ళిపోయేట ప్పుడు వెంట ఏమీ రాదని, నీటి బుడగలాంటి ప్రాణం ఎప్పుడో గాలిలో కలిసిపోతుందని మనందరికీ తెలుసు. అశాశ్వతమయిన ఈ జీవితమ్మీద ఇంత ఆశ ఎందుకు?"

అబ్బ ఎంత మారిపోయాడు! మునుపటి లింగరాజుకు ఈనాటి లింగరాజుకు పోలికేలే దు. ఆకాశానికి, పాతాళానికి ఉన్నంత వ్య త్యాసం ఉంది. అనుకున్నాడు రామలింగం తనలో.

"ఎందుకు సార్... మీరు మా ఇంటికి రావాలా? కాకితో కబురు పంపితే రానూ?"

"సార్ అంటావేం బాబూ, సంబంధంలేని కొత్త మనిషిని అన్నట్లు? మీ నాన్నగారిని 'అన్న య్యా' అనేవాడిని. ఆ లెక్కన నేను నీకు చిన్నాన్నను కదూ?" అన్నాడు ఆప్యాయంగా.

కాఫీ తెచ్చి చెరో కప్పు ఇచ్చింది భాగ్యమ్మ. గ్లాసు తీసుకొని కాఫీకేసి అనుమానంగా చూడ సాగాడు రామలింగం.

"ఏంబాబూ, కాఫీ తాగవా?"

"వదిలేశాను సా...చిన్నా...న్నా...!"

''ఏం... ఎందుకని?''

''అందులో ఏదో 'కెఫిన్' అనే విషపదార్థం ఉందట!''

''ఎవరు చెప్పారు?''

''మా బావ చెప్పాడు''

''ఎవరు... మీ అక్కయ్య మొగుడా?''

''నాకు అక్కయ్య లేదుగా?''

''అవునవును... ఎప్పుడో నువ్వు చిన్నగా ఉన్నప్పుడు మీ ఇంటికి వచ్చేవాడిని... భాగ్యా...! అలా నిల్చున్నావేం? నీ కొడుకు కాఫీ తాగడట...''

నా కొడుకా! అనబోయి, అంతలోనే నాలుక్క రుచుకొని, ''పాలు తెస్తాను'' అంటూ లోపలికె ళ్ళింది భాగ్యమ్మ.

''మరి, బావ అంటే?''

''శ్రీనివాసులుగారు''

''ఎవరు? మా బావగారి కొడుకా?''

''మీ బావగారి కొడుకా?'' అంటూ నోరు వెళ్లబెట్టాడు రామలింగం.

''కొత్తగా ఉద్యోగం వచ్చిన హిందీ టీచరే కదా?''

''అవును... ఆయన మీకు బంధువా?''

''కాదా మరి...? మూడుతరాలకు మునుపు వాళ్ల ఆడబిడ్డను మా ఇంటికి చేసుకున్నారట. నేను కూడా గంగయ్యను 'బావా' అనిపిలిచేవా డిని. ఆయన పోయిన తరువాత కాస్తగూరమ యిపోయాం...

అందుకే పాత బంధుత్వం పోగొట్టుకోకూడ దని...'' అంటూ నసిగాడు లింగరాజు.

పాలు తెచ్చి, రామలింగానికి ఇచ్చి, ''తాగు నాయనా... హార్లిక్సు కలిపాను'' అంది భాగ్య మ్మ.

''చూడు నాయనా... బలరామయ్య తెలుసు గదా?'' అన్నాడు లింగరాజు.

''తెలుసుబాబాయ్!'' అన్నాడు రామ లింగం పాలు తాగుతూ.

''ఇటీవల ఆయన మీ బావగారి ఇంటికేమ యినా వచ్చాడా?''

''ఇటీవల రాలేదుగానీ, మా బావ ఉద్యో గంలో చేరిన మరునాడో మూడోనాడో వచ్చినట్లు జ్ఞాపకం''

''అవును... అప్పుడు వచ్చాడట. మా అమ్మాయి సౌజన్య కూడా చెప్పింది. అప్పుడు మీరూ అక్కడే ఉన్నారట- కదూ''

''అవును... ఉన్నాను''

''మీ బావగారితో ఏమయినా మాట్లాడాడా''

''మాట్లాడాడు''

''ఏం మాట్లాడాడో తెలుసుకోవచ్చా?''

''మీ వద్ద దాచుకొనే రహస్యం ఏముంది బాబాయ్! పెళ్ళి విషయం మాట్లాడాడు''

''మరి మీ బావ ఏమన్నాడు?''

''అమ్మాయిని చూసి చెబుతానన్నాడు''

తన కూతురు సౌజన్య రోజూ శ్రీనివాసులు వద్దకు ట్యూషను చెప్పించుకోవడానికి వెళ్తోంది. అలాంటప్పుడు అమ్మాయిని చూసి చెబుతానని ఎందుకంటాడు? ఇందులో ఏదో తిరకాసు ఉంది- అనుకున్నాడు లింగరాజు.

''అమ్మాయి ఎవరు బాబూ?'' అన్నాడు.

''బలరామయ్య బావమరిది రామకృష్ణయ్య తెలుసుగా?'' అన్నాడు.

''తెలుసు''

''ఆయనకు కూతురు ఉందట''

''ఓహో... అలాగా? అమ్మాయిని చూడా లని అన్నాడా?''

''అవును''

''మంచిమాటే చెప్పాడు... అయినా బుద్ధి ఉండాలా వద్దా?''

''ఎవరికి- మా బావకా?'' అన్నాడు రామ లింగం నోరు వెళ్లబెట్టి.

''మీ బావను అంటానా నాయనా? ఆయ నకు బుద్ధిలేకేం? బుద్ధి ఉండబట్టే చిన్నప్పుడు తల్లిదండ్రులు చనిపోతే ఇంటి వద్ద ప్రయివే టుగా చదువుకొని ప్రయోజకుడయ్యాడు''

''మరి ఇంకెవరికి లేదంటారు?''

''ఇంకెవరికి? బలరామయ్యగారికి! మన మ్మాయి సౌజన్య విషయం అడిగి చూడవ య్యా అని మధ్యవర్తిగా పంపిస్తే, తన మేనకో డలు విషయం మాట్లాడి, మనమ్మాయి విషయం గాలికి వదిలేస్తాడా?'' అన్నాడు



లింగరాజు ఆవేదనగా.

"తనకు మాలిన ధర్మం ఉంటుందా చిన్నా న్నా?"

"ఉండదనుకో... అయినా విషయమయినా చెప్పాలి గదా? అసలు విషయం చెప్పకుండా శ్రీనివాసులుగారి మీద ఏవేవో ఆరోపణలు చేశాడు. అలాచేయవచ్చా? ఆయన తన స్వార్థం తను చూసుకున్నాడని, నేను అప్పగించిన పని చేయలేదని బాధపడటంలేదు. మచ్చలేని మనిషి, దేవుడులాంటి శ్రీనివాసులు మీద లేనిపోని ఆరోపణలు చేసినందుకు చింతిస్తున్నాను. మీ చిన్నమ్మ ఆ రోజే చెప్పింది - మా బావకుమారుడు రామలింగానికి చెబితే అన్నీ మాట్లాడతాడని. చెప్పకపోవడం నాదే బుద్ధి తక్కువ"

"మీరు బాధపడకండి బాబాయ్... మా బావకు మనమ్మాయి కొత్తేమీ కాదు. రోజూ ట్యూషనుకు వస్తూనే ఉందికదా? 'మంచి తెలివయిన అమ్మాయి' అని మెచ్చుకుంటూ ఉంటాడు"

"నీకు తెలియందేముంది బాబూ!



అమ్మాయి తప్ప ఇంకెవరున్నారు మాకు? బుద్ధిమంతునికిచ్చి పెళ్ళిచేసేస్తే చీకూ చింతా లేకుండా రామా కృష్ణా అనుకుంటూ శేషజీవితం హాయిగా గడిపేయాలని అనుకుంటున్నాం. ఆ ఉద్దేశంతోనే భజన సమాజం స్థాపించాం''

''ఆయన చేసుకుంటే మీకు అమ్మాయిని గురించి ఏ చింతా ఉండదు''

''అందుకే బాబూ... మీ బావకు నచ్చజెప్పు. మా కుటుంబ విషయం నీకు తెలియంది కాదు''

''మీకు ప్రాణస్నేహితుడట కదనాయనా, మీరు చెబితే తప్పక ఒప్పుకుంటారు'' అంది భాగ్యమ్మ వంటగదిలోనుండి వస్తూ.

''టిఫిన్ అయిందా?'' ప్రశ్నించాడు లింగరాజు.

''అయింది, లేవండి మరి!''

''లేబాబూ. టిఫిన్ చేద్దాం'' అన్నాడు లింగరాజు.

మారు మాట్లాడకుండా లేచాడు రామలింగం. ఇద్దరూ వంటగదిలోకి వెళ్లారు.

★ ★ ★

హైస్కూలు మొత్తం విద్యార్థుల్లో సగంమంది ప్రకాశం ట్యూషను విద్యార్థులే అంటే అతిశయోక్తి కాదంటారు ఈ ఊరి రచ్చబండ వార్తాహరులు. విద్యార్థుల్ని ట్యూషనుకు రాబట్టే విషయంలో ఎంతోమంది టీచర్లు ఆయనతో పోటీలో నిలవలేకపోయారట. పిల్లల్ని ఆకర్షించే విషయంలో ఆయనకు ఆయనే సాటి అంటారు. క్లాసుల్లో కాస్త కంటికి ఇంపుగా కనిపించే అమ్మాయిలకు ఉచితంగా ట్యూషను చెబుతానని వాళ్లను రాబట్టుకుండాడట.

''పబ్లిక్ పరీక్షల్లో పాసు కావడానికి హిందీలో ఎన్ని మార్కులు రావాలి సార్?'' అడిగాడు ఓ విద్యార్థి ప్రకాశంని.

''ఆ... ఎన్నిమార్కులు... హిందీ చదవవలసిన అవసరమేలేదు. ప్రశ్నపత్రం కాపీచేస్తే పాసుమార్కులొస్తాయి'' అన్నాడు ప్రకాశం.

''లాస్టియరు మా బ్రదర్ హిందీలో తప్పాడు సార్'' అంది ఓ అమ్మాయి.

''ఎన్ని మార్కులొచ్చాయి?''

''పందొమ్మిది మార్కులొచ్చాయి సార్''

''ఆ ఎగ్జామినరు శీనూలాంటి తలతిక్క వెధవలా ఉన్నాడే. ఒక్క మార్కు తక్కువ వస్తే ఎవరూ ఫేల్ చేయరు''

''శ్రీనివాసులు సార్- పరీక్షల్లో చాలా స్ట్రిక్టుగా ఉంటారు సార్. పక్కకు కూడా చూడనివ్వరు''

''హైస్కూలు మెట్టు కూడా తొక్కని అంట్ల వెధవను హైస్కూలు టీచరుగా అప్పాయింటు చేస్తే ఏంజరుగుతుంది? హిందీ తప్ప ఇంకేమొస్తుంది అతనికి? అసలు హిందీ కూడా సరిగా వస్తుందో లేదో మనకు తెలీదు'' అన్నాడు ప్రకాశం.

''ఏందయ్యా, మహానుభావా? పొద్దున్నే ఎవర్నో తూర్పారబడుతున్నావు?'' అంటూ వచ్చాడు సోషియల్ అసిస్టెంటు బయప్ప.

''కాకారాయుని గురించి మాట్లాడకపోతే ఇంకెవరి గురించి మాట్లాడాలంటారు?'' ఎదురుప్రశ్న వేశాడు ప్రకాశం.

''ఎవరయ్యా ఆయన?''

''ఇంకెవరు... మన శ్రీనివాసులే!''

''శ్రీనివాసులు కాకారాయుడా?''

''తెలీనట్లు మాట్లాడతారే, కాకారాయుడు కాకపోతే ఉద్యోగంలో చేరి సంవత్సరం కూడా పూర్తికాకనే అసిస్టెంటు ఎగ్జామినరు కాగలడా?''

''అందులో కాకా ఏముందండీ? ఫలానా సబ్జక్టు టీచర్లను పంపమని డి.ఇ.ఓ.గారి నుండి టెలిగ్రామ్ వచ్చింది. దాని ప్రకారం హెడ్మాష్టరుగారు రిలీవ్‌చేసి పంపారు''

''అసలు కిటుకు మీకు తెలీదులెండి... హెడ్మాష్టరు అదో పులి అంటే ఇదో తోక అంటాడు శ్రీనివాసులు''

''తోక అంటే మనకేం నష్టం, తొండమంటే మనకేం నష్టం?''

''నష్టపోయేది మనమే సార్!''

''మనమా?''

''అవును''

''ఎలా?''

''పరీక్షల్లో మన ట్యూషను స్టూడెంట్సు





ఉండే రూములకు శ్రీనివాసుల్ని ఇన్విజిలేట రుగా వేస్తారు హెడ్మాష్టరుగారు''

''వెయ్యనీ, సున్నా వచ్చినా ఫెయిల్ కారుగా?''

''ఫెయిల్‌కారుగానీ, మెరిట్ స్కాలరుషిప్పు మనవాళ్లకు రాదు''

''రాకపోతే పోయింది... వంద రూపాయలు రాకపోతే నష్టపోతారా?''

''డబ్బు ప్రశ్న కాదండీ, ప్రిస్టేజ్ ప్రశ్న. ట్యూషను స్టూడెంట్సుకు మెరిట్ స్కాలరు షిప్పు రాకపోతే మన ఇమేజ్ దెబ్బతినదా?''

''మనం చదువు సరిగా చెప్పి, పిల్లలు శ్రద్ధగా చదివితే మెరిట్ మార్కులు మనవాళ్లకే ఎందుకు రావు?''

''బిసికాలంనాటి మనిషిలామాట్లాడతారే! చదువు సరిగా చెప్పి శ్రద్ధగా చదవమని వొత్తిడి చేస్తే మన వద్దకు ఎవరొస్తారు సార్! మన వద్దకు వచ్చేవాళ్లంతా చదివేవాళ్ళు కాదు. చదువు'కొనే'వాళ్ళు'' అన్నాడు ప్రకాశం 'కొనే' పదం వొత్తి పలుకుతూ.

''అయితే కాపీలు కొట్టించే ఏర్పాట్లు చేయ డానికా ట్యూషను ఫీజు వసూలుచేసేది?''

''కాలప్రవాహంలో అందరితోబాటు మన మూ కొట్టుకొనిపోవాలసిందే. ఎదురు ఈదడాని కి ప్రయత్నిస్తే అలసిపోయి మునిగిపోతాం''

''ప్రవాహంలో కొట్టుకొనిపోయినా ఎక్కడో సు డిగుండాల్లో చిక్కుకోక తప్పదు''

''అయినా వీళ్లకేం పోయేకాలమయ్యా?'' అన్నాడు ప్రకాశం మాటమారుస్తూ.

''ఎవరికి?''

''శ్రీనివాసులుగాడికి పిల్లనివ్వడానికి పోటీప డుతున్నవాళ్లకు''

''మీకు చదువు అబ్బిందిగానీ, సంస్కారం అబ్బలేదు సార్!''

''నాకు సంస్కారం లేదంటారా?''

''సంస్కారం ఉంటే సాటి టీచర్ని 'గాడు' 'గీడు' అంటారా?''

''వాడేం టీచరండీ?''

''అతడు టీచరా కాదా అనే విషయం అటుంచి పరుల్ని నిందించే మీ అలవాటు మంచిదికాదు. వ్యక్తి పరోక్షంలో విమర్శించే మీరు నేను లేనప్పుడు నన్నూ విమర్శిస్తారు''

''మిమ్మల్ని ఎందుకు విమర్శిస్తాను సార్?''

''విమర్శించడం ఓ జాడ్యం. ఆ జబ్బు ఉన్నవాళ్ళు నిరంతరమూ ఎవరినో ఒకరిని విమర్శిస్తూ ఉంటారు- విమర్శించకపోతే వాళ్లకు తోచదు''

''విమర్శించడం తప్పే అనుకుందాం. అయినా వీళ్ళు పోటీపడ్డం బావుందంటారా?''

''ఎవరెవరు పోటీపడుతున్నారు?''

''ప్రస్తుతం రంగంలో ఉన్నవాళ్లలో లింగ రాజు, సుబ్బయ్య, రామకృష్ణయ్య ప్రముఖులు. తెరవెనుక ఇంకా ఎంతమంది ఉన్నారో తెలీదు''

''వీళ్లంతా ఓడిపోతారు సార్!'' అన్నాడు ఓ విద్యార్థి.

''కొత్తవాళ్ళు ఎవరయినా రంగంలోకి ప్రవేశించారా?'' అడిగాడు ప్రకాశం.

''ప్రవేశించినట్లు చెప్పుకుంటున్నారు సార్''

బయప్పకేసి చూస్తూ భావగర్భితంగా నవ్వాడు ప్రకాశం.

''ఇలాంటి విషయాలు పిల్లల సమక్షంలో చర్చించకూడదు సార్'' అన్నాడు బయప్ప.

''మా పిల్లలంతా ఇలాంటి విషయాల్లో ఆరితేరినవాళ్ళే సార్. వాళ్లకు తెలీని రహస్యం ఏదీ లేదు'' అన్నాడు ప్రకాశం గర్వంగా.



మధ్యాహ్నం పన్నెండు దాటింది. స్పాట్ వాల్యుయేషను సెంటర్లోని కాంటీనుకు రాసాగా

రు ఉపాధ్యాయులు. కాఫీలు, టీలు తాగుతూ ఆన్సరు పుస్తకాల్లోని విషయాలు చర్చించు కుంటున్నారు.

"ఆన్సరు పుస్తకంలోని అన్ని పేజీల్లోనూ ఒకే పదం రాశాడు ఓ స్టూడెంటు'' అన్నాడు ఓ హిందీ ఎగ్జామినరు.

"రాశాడని అంటున్నారు- అబ్బాయో, అమ్మాయో ఎలా తెలిసింది?'' అడిగాడు మరో ఎగ్జామినరు.

"అమ్మాయిలు అంత అవివేకంగా రాయ రు''

"ఏం రాశాడు సార్?''

"విఠల్.... విఠల్.... అని రాశాడు''

"పొరపాటు చేశాడు'' అన్నాడు తెలుగు చీఫ్ ఎగ్జామినరు.

"ప్రశ్నలకు జవాబు రాయకుండా పుస్తక మంతా ఒకే పదం రాయడం పొరపాటుగదా మరి'' అన్నాడు ఓ ఉపాధ్యాయుడు.

"అది కాదయ్యా మహానుభావా...విఠల్‌కి బదులు ఏ 'శ్రీదేవి' పేరో రాయవలసింది. అన్నాడు తెలుగు చీఫ్ ఎగ్జామినరు.

"వన్స్‌మోర్'' అన్నారు ఎవరో.

"సోషియల్ ప్రశ్నలకు సైన్సు జవాబులు రాశాడు ఓ స్టూడెంటు'' అన్నాడు సోషియల్ ఎగ్జామినరు.

"పాపం... ఎవరో హెల్పరు చేసిన పొరపా టు...సైన్సు గైడులోని పేపర్లు చించి పంపి ఉంటాడు'' అన్నాడు మరో అసిస్టెంటు ఎగ్జా మినరు.

"సైన్సు కూడా ఓ సబ్జక్టే కదా? అందువల్ల వారు పెద్ద తప్పుచేయలేదు. ఓ స్టూడెంటు తన ఆన్సరు బుక్కులోని పేజీలన్నీ వెంకటే శ్వర సుప్రభాతంతో నింపేశాడు'' అన్నాడు మరో అసిస్టెంటు ఎగ్జామినరు.

"సుప్రభాతం కంఠస్తం చేసినందుకు ఆ స్టూడెంటును అభినందించాలి'' సమర్ధించా డు మరో అసిస్టెంటు ఎగ్జామినరు.

"కంఠస్తమూ కాదు-వల్లకాడూ కాదు. కాపీ చేసి ఉంటాడు'' అన్నాడు ఓ చీఫ్ ఎగ్జామిన రు.

"అంతే... అంతే...'' అన్నాయి కొన్ని గొంతు లు ఒకేసారి.

"ఆ స్టూడెంటుకు ఎన్నిమార్కులు వేశా రు?'' ధర్మ సందేహం వెలిబుచ్చాడు ఓ పరోప కార పరాయణుడు.

"మార్కులు రానిదే ఎలా వేయమంటా రు?''

"బిట్ పేపరు కూడా ఆన్సరు చేయలేదా?''

"ఉహు... చేయలేదు''

"అయితే సున్నా చుట్టారన్న మాట?''

"అంతకంటే మనం ఏం చేయగలం?''

"మా చీఫ్ ఎగ్జామినరులాంటి ఉదారపురు షుడు లోకంలో ఎవరూ ఉండరు?'' అన్నాడు అసిస్టెంటు హిందీ ఎగ్జామినర్ శ్రీనివాసులు.

"అంత ఉదార పురుషుడా?'' అడిగాడు ఓ అసిస్టెంటు ఎగ్జామినరు.

"కాకపోతే అందరికీ పాసుమార్కులు వేయ మంటాడా?''

"సరిఅయిన జవాబులేకపోతే మార్కులు ఎలా వేయగలమండీ?''

"అదే ప్రశ్న అడిగాం మేం'' అన్నాడు శ్రీనివాసులు.

"ఏమన్నాడు మీ చీఫ్ ఎగ్జామినరు?''

"హిందీ ఎవరికి తెలుస్తుందండీ? ప్రతి ఆన్సరుకు రెండు టిక్కులు కొట్టండి, రెండు మార్కులు వేయండి అన్నాడు''

"అలాంటి వాళ్ళతో ఆవరేజు స్టూడెంట్సు లాభపడతారు గానీ, మెరిట్ స్టూడెంట్సు మన్నుగొట్టుకొని పోతారు''

"మా చీఫ్ ఎగ్జామినరు ఉదార స్వభావుడే కాక గుండె ధైర్యంకలవాడు. తిమ్మిని బొమ్మిగా బొమ్మిని తిమ్మిగా చేయగల సమర్థుడు'' అన్నా డు శ్రీనివాసులు వ్యంగ్యంగా.

"అంత సమర్థుడా?''

"అవును... నిన్న ఒక ఆన్సరు స్క్రిప్టు మిస్సయింది. స్క్రిప్టు పోగొట్టుకున్న అసిస్టెంటు ఎగ్జామినరు ఏం చేయడానికి దిక్కుతోచక దిగాలుపడి కూచుంటే మార్కుల లిస్టులో పాసుమార్కులు వేయమన్నాడు చీఫ్ ఎగ్జామినరు'' అన్నాడు శ్రీనివాసులు.




"వేశారా?", అడిగాడు మరో అసిస్టెంటు ఎగ్జామినరు.

"వేశారుకానీ, తరువాత స్క్రిప్టు దొరికింది"

"వాల్యూ చేశారా?"

"చేశారు"

"ఎన్ని మార్కులొచ్చాయి?"

"యాభై రెండు మార్కులొచ్చాయి"

"చూడండి... స్క్రిప్టు దొరక్కపోతే విద్యార్థికి ఎంత నష్టం జరిగేదో"

"శ్రీనివాసులుగారూ... మీ చీఫ్ ఎగ్జామినరు ఎప్పుడూ మా రూంలోనే ఉంటాడు. టెన్ పర్సెంటు పేపర్లు ఎప్పుడు చెక్ చేస్తాడు?" అన్నాడు సైన్సు అసిస్టెంటు ఆదినారాయణ.

"ఆ పని స్పెషల్ అసిస్టెంటుకు అప్పజెప్పాడు సార్" అన్నాడు శ్రీనివాసులు.

"మీ స్పెషల్ అసిస్టెంటుకు హిందీ తెలుసా?"

"సబ్జక్టు తెలియవలసిన అవసరం లేదట. గ్రీన్ ఇంక్ పెన్నుతో అక్కడక్కడా టిక్కులు కొట్టమన్నాడు. తరువాత అవసరమయినచోట అంకెలు [illegible] వేసుకుంటాడు" అన్నాడు శ్రీనివాసులు.

"సైన్సులో విచిత్రమయిన ఆన్సర్లు ఎవరూ రాయలేదాసార్?" అడిగాడు అసిస్టెంటు సోషియల్ ఎగ్జామినరు.

"రాశారు" అన్నాడు ఆదినారాయణ.

"ఏం రాశారు సార్?" అడిగాడు శ్రీనివాసులు కుతూహలంగా.

"చేప-తో శ్వాసించును. అంటే 'తోక' అని రాశాడు ఓ విద్యార్థి ఖాళీలో. చిన్న ప్రేవుల్లో రక్తం ప్రవహిస్తుందని మరో విద్యార్థి రాశాడు"

"బొంబాయిని బంగాళాఖాతంలో గుర్తించిన మా విద్యార్థులకంటే మీ విద్యార్థులే నయంలెండి" అన్నాడు సోషియల్ అసిస్టెంటు.

"మీవాళ్ళకంటే మావాళ్ళు తీసికట్టు కాదు లెండి" అంది అప్పుడే అక్కడికి వచ్చిన విమలమ్మ.

"తెలుగులో కూడా వింత జవాబులు రాశారా మేడమ్?" అన్నాడు శ్రీనివాసులు.

"వింత జవాబులు కాదుకానీ, అసిస్టెంటు ఎగ్జామినర్లకు, చీఫ్ ఎగ్జామినర్లకు ఆలోచించే పనిపెట్టారు"

"అంత చిక్కు సమస్య తెచ్చిపెట్టారా?"

"శసతతడపతసబవ అంటే చిక్కు సమస్యోకాదో మీరే చెప్పండి"

"అది తెలుగేనా?" అన్నారు విన్నవాళ్ళు.

"మళ్ళీ చెప్పండి మేడమ్" అడిగారు విననివాళ్ళు.

మళ్ళీ చెప్పింది విమలమ్మ.

అర్థంగాక అందరూ నోళ్ళు వెళ్ళబెట్టారు.

"చెప్పండి మేడమ్... చెప్పండి మేడమ్" అన్నారు.

"శ్రీనాథుడు పోతన బావ" అంది విమలమ్మ.

"మీరు ఎలా తెలుసుకున్నారు?" అడిగాడు ఆదినారాయణ.

"ప్రశ్నపత్రం చూసి అర్థం చేసుకున్నాం సార్" అంది విమలమ్మ.

"ఆ స్టూడెంటు ఏ స్కూలువాడో తెల్సుకోవాలి" అన్నాడు ఓ సోషియల్ అసిస్టెంటు.

"ఎందుకు?" అన్నాడు ఆదినారాయణ.

"ఎందుకంటారేం సార్... అతణ్ని భారత ప్రధానిగా చేస్తే దేశం బాగుపడుతుంది"

"తెలుగువాక్యమే తప్పుల్లేకుండా రాయలేని వ్యక్తి ప్రధాని అయితే దేశం ఎలా బాగుపడుతుంది సార్?" ధర్మసందేహం వెలిబుచ్చాడు ఓ చీఫ్ ఇంగ్లీషు ఎగ్జామినరు.

"పెద్దవారు మీరూ అలాగే మాట్లాడతారేం సార్? జవాబు రాసింది అబ్బాయో, అమ్మాయో తెలీదుకాని ఆ స్టూడెంట్లో ఉన్న సుగుణం ఎవరూ గమనించలేదు" అన్నాడు సోషియల్ అసిస్టెంటు.

"మాకు పాలుపోలేదు" అన్నాడు ఇంగ్లీషు ఎగ్జామినరు.

"స్టూడెంట్ మనసులో పక్షపాతం లేదు కదసార్!"

"మీకెలా తెలుసనండీ?"

"కామన్‌సెన్సు ఉన్నవాళ్ళకెవరికయినా



తెలుస్తుంది సార్... ఏ అక్షరాన్నయినా మార్పు చేసి రాశాడా? వర్ణమాలలో ఉన్న అక్షరాల్ని యధాతధంగా రాశాడు. పక్షపాతం ఉంటే ఏదో మార్పుచేసి రాయాలిగా?''

అతని మాటల్లోని వ్యంగ్యం అర్థంచేసుకున్నవాళ్ళు పకపక నవ్వారు. పడిపడి నవ్వారు. పొట్టచెక్కలయ్యేలా నవ్వారు. కళ్ళలో నీళ్ళు వచ్చేలా నవ్వారు.

''ఇంగ్లీషులో ఇలాంటి వింతలూ విడ్డూరాలు ఎవరూ రాయలేదు కద సార్?'' ప్రశ్నించాడు ఆదినారాయణ.

''ఇతర సబ్జక్టుల్లో రాసిన జవాబులు వింటూంటే నవ్వు వస్తోంది. అయితే ఇంగ్లీషులో ఓ స్టూడెంట్ రాసిన జవాబు చదివితే ఉపాధ్యాయులుగా ఎందుకు చేరామా అన్న బాధకలుగుతుంది'' అన్నాడు ఇంగ్లీష్ చీఫ్ ఎగ్జామినర్.

''ఏంరాశాడు సార్?'' అన్నాడు శ్రీనివాసులు.

''ఏం చెప్పమంటారండీ! తమ టీచర్లను, హెడ్మాష్టరును తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు''

''సందర్భం లేకుండా ఎందుకు తిట్టాడు సార్?'' అంది విమలమ్మ.

''మీ పాఠశాలను గురించి మిత్రునికి ఉత్తరం రాయండి- అన్న ప్రశ్నకు రాసిన జవాబులో అందర్నీ తిట్టాడు''

''ఆ స్టూడెంట్ ఫెయిలయ్యాడా, పాసయ్యాడా సార్?''

''మొత్తం మీద పాసవుతాడో, ఫెయిల్ అవుతాడో తెలీదుగానీ, ఈ పేపర్లో మాత్రం పాసు మార్కులొచ్చాయి మేడమ్''

''ఫెయిల్ చెయ్యాల్సింది వెధవను'' అన్నాడు ఆదినారాయణ.

''తప్పులకు మార్కులు డిడక్టు చేయమని ఇనస్ట్రక్షన్సులో ఉందికాని, తిట్లకు మార్కులు తగ్గించమని లేదే''

''ఫెయిల్ చేయాలనుకుంటే ఇనస్ట్రక్షన్సు అడ్డుపడతాయా సార్?''

''అయినా తెలిసి తెలిసి అన్యాయం చేయంలేం గదా?''

''ఉత్తరం రాయమంటే ఉపాధ్యాయుల్ని తిట్టడం న్యాయమా?''

''తెలిసీ తెలియని వయసులో మూర్ఖత్వంతో తిడితే అన్నీ తెలిసిన అనుభవజ్ఞులు అన్యాయంగా ప్రవర్తించడం ఔచిత్యమా?'' అన్నాడు శ్రీనివాసులు.

''పరాయిభాషలో కూడా తిట్లు నేర్చుకున్న స్టూండెంటుకు స్పెషల్ అవార్డు ఇవ్వాలిసార్'' అంది విమలమ్మ.

గణ... గణ... గంట మోగింది.

చీఫ్ ఎగ్జామినర్లు అసిస్టెంటు ఎగ్జామినర్లు వారి వారి రూము వెళ్ళసాగారు.

★ ★ ★

ఇసుక వేస్తే రాలనంత జనసమ్మర్దంతో కిటకిటలాడుతోంది బస్టాండు.

''తియ్యగా...! చల్లగా...! గరమ్... గరమ్! రూపాయికి డజన్... రూపాయికి డజన్... అర్ధ రూపాయికి మూర... అర్ధ రూపాయికి మూర...'' రకరకాల అరుపులతో చెవులు చిల్లులుపడుతున్నాయి.

కింద కూచొని జామకాయ తింటున్న పల్లెటూరి అమ్మాయి జడలో వేలాడుతున్న మల్లె పూలు లాక్కొని తినసాగింది మేక.

వెయింగు మిషను మీద నిల్చుని అర్ధ రూపాయి వేసి టికెట్ కోసం ఎదురుచూసి, అది రాకపోయేసరికి పిడికిలితో నాలుగు గుద్దులు గుద్దాడు ఓ యువకుడు.

''మిషన్ చెడిపోయింది'' అన్నాడు బిస్కెట్లు అమ్ముకొనే కుర్రాడు.

''కుంటివాని నడిపించే బృందావనం... గ్రుడ్డివాడు చూడగలుగు బృందావనం... మూఢునికి జ్ఞానమొసగు బృందావనం...'' పాట పాడుతూ ఇద్దరు గుడ్డివాళ్ళు అడుక్కుంటున్నారు.

కాలేజి నుండి, హైస్కూళ్ళ నుండి ఊళ్ళకు వెళ్ళే విద్యార్థినీవిద్యార్థులు పుస్తకాలు పట్టుకొని బస్సుల కోసం ఎదురుచూస్తూ నిల్చున్నారు.

ఏదో మాట్లాడుతూ నిల్చున్న శకుంతల, సౌజన్యలకేసి తదేకంగా చూస్తున్నారు ఇద్దరు యువకులు.

''వీళ్ళు మన కాలేజి స్టూడెంట్సేకదా?''




అంది సౌజన్య.

"అవును" అంది శకుంతల.

"వీళ్ళు ఈ ఊరి వాళ్ళేననుకుంటా! కాలేజి నుండి నేరుగా ఇంటికి వెళ్ళకుండా రోజూ బస్టాండుకు వస్తారు- వీళ్ళకేం పనిలేదేమో" అంది సౌజన్య.

"రోజూ బస్టాండుకు వస్తున్నారంటే ఏదో పనిలేకపోతే ఎందుకు వస్తారు?"

"ఏం పని ఉంటుందంటావు?"

"ఏదో పని లేనిదే ఎందుకు వస్తారు?"

"మూటలు మోసి కూలి తీసుకుంటారేమో!"

"మూటలు మోసేవాళ్ళు కాదే"

"ఇపుడు మోయకపోయినా ఫ్యూచర్లో మోయవలసివస్తుందేమోనని ట్రైనింగు పొందడానికి వస్తూ ఉంటారు" అంది సౌజన్య.

సుయ్‌య్‌య్‌య్...! సోడా సీసా ఓపెన్ చేసి, "తీసుకో" అన్నాడు కుర్రాడు ఓ వృద్ధునికి ఇస్తూ.

"నాకెందుకు?" అన్నాడు ముసలాయన.

"అడిగావుగా?"

"నేను అడిగినానా?"

"ఇంకెవరు, మీతాత అడిగినాడా? రూపాయ ఇవ్వరా లష్మీకే...!" అన్నాడు సోడాలు అమ్మే కుర్రాడు.

"ఏరా... అంత దౌర్జన్యం చేస్తున్నావ్?" అన్నాడు ఆ తతంగమంతా చూస్తూ నిల్చున్న రామలింగం.

"నిన్నెవడు పిలిచినాడయ్యా పంచాయితీకి?" అన్నాడు కుర్రాడు నిర్లక్ష్యంగా.

"అతని దగ్గర డబ్బు వసూలుచెయ్‌మరి చూద్దాం" అంటూ కళ్ళెర్రచేసి ముందుకు వెళ్లాడు రామలింగం.

"అయితే రూపాయి నువ్వు ఇవ్వు" అన్నాడు కుర్రాడు.

"నేను ఇవ్వాలేంరా?" అంటూ చెయ్యి ఎత్తాడు రామలింగం.

అక్కడ ఉన్నవాళ్లు జోక్యం చేసుకుని సర్ది చెప్పారు.

"ఏ ఊరు నాయనామంది? ఎక్కడో చూసినట్లుంది?" అన్నాడు ఓ వ్యక్తి రామలింగంతో.

అతనికేసి పరిశీలనగా చూసి- "నువ్వు బలరామయ్యగారి బావమరిదివి కదూ?" అన్నాడు రామలింగం.

"అవున్నాయనా!"

"ఎక్కడికో బయల్దేరారే"

"మీ ఊరికే వస్తున్నాను" అన్నాడు బలరామయ్య బావమరిది రామకృష్ణ.

"చాలారోజులను మా ఊరికి రాలేదే బాబయ్యా?"

"రాలేదు నాయనా... వ్యవసాయం చేసుకొనే వాళ్లం- ఎన్నో పనులుంటాయి"

"పనుల్లేకుంటే మనం బతికేదెట్లా బాబాయ్"

"మావాళ్లంతా బాగున్నారా బాబూ?"

"మీవాళ్లంతా ఎవరు, బలరామయ్యే కదా?"

"శ్రీనివాసులని ఓ అబ్బాయి ఉన్నాడు- దాదాపు నీ వయసుంటుంది"

"అవును... ఉన్నాడు. మీ కూతుర్నే కదూ అతనికి ఇవ్వాలని మీ బావ బలరామయ్య అంటూ ఉండేవాడు"

"అవును బాబూ, నా కూతుర్నే"

"తరువాత ఆయనే ఏదో చాడీలు చెప్పి సంబంధం చెడగొట్టాడని కూడా అనుకుంటారు జనం"

"అవున్నాయనా... చెడగొట్టాలనే ప్రయత్నం చేశాడనుకో, అయినా నేను వినలేదు- నా కూతుర్ని శ్రీనివాసులకే ఇస్తానన్నాను"

"శ్రీనివాసులుగారికి ఉద్యోగం వచ్చిన తరువాత బలరామయ్య ప్లేటు ఫిరాయించాడనుకో. అయినా ప్రయోజనంలేదు బాబాయ్. శ్రీనివాసులు ఇప్పుడే పెళ్లిచేసుకొనేట్లు లేదు"

"ఎదిగిన బిడ్డకు పెళ్లిచేయకుండా ఎన్నాళ్లని ఇంట్లో పెట్టుకుంటాం బాబూ! అమీతుమీ తేల్చుకొని పోవాలనే వస్తున్నాను"

"అదే మంచిదిలే బాబాయ్" అన్నాడు రామలింగం.

ఇంతలో బస్సు వచ్చింది. తేనెతుట్టుకు

తేనెటీగలు మునురుకున్నట్లు బస్సు చుట్టూ
రాగారు జనం.

* * *

"నా కూతురుకు పెళ్లి సంబంధాలు చూసే బాధ్యత నీకు అప్పగించడం కుక్కతోక పట్టుకొని గోదావరి దాటినట్టుంది బావా" అన్నాడు రామకృష్ణయ్య.

"ఏంచేయమంటావు- శ్రీనివాసుల్ని ఎంతో హీనంగా భావిస్తున్న లింగరాజు ఈనాడు ఆ శ్రీనివాసుల్నే తన అల్లుడుగా చేసుకోవడానికి తాపత్రయ పడిపోతున్నాడు. ఈ పరిస్థితుల్లో మన అమ్మాయిని చేసుకుంటాడా?" అన్నాడు బలరామయ్య.

"అతడు చేసుకోకపోతే మరో సంబంధం చూద్దాం- లోకం గొడ్డుపోయిందా?"

"తొందరపడకు రామకృష్ణా. భుజంగానికయినా ఇచ్చి చేద్దాం"

"భుజంగం ఎవరు?"

"శ్రీనివాసులు తమ్ముడు"

"ఎందుకు? శ్రీనివాసులు చేసుకోకపోతే వాడి అబ్బలాంటివాడు చేసుకుంటాడు. అతడు చేసుకోలేదని అతని తమ్మునికి ఇవ్వడం అవివేకంగదా"

"వాడి అబ్బలాంటివాడయితే కట్నం ఇవ్వకపోయినా దొరుకుతాడు"

"హాస్యానికి హద్దుండాలి బావా!"

"నన్నేం చేయమంటావో చెప్పు"

"నేరుగా శ్రీనివాసులు వద్దకే వెళ్లి తాడో పేడో తెల్చుకుందాం"

"సరే పద..." అంటూ బయల్దేరాడు బలరామయ్య. అతని వెంట వెళ్లాడు రామకృష్ణ. ఇద్దరూ కలిసి శ్రీనివాసులు ఇంటికి వెళ్లారు.

"ఏం చేస్తున్నావు శీనూ?" అన్నాడు బలరామయ్య బయటినుంచీ.

"ఎవరూ...?" అన్నాడు శ్రీనివాసులు లోపలినుండి.

"నేను బాబూ... బలరామయ్యను" అన్నాడు వరండాలోని వాలు కుర్చీలో కూచుంటూ.

ఎడమ చేత్తో చెంబు పట్టుకొని, వరండాలోకి వచ్చి "రండి బాబాయ్ భోంచేద్దాం... అరెరే మామయ్య కూడా వచ్చారే? ఎప్పుడొచ్చారు మామయ్యా? అందరూ క్షేమమా? రండి... భోంచేద్దాం" అంటూ బయటికి వెళ్లి చెయ్యి కడుక్కున్నాడు శ్రీనివాసులు.

"చెయ్యి కడుకున్నావెందుకు, మేం ఇప్పుడే టిఫిన్‌చేసి వస్తున్నాం భోంచెయ్" అన్నాడు బలరామయ్య.

"ఉండండి బాబాయ్ కాఫీ చేస్తాను"

"కాఫీకి ఇప్పుడేం అవసరం- భోంచెయ్ బాబూ!" అన్నాడు రామకృష్ణయ్య.

"ఎప్పుడోగాని రారుగదా మీరు. రాకరాక వచ్చిన మామగారికి కాఫీ కూడా ఇవ్వకపోతే ఏంబావుంటుంది?"

"మగవాళ్లు చేసే కాఫీ ఏంబావుంటుందిలే" అన్నాడు రామకృష్ణయ్య.

"హొటళ్లలో ఎవరు చేస్తారనుకున్నారు మామయ్యా"

"ఇది హొటలు కాదుగా?"

"ఎన్నాళ్లని చెయ్యి కాల్చుకుంటావు. పెళ్లి చేసుకోబాబూ అంటే వినడు" అన్నాడు బాలరామయ్య.

"సమయం కలసిరావాలిగా బాబాయ్! కల్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగవట"

"ఇంకేం అడ్డంకులున్నాయ్? చదువు పూర్తయింది. ఉద్యోగం వచ్చింది. పెళ్లి వయసు వచ్చింది. ఇంట్లో ఆడదిక్కులేదు. సమస్యను దాటవేయడానికి లేనిపోని సాకులు చెప్పి సమయం కలసి రావాలంటే మేం ఏంచెప్పగలం బాబూ?" అన్నాడు బలరామయ్య.

"లేనిపోనిసాకులు చెప్పడం లేదు బాబాయ్. అసలు నేను పెళ్లి చేసుకుంటానో లేదో!"

"పెళ్లిచేసుకుంటానంటే సంబంధాలు చూడగలంగానీ, పెళ్లే వద్దంటే మేం మాట్లాడేదేముంది?"

"ఏంమాట్లాడాలనుకున్నారు బాబాయ్!"

"నిద్రించేవాణ్ని తట్టిలేపవచ్చుగాని, నిద్రపోయినట్లు నటించేవాణ్ని లేపడం సాధ్యమా?" అన్నాడు బలరామయ్య.

"డొంకతిరుగుళ్లు, సామెతలు ఎందుకు బాబాయ్, విషయం స్పష్టంగా చెప్పొచ్చుగా?"

"ఏంచెప్పమంటావు! రామకృష్ణ కూతుర్ని నీకు ఇప్పించి పెళ్లిచేయమని మీ నాన్నగారు నాకు చెప్పి కళ్లు మూశారు. ఆయనకు ఇచ్చిన మాట నిలుపుకోవాలిగా!"

"మాట నిలుపుకోవడానికి తాపత్రయపడు తున్నందుకు కృతజ్ఞుణ్ని బాబాయ్. అయితే నేను పెళ్లిచేసుకుంటానో లేదో... మరో విషయం.. మీ మేనకోడలు మా నాన్నగారికి కోడలయితే ఆయనగారికి ఇచ్చిన మీ మాట నెరవేరినట్లేగా!"

"చేసుకుంటే రామకృష్ణ కూతుర్నే చేసు కుంటావా?"

"ఆడపిల్ల తండ్రికి ఆశచెప్పడం మంచిది కాదు బాబాయ్"

"చేసుకోనని ఖచ్చితంగా చెప్పొచ్చుగా!" అన్నాడు బలరామయ్య కాస్త కోపంగా.

"మీ మనసుకు ఎలాతోస్తే అలా అను కోండి" అన్నాడు శ్రీనివాసులు వినయంగా.

"వెళ్తాం శీనూ!" అంటూ ఇద్దరూ ఒకేసారి లేచారు.

"ఉండండి కాఫీ తాగి వెళ్దురు" అన్నాడు శ్రీనివాసులు.

అతని మాట వినిపించుకోకుండా వెళ్లిపో యారు.

★ ★ ★

రాత్రి సమయం.

టంగ్.. టంగ్.. టంగ్.. టంగ్.. టంగ్.. టంగ్.. టంగ్.. టంగ్..! గోడ గడియారం మోగింది.

వంటగదిలో ఏదో చేస్తోంది అలివేలమ్మ.

వరండా పక్కగదిలో కుర్చీలో కూచొని, పుస్తకం తీసుకొని పేజీలు తిప్పుతోంది శకుంతల.

టేబుల్ మీద ఉన్న రికార్డు ప్లేయరు నుంచి సన్నగా, శ్రావ్యంగా సినిమా పాటలు వినిపిస్తు న్నాయి.

'ఊధో! మన్ నాహీం దస్‌బీస్

ఏక్‌హు తో సో గయో హరికే సంగ్'

మనసులో చదువుకొని, పుస్తకం మూసి ఆలో చించసాగింది శకుంతల. సూరదాసు పుట్టు కతో అంధుడని అంటారు. కళ్లున్న వాళ్లు సైతం రాయలేనంత చక్కగా రాశాడు కవి త్వం. మనసులు ఎన్నో లేవు. ఉన్న ఒకే ఒక్క మనసు శ్రీకృష్ణుని వెంట వెళ్లిపోయింది అన్నా డు.. ఎంత చక్కగా చెప్పాడు. ఒకరికి అర్పించిన మనసు మరొకరికి ఇవ్వడానికి వీల్లే దనే విషయాన్ని ఎంత సున్నితంగా, స్పష్టంగా, ఖచ్చితంగా చెప్పాడో. అందుకే "సూర్ సూర్ తులసీ ససీ ఉడుగన్ కేశవదాస్!" అన్నారు. సూరదాసు వాస్తవంగా సూర్యుడే.

"ఏమిటే శకూ దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?" అంది అలివేలమ్మ వంట గదిలో నుంచి వరండాలోకి వచ్చి.

"సూరదాసు గురించి ఆలోచిస్తున్నాన మ్మా!" అంది శకుంతల.

"ఎవరే ఆయన?"

"గొప్ప కవి"

"డైలీ సీరియల్ అంటూ ఉంటారే, అది రాసింది ఆయనేనా?"

"ఆయన ఇప్పటివాడు కాదమ్మా! పదిహే నవ శతాబ్దం వాడు"

"అంటే?"

"అయిదు వందల ఏళ్ల క్రితం ఉన్న మహాకవి"

"ఓహో అలాగా.. మీ నాన్నగారి కంటే పెద్దవాడన్నమాట" అని పైట కొంగుతో ముఖం తుడుచుకుంటూ వంట గదిలోకి వెళ్లి పోయింది అలివేలమ్మ.

శంకుతల ఆలోచనా స్రవంతి మలుపు తిరిగి ముందుకు సాగింది.

కుర్చీలో నుంచి లేచి, పరుపు పరిచి, తలగ డమీద ఎడమమోచేయి ఆనించి, అరచేయి మీద చెంప ఆనించి ఆలోచించసాగింది. ...బా ల్యంలో బావ అష్టకష్టాలు పడ్డారట. సజ్జలు దంచి సంకటి చేసి తను, తమ్ముడు చెరో ముద్దతినేవారట. ఊళ్లోజనం అతని ఉనికినే గమనించేవాళ్లుకాదట... ప్రస్తుతం తన మేనకో డల్ని బావకు కట్టబెట్టాలని భగీరథ ప్రయ



త్నం చేస్తున్న బలరామయ్యగారు ఆనాడు లింగరాజుతో చేతులు కలిపి బావతో తప్పుడు సాక్ష్యం చెప్పించడానికి పలుపాట్లు పడ్డారట. తన మేనకోడల్ని కుమారునికి ఇప్పించి, పెళ్లి చేసి పుణ్యం కట్టుకోమని గంగయ్యా మామ చెప్పినట్లు కట్టు కథ కల్పించి బావకు ఆశ పెట్టాడట. సాక్ష్యం చెప్పకపోతే అమ్మాయిని ఇవ్వకుండా చేయడమేగాక ముప్పుతిప్పలు పెట్టి మూడుచెరువుల నీరు తాపుతానని బెదిరించాడట. తన మాట వినకపోతే శ్రీనివాసులు ఊళ్లో కాపురం చేయలేడని అందరికీ చెప్పాడట... బలరామయ్య ఉపయోగించిన సామ దాన భేద దండోపాయాలకు భయపడి లొంగిపోకుండా ఇబ్బందులన్నిటినీ ఎదుర్కొని ధైర్యంగా నిల్చున్నాడట... ఢక్కా మొక్కీలు తిని, రాటుదేలి, అనుభవం గడించి, ప్రయివేటుగా చదువుకొని, ఉద్యోగం సంపాదించి ప్రయోజకుడయితే ఈనాడు అందరూ 'శ్రీనివాసులు మావాడు అంటే మావాడు' అని అంటున్నారు.

ఒకప్పుడు శ్రీనివాసులు తమ బంధువు అని చెప్పుకోవడానికి అతని బంధువులే సిగ్గుపడ్డారట. బంధువులు కానివాళ్ళు కూడా ఈనాడు బంధువని బాహాటంగా చెప్పుకుంటున్నారు. మా అమ్మాయిని ఇస్తామంటే మా అమ్మాయిని ఇస్తామంటూ ముందుకు వస్తున్నారు. తనకు అనుకూలంగా సాక్ష్యం చెప్పలేదన్న కోపంతో చిటపటలాడి పలువిధాల తూలనాడిన లింగరాజుగారు సైతం బావకు తన కుమార్తెను ఇవ్వడానికి ఉవ్విళ్లూరుతున్నాడట. ఎవరెవరినో మధ్యవర్తులుగా పంపాడట. చిన్నప్పటి నుండి నాతో చిలిపిగా, హాస్యంగా మాట్లాడిన బావ సౌజన్యను చేసుకుంటాడా...? 'పైసేమేం పరమాత్మా హై' అన్నారు. లింగరాజు ధనవంతుడు. సౌజన్య అతని ఏకైక కుమార్తె... అమ్మాయిని చేసుకుంటే బావ లక్షలాది ఆస్తికి అధికారి కాగలడు. డబ్బుమీద ఆశలేని మనిషి ఉంటాడా. సౌజన్య కూడా అందమయిన అమ్మాయే. అసలు సౌజన్యను బావ వద్దకు ట్యూషనుకు పిలుచుకొని పోవడం నాదే తప్పు... అమ్మాయి ముఖ పరిచయమే లేకపోతే బావ మనసు నామీదే స్థిరంగా ఉండేది.

అమ్మా-నాన్నలకూ బావ మీద అభిమానం ఉంది. ఆయనను అల్లుడుగా చేసుకోవాలని అనుకుంటున్నారు... ఊరికే అనుకోవడం కాదు... శాయశక్తులా ప్రయత్నం చేస్తున్నారు. రామలింగం అన్నయ్య ద్వారా రాయబారం నడుపుతున్నారు. ఆరోజు జాకెట్టు కుట్టించుకోవడానికి వెళ్లినప్పుడు రహస్యంగా మాట్లాడిన మాటలు, ఒకరోజు ట్యూషన్లో మాట్లాడిన మాటలు బావ మరచిపోతాడా...? మరచిపోడు... ఎప్పటికీ మరచిపోడు... బావకు నామీద ప్రేమ ఉందో లేదో... వదరుబోతులా మాట్లాడితే ఎప్పుడో ఒకప్పుడు మనసులోని మాట బయటపడుతుంది. బావ అలా మాట్లాడడు. ఆచి తూచి మాట్లాడతాడు. అనుమానం పెనుభూతం అన్నారు పెద్దలు. ఊరికే అనవసరంగా అనుమానిస్తున్నాను... బావ మనసు మార్చుకోడు. నన్ను కాదని ముక్కూ మొహం తెలియని కొత్త అమ్మాయిని చేసుకోడు... చేసుకోడుగాక చేసుకోడు... చేసు... కోడు... చే... సు... కో... డు...

"పుస్తకం పక్కన పెట్టి ఏం చేస్తున్నావు శకూ?"

ఉలికిపడి లేచి, "స్పాట్ వాల్యుయేషను అయిపోయిందా బావా?" అంది శకుంతల.

"అయిపోకపోతే ఎలా వస్తాననుకున్నావ్?"

"నామీద మనసుపడి వచ్చావేమోనని"

"పుస్తకాలు చదువుతున్నావా లేక మగవాళ్ళ మనసులు చదువుతున్నావా?"

"నిజంగా నామీద మనసుపడిందా బావా?"

"అనుమానిస్తున్నావా?"

"లేదు బావా... నిన్ను అనుమానిస్తానా?"

"అలా రా దారికి"

"ఏ దారిలో పోదామంటావు"

"నీ దారే నాదారి..." అంటూ చెయ్యి పట్టుకున్నాడు శ్రీనివాసులు.

సిగ్గుతో తల వంచుకొని, శ్రీనివాసులు వెంట నడుస్తూ- "ఎంత మంచివాడవురా ఎన్ని నోళ్ళ పొగడుదురా" అంటూ గొణిగింది.

"మబ్బులు రెండూ ఢీకొని అయితే మెరుపే వస్తుంది.

మనసులు రెండూ పెనవేసుకుంటే వలపే పుడుతుంది" అంటూ పాడసాగాడు శ్రీనివాసులు

"కనులు కనులు కలిసేను కన్నె వయను పిలిచేను" దీర్ఘం తీసింది శకుంతల.

అలా ఇద్దరూ పార్కులోకి వెళ్ళారు.

"ఇదేం సినిమా అనుకున్నావా బావా యుగళగీతాలు పాడటానికి?"

"మరి నువ్వూ పాడుతున్నావుగా?"

"నువ్వొక్కడివే పాడితే మజా ఉంటుందా?"

"ఎవరు పాడినా ఉత్త పాటలో ఏముంది మజా... కాస్త కావలించుకొని పాడితే-"

"ఏంటి బావా మోటు నరసం... వదులు..."

"ఇప్పుడు మనం ఇంద్రలోకపు ఉద్యానవనంలో ఉన్నాం"

"ఎప్పుడూ వేళాకోళమేనా?"

"ఏమిటే శకూ! తలగడను కావలించుకొని మొద్దులా నిద్రపోతున్నావ్? ఆ రికార్డు ప్లేయరు అలా ఎప్పుడూ వాగవలసిందేనా! ఆపు చేయరాదూ?" అంది అలివేలమ్మ.

అలివేలమ్మ కేకలకు అదిరిపడి లేచి, కళ్ళు నులుముకొని చూసి ఓ నిట్టూర్పు విడిచిన శకుంతల రికార్డు ప్లేయరు నుంచి రేడియోకు మార్చింది స్విచ్.

సమయం రెండు గంటలు దాటి ముప్పయి నిమిషాలు కావస్తోంది. వరండాలోని వాలు కుర్చీలో కూచొని సిగరెట్టు దమ్ములాగి గుప్పు గుప్పున పొగ వదుల్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు లింగరాజు.

అతని పక్క కుర్చీలో కూచున్న బలరామయ్య, "శ్రీనివాసులుగాడు కొరకరాని కొయ్య అయ్యాడు బావగారూ!" అన్నాడు చేతి రుమాలుతో ముఖం తుడుచుకుంటూ.

"వాని స్వభావమే అలాంటిది"

"కొరివి అని తెలిసీ దానితో తలగోక్కోవడానికి ప్రయత్నించడం మనం చేసిన పొరపాటు"

"పొరపాటయినా గ్రహపాటయినా భాగస్వాములు నువ్వూ, మీ చెల్లాయే"

"ఆటలో మేం ఇంకా పూర్తిగా ఓడిపోలేదులెండి"

"ఓడిపోతేనే మనకు లాభంలెండి. పట్టు విడుపులు లేకుండా తాను పట్టిన కుందేలుకు మూడే కాళ్లు అనే మూర్ఖునితో జీవితాంతం వేగడం కష్టం"

"మన అమ్మాయిని మనువాడటానికి ఎంతో మంది మంచి మంచివాళ్ళు ఉండగా బలవంతంగా ఓ బడిపంతులుకు కట్టబెట్టాలనీ అనుకోవడం నేనూ, భాగ్యమ్మా చేసిన పొరపాటే"

"ఎత్తువారి చేతి బిడ్డవంటే నువ్వేనయ్యా. ఆరోజు నా భార్యకు తాళం వేశావు, ఈ రోజు నాకు వంత పాడుతున్నావు"

"కాదంటే భాగ్యమ్మ బాధపడుతుందని సరేనని అన్నాను కానీ, మనస్ఫూర్తిగా ప్రయత్నం చేశానని అనుకున్నారా? ఆదిలోనే హంస పాదు అన్నట్లు మా మేనకోడలు విషయం ప్రస్తావించినప్పుడే అయ్యవారి గుట్టు రట్టు అయింది"

"గుట్టేమిటి, రట్టుకావడమేమిటి బావగారూ?"

"శీనూ మనను శకుంతల మీద ఉన్నట్లు అర్థమయింది"

"శకుంతల ఎవరయ్యా... మీ మేనకోడలేనా?"

"కాదండీ... మహానుభావా! సుబ్బయ్య కూతురు"

"సుబ్బయ్య కూతురా? హారినీ... అయితే సుబ్బడు కోటలో పాగా వేశాడన్నమాట"

"వేస్తాడు వేస్తాడు.. ఎందుకెయ్యడు... వేసిన పాగా ఎత్తేయలేమా?"

"ఇచ్చేవాడూ... చేసుకొనేవాడూ ఏకమయితే నువ్వూ నేనూ ఏం చేయగలం వెర్రివాడా?"

"చేయాలని అనుకుంటే ఏమయినా చేయగలం"

"ఏదయినా ఎత్తు వేశావా?"

లింగరాజు చెవిలో గునగునలాడి- "ఒకే దెబ్బకు రెండు పిట్టలు" అన్నాడు బలరామయ్య చిటికవేస్తూ.

"ఛ... ఛ... అదేంపనయ్యా! అలా చేస్తే మనకు వచ్చిన లాభమేమిటి?"

"మనకు అందకపోయినా మరొకరికి అందనివ్వకూడదు"

"మీ ప్రయత్నం ఎంతవరకూ వచ్చిందన్న య్యా?" అంటూ లోపలినుండి వచ్చింది భాగ్య మ్మ.

"ఇంకా వ్యవహారం ఒక కొలిక్కి రాలేద మ్మా"

"ఏమో అన్నయ్యా... మిమ్మల్నే నమ్ముకొని బాధ్యత అప్పగించాం. పాలముంచినా నీట ముంచినా మీదే భారం"

"అదేంటమ్మా ఆర్థిక స్తోమతలేని నిరుపే దలా మాట్లాడతావు"

"అందరూ మంచివాడని అంటూ ఉంటే...!"

"రెండు మూడు రోజుల్లో తేలిపోతుంద మ్మా!"

"మీ అన్నయ్య వచ్చి ఎంతసేపయిందను కున్నావే... కాఫీ... గీఫీ..."

"స్టౌ మీద పెట్టి వచ్చా... ఇప్పుడే తెస్తా" అంటూ లోపలికి వెళ్ళింది భాగ్యమ్మ.

* * *

తమ కుమార్తెలను శ్రీనివాసులకు ఇవ్వడాని కి లింగరాజు- సుబ్బయ్య పరస్పరం పోటీ పడుతున్నారన్నవార్త ఆనోటా- ఆనోటా పయ నించి నంజీవయ్య, దామోదరంగార్ల చెవుల్లోకి చేరుకుంది.

అంత వరకు ఎవరి పనులు వారు చేసు కొంటూ ఎవరి ఇళ్ళలో వాళ్ళు గడుపుతున్న మిత్రద్వయం అత్యవసరంగా నంజీవయ్య ఇంట్లో సమావేశమై ఆలోచించారు.

లింగరాజు, సుబ్బయ్య, బలరామయ్య తమ ప్రత్యర్థివర్గమనీ, వాళ్ళలో ఎవరితో వియ్య మందినా శ్రీనివాసులు ఆ వర్గంలో చేరిపోతా డని, అలా చేరితే తమ వర్గంలోని ఓ మేథావి తగ్గిపోవడమేగాక ప్రత్యర్థివర్గం మరీ బలపడు తుందని, వాళ్ళ ప్రయత్నాలు వమ్ము చేయ డమే తమ తక్షణ కర్తవ్యమని ఏకగ్రీవంగా తీర్మానించుకున్నారు.

తీర్మానం అయితే చేసుకున్నారుగానీ, ప్ర యత్న ఫలితం ఏమవుతుందో నిర్ణయించుకో లేకపోయారు.

శ్రీనివాసులుతో వియ్యమందడానికి ముచ్చ టగా ముగ్గురు పోటీపడుతున్నా శ్రీనివాసులు సుబ్బయ్య కూతురు పట్ల మొగ్గు చూపుతున్నా డన్న వార్త కూడా వాళ్ళకు తెలియకపోలేదు. ఆ వార్త వాస్తవమో లేక వదంతో తెలుసుకోవాల న్న కుతూహలంతో శ్రీనివాసులు వద్దకు వెళ్ళా లనుకున్నారు నంజీవయ్య, దామోదరం.

మిత్రులు ఇద్దరూ శ్రీనివాసులు ముంగిట్లో అడుగు మోపేసరికి అతని ఇంట్లో గోడగడి యారం తొమ్మిది కొట్టింది.

అప్పుడప్పుడే భోంచేసి, పుస్తకాలు టేబుల్ మీద పెట్టుకొని, కొత్త పదాల అర్థాలు తెలుసుకో వడానికి శబ్దకోశం తిరగేస్తున్నాడు శ్రీనివాసు లు. ముంగిట్లో మంచమ్మీద పడుకొని, ఉన్నిర గ్గు నిండా కప్పుకొని గుర్రుపెడుతున్నాడు భు జంగం.

వాకిట్లోకి వచ్చినవాళ్ళను కూడా గమనించ కుండా తనపనిలో నిమగ్నమయిన శ్రీనివాసు లుకు తమ రాక తెలియజేయడానికి పొడిదగ్గు దగ్గాడు నంజీవయ్య.

శబ్దకోశంలోనుంచి చూపు మరల్చి, వాకిలి వేపు చూసిన శ్రీనివాసులుకు నంజీవయ్య, దామోదరం కనిపించారు. కుర్చీలో నుంచి ఆదరాబాదరా లేచి- "రండి బాబాయ్" అంటూ సాదరంగా ఆహ్వానించాడు.

"రావాలనే వస్తున్నాం బాబూ" అంటూ గడపదాటాడు దామోదరం.

"ఎక్కడకో వెళ్ళావట ఎప్పుడొచ్చావు నాయనా?" అన్నాడు నంజీవయ్య.

"అనంతపురం వెళ్ళాను... నాలుగురోజుల యింది వచ్చి... రండి.. కూచోండి బాబాయ్...!" అంటూ కుర్చీలకేసి చూపాడు.

"తొమ్మిది దాటినా ఇంకా ఏదో చదువు కుంటున్నావే బాబూ?" అన్నాడు నంజీవయ్య కుర్చీలో కూచుంటూ.

"రేపు స్కూల్లో చెప్పవలసిన పాఠాలు చూ సుకుంటున్నాను బాబాయ్"

"పిల్లలకు చెప్పడానికి ముందుగా చూసుకో వాలా?" అన్నాడు దామోదరం.

"చూసుకోకపోతే తెలియని పదాలు వచ్చిన ప్పుడు పిల్లల ముందు తెల్లమొహం వేయవ లసి వస్తుంది బాబాయ్" అంటూ స్టౌ వద్దకు





వెళ్ళి అగ్గిపుల్లగీశాడు శ్రీనివాసులు.

"వద్దు వద్దు... కాఫీ... గీఫీ ఏమీ వద్దు. ఇప్పుడే భోంచేసి వచ్చాం" అన్నారు ఇద్దరూ ఒకేసారి.

"ఇంటికి వచ్చిన అతిథులకు మర్యాదచేయడం మన సంప్రదాయం"

"ఎవరో కొత్తవాళ్ళకయితే మర్యాదలు-గిర్యాదలు... పైగా ఆడవాళ్లు లేనప్పుడు నువ్వు చెయ్యి కాల్చుకోవడం ఏంబావుంటుంది?" అన్నాడు దామోదరం.

కాఫీచేసి, రెండు గ్లాసుల్లో వొంపి చెరో గ్లాసు ఇచ్చాడు.

"అదేం నువ్వు తాగవా?"

"ఇప్పుడే భోంచేసి కూచున్నాను"

"ఎంత ఓపిక బాబూ, విసుగు విరామం లేకుండా అన్నిపనులూ చేసుకుంటావు" అన్నాడు సంజీవయ్య.

"పనిచేయకుండా పరుల సంపాదనమీద ఆధారపడి బతకడం దేశద్రోహం బాబాయ్"

"అందరూ అలా అనుకుంటే మనదేశం ఎప్పుడో భూలోకస్వర్గంగా మారిపోయేది" అన్నాడు దామోదరం కాఫీ చప్పరిస్తూ.

"చిన్నాన్నగారు ఇద్దరూ చాలా పొద్దుపోయాక వచ్చారే" అన్నాడు శ్రీనివాసులు సంభాషణ మలుపు తిప్పుతూ.

"ఎనిమిది గంటలకు లోగా వస్తే ఒంటరిగా దొరకవు మరి" అన్నాడు సంజీవయ్య.

"నాతో జరపవలసిన అంత రహస్యమంతనాలు ఏమున్నాయి?"

"రహస్యమంతనాలు ఏమీలేవుకాని, అంతకంటే ముఖ్యమయిన సమస్య గురించి చర్చించాలి"

"నా శ్రేయస్సుకోరే మీ సలహాలు వినడానికి నేను ఎప్పుడూ సిద్ధమే బాబాయ్"

"ఆ... ఏంలేదు... యుక్తవయసొచ్చిన తరువాత గూడా జంటలేని ఒంటరి జీవితం ఎన్నాళ్లు గడుపుతావని..." అన్నాడు దామోదరం చిరునవ్వు చిందిస్తూ.

"మోచేతి కంకణం ముంజేతికి రావాలంటారుకదా బాబాయ్ మీలాంటి పెద్దలు"

"రావడానికి ప్రయత్నించాలికదా? దానంతటదే వస్తుందా?" అన్నాడు సంజీవయ్య.

"త్వరగా కాయలు కాయాలని నూరు కడవలు నీరు ఒకేరోజు పోసినా రుతువు వచ్చేవరకూ చెట్టు కాయలు కాయదని చెప్పాడు కబీరుదాసు"

"ఏదో మాకు తోచింది చెబుదామని వచ్చాంబాబూ, నీకు తెలీదని కాదు"

"చెప్పండి బాబాయ్... అనుభవజ్ఞులు కదా"

"చేసుకుంటానంటే సంబంధాలు చూస్తాం బాబూ" అన్నాడు సంజీవయ్య.

"ఉద్యోగంలో చేరిన మరునాటినుండీ సంబంధాలు వస్తున్నాయి బాబాయ్"

"బెల్లం ఉంటేనే ఈగలు ముసిరేది" అన్నాడు దామోదరం.

"చెరువు నిండితేనే కప్పలు చేరేది" అన్నాడు సంజీవయ్య.

"వచ్చిన సంబంధాల్లో ఒక్కటీ సరిపోదా?" అన్నాడు దామోదరం.

"అన్నివిధాలా ఆలోచించాలి గదా"

"ఎన్నివిధాల ఆలోచించినా మన ఊళ్ళో మాత్రం చేసుకోకు"

"ఇంకా ఏదీ నిర్ణయించుకోలేదు"

"ఎక్కడ గోతిలో పడిపోతావోనని భయపడ్డాం" అన్నాడు దామోదరం.

"ఆనాడు వాళ్లు పెట్టిన ఇబ్బందులు అప్పుడే మరిచిపోతాడా?" అన్నాడు సంజీవయ్య.

"కాలంలో మార్పు వచ్చినట్లు మనుమల మనసుల్లోనూ మార్పు రాకూడదా బాబాయ్?" అన్నాడు శ్రీనివాసులు.

"పుట్టుకతో వచ్చిన బుద్ధి పుల్లలతోకానీ పోదట"

"పెద్దలు చేసిన తప్పులకు పిల్లల్ని శిక్షించడం న్యాయమా బాబాయ్?"

"తల్లిదండ్రుల బుద్ధులు పిల్లలకు రావా?"

"బురదలో కమలము, ముళ్ళమధ్య గులాబి పుట్టడంలేదా?"

"అయితే లింగరాజు బిడ్డనో, సుబ్బయ్య కుమార్తెనో చేసుకుంటావన్నమాట" అన్నాడు సంజీవయ్య.

"బలరామయ్యగారి మేనకోడల్ని చేసుకోకూడదా?" ప్రశ్నించాడు శ్రీనివాసులు.

"ఆ ముగ్గిరిలో ఎవర్నీ చేసుకోగూడదని చెప్పడానికే వచ్చాం" అన్నాడు దామోదరం.

"వినదగునెవ్వరు చెప్పిన..." అన్నాడు శ్రీనివాసులు నవ్వుతూ.

"వినినంతనె వేగపడక..." అన్నాడు సంజీవయ్య.

"వివరింపదగున్..." అందుకున్నాడు దామోదరం.

"అందుకే తొందరపడలేదు" అన్నాడు శ్రీనివాసులు.

"వెనుకటి రోజులు జ్ఞాపకం చేసుకోబాబూ, అంతకంటే ఏం చెప్పలేం" అన్నాడు సంజీవయ్య.

"వెళ్తాంబాబూ, నీపని చూసుకో" అంటూ లేచారు ఇద్దరూ.

వాళ్ళతోబాటు లేచి- "మరచిపోకుండా అభిమానంతో వచ్చినందుకు కృతజ్ఞుణ్ని బాబాయ్" అంటూ వాళ్ళతోబాటు ముంగిట్లోకి వెళ్ళాడు శ్రీనివాసులు.

మంచంమ్మీద పడుకున్న భుజంగం మరో పక్కకు పొర్లి పడుకున్నాడు.

★ ★ ★

"కాదయ్యా వెర్రివాడా! మన గోత్రాలన్నీ మన ప్రత్యర్థులకు తెలిశాయి"

"మన ప్రత్యర్థులెవరు?" అన్నాడు అంతవరకూ మవునంగా వింటూ కూచున్న బలరామయ్య.

"ఈ ప్రశ్న సుబ్బయ్య అడుగుతాడని అనుకున్నానుగానీ, నువ్వు అడుగుతావని అనుకోలేదు" అన్నాడు లింగరాజు.

"ఎవరు సంజీవయ్య, దామోదరమేనా?"

"మీకు తెలియని విషయం ఏముంది?"

"వాళ్లు మన ప్రత్యర్థులు ఎలా అవుతారండీ?" అన్నాడు సుబ్బయ్య.

"ప్రత్యర్థులు కాకపోతే ప్రాణస్నేహితులా?" ఎదురు ప్రశ్నవేశాడు లింగరాజు.

"ఒకనాటి ప్రత్యర్థులను ఇప్పుడూ ప్రత్యర్థులని అనుకోవడం విరోధం కొని తెచ్చుకోవడమేగా? అన్నాడు సుబ్బయ్య. "మీ బుద్ధి పోనిచ్చుకున్నారుకాదు" అన్న ఈసడింపు ధ్వనించింది సుబ్బయ్య మాటలో.

"నేనూ అలాగే అనుకున్నాను. అయితే వాళ్లు మనల్ని ఇప్పటికీ విరోధులుగానే భావిస్తున్నారని నిన్నరాత్రి వాళ్లు వెళ్లగక్కిన విషం స్పష్టం చేసింది"

"విషం కక్కారా? పీడ విరగడయిందన్న మాట" అన్నాడు బలరామయ్య ఆనందంగా.

తమ మాటలు ఎవరయినా వింటున్నారేమోనని కాస్త సందేహించాడు లింగరాజు.

"రామన్నా" అన్నాడు.

"ఏమయ్యా?" అంటూ వచ్చాడు బిల్‌కలెక్టరు వరండాలోనుంచి.

"కాఫీ తీసుకురా!"

"అంత భయపడుతున్నారే?" అన్నాడు బలరామయ్య.

"గోడకు చెవులుంటాయండీ"

"అనుమానమే పెనుభూతం"

"అప్రమత్తంగా ఉండటం మంచిది కదండీ! ఎవరికీ తెలియకూడదని రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో శ్రీనివాసులు ఇంట్లో జరిపిన రహస్యమంతనాలు మనకు ఎలా తెలిశాయంటారు?" అన్నాడు లింగరాజు లాజికల్‌గా.

"గోడలు చెప్పాయా?" అన్నాడు సుబ్బయ్య.

"అంతే అనుకోవాలి"

కాఫీగ్లాసులు ట్రేలో పెట్టుకొని తెచ్చి, టేబుల్‌మీద పెట్టాడు రామన్న.

"సరే... నువ్వెళ్లి ఈరోజు చేయవలసిన పని చూడు" అన్నాడు లింగరాజు.

వెళ్ళిపోయాడు రామన్న.

★ ★ ★

తెల్లవారు జాము అయిదు గంటల ముప్ఫయి నిమిషాలు. మామూలుగా ఏడు గంటల





కులోగా లేవని లింగరాజు నాలుగున్నరకే లేచి స్నానంచేసి, పూజ ముగించి డ్రాయింగు రూమ్‌లో కూర్చుని బిల్ కలెక్టరుకోసం ఎదురుచూడసాగాడు. సుబ్బయ్యను, బలరామయ్యను పిలుచుకొని రమ్మని అయిదు గంటలకే బిల్ కలెక్టరును పంపి తను పూజా మందిరంలో దూరాడు. అర్ధగంట గడిచినా వాళ్లు రాలేదు. కుర్చీలో నుంచి లేచి, హాల్లోకి వెళ్లి పచార్లు చేయసాగాడు. పచార్లు చేస్తూ చేస్తూ కిటికీలో చూశాడు. వాళ్లు బజార్లో కనిపించగానే పచార్లు చేయడం చాలించి, డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్లి కూచున్నాడు.

''నమస్కారం'' అన్నారు బలరామయ్య, సుబ్బయ్య ఒకేసారి.

''నమస్కారం'' అంటూ లేచి నిలబడి, ''కూచోండి'' అన్నాడు. ఇద్దరూ కూచున్న తరువాత తనూ కూచొని, ''ఏం పని చేస్తున్నారు సుబ్బయ్యగారూ, ఈ మధ్య దర్శనాల్లేవు'' అన్నాడు ఆప్యాయంగా లింగరాజు.

''తీరుబడి లేదండి... ఏదో అర్థంగాని పనులు''

''బలరామయ్యేమో అప్పుడప్పుడు కనిపిస్తూ ఉంటాడు. మీరే బొత్తిగా కనిపించడం లేదు''

''ఈ రోజు కూడా ఊళ్లో ఉండను, కదిరికి వెళ్లాలి. రమ్మని కబురుచేస్తే ఏం పనుందో తెలుసుకొని వెళ్దామని వచ్చా'' అన్నాడు సుబ్బయ్య.

''ఈ లోకంలో ఉన్నారా లేదా? ఓ వేపు కొంపలు తగలబడిపోతూ ఉంటే నిమ్మకు నీరెత్తినట్లు ఇంట్లో కూచుంటారా?'' అన్నాడు లింగరాజు.

''మా కుటుంబ సమస్యలు తప్ప వేరే సంగతులు పట్టించుకోవడం లేదులెండి'' అన్నాడు సుబ్బయ్య నిర్లిప్తంగా.

''ఎవరి సంగతో కాదయ్యా మహానుభావా! మన సంగతే- మీ కుటుంబ సంగతి, మా కుటుంబ సంగతి, బలరామయ్య గారి బావమరిది కుటుంబ సంగతి''

''మా కుటుంబ సంగతా?'' అంటూ విస్తుపోయాడు సుబ్బయ్య.

''అవునండీ... శకుంతల మీ కూతురు కాదా?

''కాదని ఎవరన్నారు?'' ఎదురుప్రశ్న వేశాడు సుబ్బయ్య.

''మీ కుమార్తెను శ్రీనివాసులుకు ఇవ్వడానికి రామలింగం ద్వారా రాయబారం నడుపుతున్న సంగతి మాకు తెలిసినట్లే నా కుమార్తెను, బలరామయ్య మేనకోడల్ని ఇవ్వాలని మేమూ ప్రయత్నిస్తున్న సంగతి మీకు తెలిసే ఉంటుంది''

''అవును... తెలిసింది, నా భార్య చెప్పింది''

''మాకూ ఆడవాళ్ల ద్వారానే తెలిసింది అనుకోండి''

''ఈ విషయం చెప్పడానికే రమ్మన్నారా?''

''ఏ విషయమంటారు?''

''అదే- మా విషయం మీకూ, మీ విషయం మాకూ తెలిసిందన్న విషయం'' అన్నాడు సుబ్బయ్య వ్యంగ్యంగా.

''మీరు చెప్పదలుచుకున్నదేమిటో చెప్పండి మరి, నాకు పనుంది'' అన్నాడు సుబ్బయ్య.

''మన అమ్మాయిల్లో ఎవరినీ చేసుకోకుండా చాడీలు చెప్పి, వాళ్లు సూచించిన అమ్మాయిని చేసుకోవాలని చెప్పారట సంజీవయ్య, దామోదరం''

''చెప్పనీ... తప్పేముంది?''

''అంత తేలిగ్గా మాట్లాడతావేమయ్యా? మన ముగ్గురమ్మాయిల్ని కాదని ఆ వెధవలు తెచ్చిన సంబంధం చేసుకుంటాడా?''

''చేసుకుంటాడని ఎవరు చెప్పారు?'' అడిగాడు సుబ్బయ్య.

''నమ్మతగినవాళ్లే చెప్పారు''

''ఒకవేళ చేసుకున్నాడే అనుకుందాం... మనకేం నష్టం?''

''ఎలా చేసుకుంటాడో చూద్దాం'' అన్నాడు లింగరాజు ఆవేశంగా.

''చేసుకుంటే మనం చేసేదేముంది?'' అన్నాడు సుబ్బయ్య.

''మన ముగ్గురి అమ్మాయిల్లో ఒకర్ని భ

జంగానికి ఇద్దాం''

"ఇదేంటయ్యా... అలిగిపోయి పరుపుమీద పడుకున్నట్లు?'' అన్నాడు బలరామయ్య.

"శ్రీనివాసులుమీద ప్రతీకారం తీర్చుకోవాలంటే ఆ పని చేయక తప్పదు''

"తమ్మునికి పిల్లనిచ్చి పెళ్లిచేస్తే అన్నమీద ప్రతీకారం తీర్చుకున్నట్లా?'' అన్నాడు సుబ్బయ్య ఆశ్చర్యపడుతూ.

"భుజంగానికి మీ అమ్మాయిని ఇస్తావేమో చెప్పు. ఆ కిటుకేమిటో చెబుతా!'' అన్నాడు లింగరాజు.

"ఆ కిటుకు తెలుసుకోవాలన్న ఆసక్తి నాకు లేదు. శ్రీనివాసులు మీద కక్షసాధించవలసిన అవసరం అంతకంటే లేదు. పాతకక్షలు మనసులో పెట్టుకొని, ఈ సాకుతో కక్ష సాధించాలని ప్రయత్నిస్తున్నారు. దయచేసి ఇలాంటి చర్చలకు నన్ను పిలవకండి'' అంటూ లేచిపోయాడు సుబ్బయ్య.

"వీడేం వెర్రోడయ్యా, కాఫీ కూడా తాక్కుండా వెళ్లిపోయాడు'' అన్నాడు లింగరాజు సుబ్బయ్య వెళ్లిన వేపు చూస్తూ.

"తాగడానికి అవకాశమిస్తే గదా?''

"తాగవద్దన్నానా? తాగండి చల్లబడుతుంది''

"కాఫీ రుచి కంటే మీ మాటలు ఆసక్తికరంగా ఉన్నాయి మరి... మీరు వేసిన కొత్త ఎత్తు ఏమిటో నాకు అర్థం కాలేదు''

"శీనూగాడి మీద ప్రతీకారం తీర్చుకోవాలనుకుంటే మన అమ్మాయిని అతని తమ్మునికి ఇచ్చి, అడుగడుగునా అడ్డంకులు కలిగించి, ఏడిపించాలి. అవసరమయితే నా కుమార్తెను ఇవ్వడానికి కూడా సిద్ధమే'' అన్నాడు లింగరాజు.

"ఏదో మాట వరసకు అంటున్నారు గానీ, మీ కుమార్తెను భుజంగానికి ఇస్తానంటే నమ్మడానికి నేనేం చెవిలో పువ్వు పుట్టకోలేదు. శ్రీనివాసులకు ఇవ్వడానికే తటపటాయించారు''

"పోనీలే... మీ మేనకోడల్ని ఇప్పిస్తారా?''

"రావ: ... ఒప్పుకోవాలిగా. శ్రీనివాసులు చేసుకోకపోతే తన కూతుర్ని ఈ ఊరికే ఇవ్వనని అంటున్నాడు''

"మాటలకు చేతలకు సంబంధం ఉండదులేవయ్యా''

"ఎలాగయినా నచ్చజెప్పి సుబ్బయ్య కుమార్తెను ఇప్పిస్తే బావుంటుంది''

"వాడు పరమమూర్ఖుడు. మనమాట ఖాతరు' చేస్తాడా?''

"మన భక్త సమాజం సమావేశం ఉంది గదా. మన గురువుగారితో చెప్పిద్దాం''

"మంచి ఆలోచనే ప్రయత్నించి చూద్దాం''

"నేను వెళ్లొస్తామరి''

"సరే వెళ్ళిరండి''

వెళ్ళిపోయాడు బలరామయ్య.



ముంగిట్లో వేపచెట్టుకింద మంచమ్మీద కూచొని తాడు పేనుతున్న భుజంగం వేపచెట్టులో కట్టుకున్న కాకి గూడుకేసి చూస్తూ ఆలోచిస్తున్నాడు. కాకి లేనప్పుడు కోకిల వచ్చి గూటిలో కూచుంటుంది. కాకి చూస్తే దాన్ని తరుముతుంది.

కాకి కూటమి చూడగూడదట. చూస్తే ఆర్నెల్లలోగా చనిపోతారట. మా అన్న మాత్రం ఒప్పుకోడు. అంతా మూఢనమ్మకం అంటాడు.

"ఏందోయ్ అల్లుడూ, తాళ్లు పేనుతున్నావా?'' అంటూ ఆకస్మికంగా వచ్చిన లింగరాజును చూసి, లేచి నిలబడి, "అవును... మా.. మా...!'' అనబోయి నాలుక్కరుచుకొని, "రండి... రండి...'' అన్నాడు భుజంగం.

ఎప్పుడూ తమ ఇంటికి రాలేదు లింగరాజు. ఎప్పుడయినా బజార్లోనే, వాళ్ల ఇంటి

ముందో కనిపిస్తే, "ఏరా భుజంగా!" అనే లింగరాజు తమ ఇంటికొచ్చి, "అల్లుడూ!" అంటే పిలిచింది తననేనా లేక అన్ననా? అన్న సందేహంతో "మామా!" అనడానికి తటపటాయించి, ఎవరూ లేనందువల్ల పిలిచింది తననే అనుకొని మర్యాదగా ఆహ్వానించాడు భుజంగం.

లేచి నిల్చున్న భుజంగం భుజం తడుతూ, "కూచో!" అంటూ తనూ కూచున్నాడు నులక మంచమ్మీద లింగరాజు.

"ఉండండి... ఉండండి... జంపుఖానా తెస్తాను" అంటూ హడావుడిగా ఇంట్లోకి వెళ్లబోతున్న భుజంగం చెయ్యి పట్టుకొని, "ఏందోయ్ అల్లుడూ? మనింట్లో మనకు మర్యాదేంటి? నువ్వేమన్నా పరాయివాడివా? నా కూతురు చదువుకోవాలని పట్టుబట్టకపోతే నీకు ఇచ్చి రంగరంగ వైభోగంగా పెళ్లి చేసేవాడిని..." అన్నాడు లింగరాజు.

బిత్తరపోయి బిక్కుబిక్కుమంటూ చూడసాగాడు భుజంగం. లింగరాజు కూతుర్ని శ్రీనివాసులుకు ఇస్తారని ఇన్నాళ్ళూ అనుకున్నారు జనం. ఇప్పుడేమో తన కూతురు చదువుకోవాలని పట్టుబడుతోందని లేకపోతే నీకు ఇచ్చి పెళ్లి చేసేవాడినని లింగరాజే చెబుతున్నాడు. తను చూస్తున్నది, వింటున్నది కలా నిజమా? అనుకున్నాడు. కళ్లు నులుముకున్నాడు. కలకాదు. నిజమే...! ఏం మాట్లాడాలో పాలుపోలేదు పాపం!

"ఏందోయ్ రాతిబొమ్మలా నిల్చున్నావ్? కూచో" అన్నాడు.

తత్తరపాటు పైకి కనిపించకుండా దాచుకోవాలని ఎంత ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది. కాళ్లు సన్నగా వణుకుతున్నాయి. గుండె కూడా మామూలు కంటే వేగంగా కొట్టుకుంటున్నట్లు అనిపిస్తోంది.

"ఏందోయ్ ఎంతో సంబరపడతావనుకుంటే వణుకుపోతున్నట్లుందే! మీ ఇంటికి మా అమ్మాయిని ఇచ్చి బంధుత్వం కలుపుకోవాలని అనుకున్నాం. అయితే మీ అన్న అంగీకరిస్తాడన్న నమ్మకం లేదు. అందుకే నా తమ్ముని కూతుర్ని నీకు ఇవ్వాలని అనుకున్నాం" అన్నాడు ఆప్యాయంగా.

"మీకు తమ్ముడు ఉన్నాడా అండీ?" అన్నాడు బెరుకుబెరుగ్గా.

"స్వంత తమ్ముడు కాదనుకో, అయినా వరస తమ్ముడే"

"ఎవరండీ?"

"సుబ్బయ్య తెలుసుగా?"

"తెలుసు"

"ఆయన కూతుర్ని చూశావా?"

"శకుంతలమ్మనా"

"అవును... ఏం బావులేదా?"

"ఆమెను మా అన్నకు ఇవ్వాలని అనుకుంటున్నారు"

"అంతేకాదు... బలరామయ్య మేనకోడల్ని కూడా ఇవ్వాలని ప్రయత్నం చేశారు. అయినా మా ప్రయత్నాలు ఫలించవని మొన్నటికి తెలిపోయింది. సంజీవయ్య దామోదరం తెచ్చిన సంబంధాల్లో చేసుకోవాలని అనుకున్నాడట మీ అన్నయ్య"

"మా అన్నయ్యకు ఇస్తామన్న అమ్మాయిని నేను చేసుకోవడం ఏం న్యాయం!"

"మేం ఇవ్వాలని అనుకున్నాంగానీ, మీ అన్నయ్య చేసుకోవాలని అనుకోలేదుగదా!"

"అమ్మాయి కూడా నన్ను చేసుకోవడానికి ఒప్పుకోవాలి గదా?"

"అలారా దారికి... నువ్వు 'సరే'నను మిగతా కథ అంతా నేను నడుపుతాను" అన్నాడు లింగరాజు ఉత్సాహంగా.

"మా అన్న కంటే ముందు నేను పెళ్లిచేసుకోవడం బావుంటుందా?"

"ఏందోయ్ వెర్రోడా? నువ్వు చదువుకోలేదని మీ అన్న చదువు మానేశాడా? నువ్వువ్యవసాయం చేస్తున్నావని మీ అన్న వ్యవసాయం చేస్తున్నాడా? ఎవరి బతుకువాడిది, ఎవడి సౌకర్యం వాడిది" అన్నాడు లింగరాజు.

"మీఇష్టం" అన్నాడు భుజంగం ముక్తసరిగా.

"ఆ... ఆ మాట మీద ఉండు" అంటూ లేచి గబగబ వెళ్లిపోయాడు లింగరాజు.

★ ★ ★

రామాలయం పచ్చతోరణాలతో కళకళలా

డుతోంది. ప్రతి పూర్ణిమనాడు రామాలయంలో భక్తులు సమావేశమవుతారు. ఆరోజు సమావేశానికి స్వామి వేంకటానందులు వచ్చినందువల్ల భక్తులు అధిక సంఖ్యలో హాజరవుతారని అనుకుంటున్నారు. ఏడుగంటలకే భక్తులు రాసాగారు. లింగరాజు, బలరామయ్య అందరికంటే ముందు హాజరయ్యారు.

"స్వామీ... మన సంఘం స్థాపించినప్పటి నుండి, ప్రతి సమావేశంలోనూ గీతా పారాయణం, పురాణ పఠనం, ఆధ్యాత్మిక ఉపన్యాసాలతో కాలం గడుపుతున్నామే కాని, మన సూత్రాలకు కార్యరూపం కలిగించలేకపోతున్నాం" అన్నాడు లింగరాజు.

"అవును... పదినీతులు చెప్పడం కంటే ఒక నీతి ఆచరించడం మంచిదే" అన్నాడు స్వామి.

"ఆచరించి, అమలు జరిపే సమయం ఆసన్నమయింది స్వామీ!" అన్నాడు బలరామయ్య.

"ఏంచేయాలని అనుకున్నారు?" అడిగాడు స్వామి.

"పెళ్లిచేయాలని అనుకున్నాం స్వామీ!" అన్నాడు లింగరాజు.

"పెళ్లా... ఎవరికి?" ప్రశ్నించాడు స్వామి.

"దిక్కులేనివారికి" అన్నాడు లింగరాజు.

"దిక్కులేనివాళ్లు దేశంలో ఎంతోమంది ఉంటారు. ఫలానా వ్యక్తికి చేయాలని నిర్ణయించుకోవాలిగా!" అన్నాడు స్వామి.

"భుజంగమని ఈ ఊళ్లో ఒక యువకుడున్నాడు. అతనికి చేయాలని అనుకున్నాం"

"మన సంఘసభ్యులందరికీ చెప్పారా?"

"ఇంకా చెప్పలేదు, మీతో ఆలోచించిన తరువాత చెప్పాలని అనుకున్నాం"

"అమ్మాయిని చూడాలిగా?"

"రెడీగా ఉంది స్వామీ!"

"దిక్కులేని అమ్మాయేనా?"

"సుబ్బయ్య కూతురు స్వామీ"

"సుబ్బయ్య కూతురు దిక్కులేని అమ్మాయా?"

"సంభాషణ ఓ కొలిక్కి రాకనే సుబ్బయ్య వచ్చాడు. స్వామికి నమస్కరించి కూచున్నాడు. భక్తులు ఒక్కొక్కరే వచ్చి, స్వామికి నమస్కరించి కూచోసాగారు.

"మొదట ఉన్న ఉత్సాహం లేదు మనవాళ్లలో" అన్నాడు స్వామి.

"పనుల కాలం కద స్వామీ, శనగచేట్లలో పడి సతమతమవుతున్నారు"

"పనులున్నాయని అన్నం తినడం మానుకున్నారా సుబ్బయ్యా! అన్నం తినడం, నీళ్లు తాగడం ఎంత అవసరమో స్వామిని స్తుతించడం కూడా అంత అవసరమే. స్వామి స్మరణ ఆహార పానీయాలతో పోల్చడం కూడా సరికాదు. ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో పోల్చాలి" అన్నాడు స్వామి.

సుబ్బయ్యను అడగమన్నట్లు సైగచేశాడు లింగరాజు.

సమస్య సరిగా అర్థంకాలేదు స్వామికి. అడగమని సారెసారెకు సైగ చేస్తున్నాడు లింగరాజు. ఏమని అడగాలో పాలుపోక, "సుబ్బయ్యా, అమ్మాయి వయసెంత?" అన్నాడు స్వామి.

"ఎవరమ్మాయికి స్వామీ?"

"మీ అమ్మాయికే... ఇతరుల ప్రసక్తి మనకెందుకు?"

"పందొమ్మిది దాటిందనుకుంటా స్వామి"

"పెళ్ళిచేయలేదా?" అన్నాడు స్వామి.

అమ్మాయి పెళ్లి గురించి తనకు, లింగరాజుకు జరిగిన సంభాషణ సుబ్బయ్య మనసులో ఇంకా మెదులుతూనే ఉంది. ఇప్పుడు స్వామి పక్కన కూచుని సైగచేస్తున్న లింగరాజును గమనించకపోలేదు. లింగరాజు ప్రవర్తనతో చిర్రెత్తింది.

"ఇదేం ఆధ్యాత్మిక సమావేశమా లేక మ్యారేజ్ బ్యూరోనా?" అన్నాడు సుబ్బయ్య కోపంగా.

"కోపగించుకోకు సుబ్బయ్యా! ఈడొచ్చిన అమ్మాయికి పెళ్లిచేయాలని అనడం తప్పా?" అన్నాడు స్వామి.

"సన్యసించిన మీకు సంసారం గొడవలెందుకు స్వామీ? లింగరాజు ప్రభావానికి లోబడినవాళ్లంతా పతనమయిపోతున్నారు. ఇలాగే పెళ్లి సంబంధాలు చూడ్డంలో శ్రద్ధచూ





పిన ఓ స్వామికి వివాహానందులు అని పేరు పెట్టారట'' అన్నాడు సుబ్బయ్య.

''నన్ను తలుచుకోనిదే నీకు కూడు దిగదు'' అన్నాడు లింగరాజు.

''నువ్వు చెప్పకపోతే మా అమ్మాయి పెళ్లితో స్వామికేం అవసరం?''

''స్వామికి నేను చెప్పానా?''

''చెప్పలేదా స్వామీ?'' నిలదీశాడు స్వామిని సుబ్బయ్య.

''చెప్పి చెప్పలేదని బుకాయించడం సబబుగాదు లింగరాజూ'' అన్నాడు స్వామి.

''మంచిచెడ్డల విచక్షణాజ్ఞానం లేనప్పుడు చేసిన తప్పులు మళ్ళీ చేయగూడదని అరిషడ్వర్గాలకు దూరంగా ఉంటూ ఇంద్రియాలనే గుర్రాల్ని అదుపులో ఉంచాలని ఆధ్యాత్మిక చింతన పెంపొందించుకోవాలని, రజస్తమో గుణాల్ని వదిలించుకొని సత్వగుణం పెంపొంధించుకోవాలని, సత్సాంగత్యంలో సమయం గడపాలని భక్తసమాజం ఏర్పాటు చేసుకున్నాంగాని కక్షసాధింపులు, ప్రతీకారచర్యలకు ప్లాన్లు వేయడానికి గాదు'' అన్నాడు సుబ్బయ్య ఆవేదనగా.

''ప్లాన్లు ఎవరు వేస్తున్నారు?'' మండిపడ్డాడు లింగరాజు.

''శ్రీనివాసులు నీ కుమార్తెను చేసుకోలేదని అతనిమీద ప్రతీకారం తీర్చుకోవడానికి నీకు అనుకూలమయిన అమ్మాయిని భుజంగానికి ఇవ్వాలని ఆలోచిస్తున్నావు. శ్రీనివాసులు మీ అమ్మాయిని కాదని మా అమ్మాయిని చేసుకుంటాడేమోనని ఏవో ఎత్తులు వేస్తున్నావు. మనసులో మార్పు రాకుండా వేషం మార్చుకుంటే ఏంప్రయోజనం?'' అన్నాడు సుబ్బయ్య.

''అందుకేనయ్యా, 'తలలు బోడులయిన తలపులు బోడులా?' అన్నాడు వేమన'' అన్నాడు స్వామి.

''ఆ విషయం అంతటితో వదిలేయండి స్వామీ! ఆధ్యాత్మిక విషయాలు చెప్పండి'' అన్నాడు బలరామయ్య.

''దేన్ని గురించి చెప్పమంటారు?'' అడిగాడు స్వామి.

''భక్తుల్లో చాలామంది రుద్రాక్షలు ధరిస్తారు కదా, వాటి ప్రాముఖ్యత గురించి చెప్పండి స్వామీ!'' అన్నాడు సుబ్బయ్య.

''మంచి ప్రశ్నే అడిగాడు సుబ్బయ్య. రుద్రాక్షల ధారణ, వాటి ప్రాముఖ్యత గురించి తెలుసుకొనే ముందు రుద్రాక్ష అంటే ఏమిటి, అది ఎలా పుట్టింది అనే విషయం తెలుసుకోవాలి'' అన్నాడు స్వామి.

''అవును స్వామీ... చెప్పండి చెప్పండి'' అన్నారు భక్తులు.

''అక్షి అంటే కన్నుగదా? రుద్రుని కళ్ల నుండి ఉద్భవించినందువల్ల రుద్రాక్ష అని పేరు వచ్చింది''

''రుద్రాక్షలు రుద్రుని కళ్లనుండి ఉద్భవించాయా స్వామీ?'' అడిగాడు ఓ భక్తుడు.

''అవును... త్రిపురాసురులను సంహరించుటకు రుద్రుడు కళ్లు మూసుకోగా ఆయన కళ్లనుండి నీటిబిందువులు భూమిపైబడెను. అలా పడిన కన్నీటి బిందువులే రుద్రాక్షలు అయ్యేను'' అన్నాడు స్వామి.

''రుద్రాక్షలన్నీ ఒకేరకంగా ఉంటాయా లేక వేరువేరుగా ఉంటాయా స్వామి?'' అడిగాడు సుబ్బయ్య.

''అన్నీ ఒకేరకంగా ఉండవు. వేరువేరు పరిమాణాల్లో ఉంటాయి. ఆమలకం (ఉసిరిక) పరిమాణం కల రుద్రాక్ష ఉత్తమమైనది. బదరీ ఫలం పరిమాణం కలది మధ్యమము, శనగగింజ పరిమాణం కలది అథమం. అలాగే స్వతఃసిద్ధంగా రంధ్రంగల రుద్రాక్ష ఉత్తమమయినది. మానవులు రంధ్రం వేసిన రుద్రాక్ష అథమము''

''రుద్రాక్షలను మన ఇష్టప్రకారం ధరించవచ్చునా లేక నియమం ఏదయినా ఉందా స్వామీ?'' అన్నాడు బలరామయ్య.

''సంఖ్యను బట్టి ఫలితం చెప్పారు. వెయ్యి పూసలు ధరిస్తే ఉత్తమం. అయిదు వందల పూసలు ధరించిన మధ్యమము. మూడువందలు అంతకంటే తక్కువ ధరించిన నికృష్టం.''

''మనం వైష్ణవ భక్తులం కదా, శైవ సంప్రదాయానికి సంబంధించిన చర్చ ఎందుకు చే




యడం?'' అన్నాడు ఓ భక్తుడు.

''తెలియని విషయాలు తెలుసుకోవడం తప్పా?'' అన్నాడు సుబ్బయ్య.

''దేవుడు ఒక్కడే! ఆ దేవుని చేరుకోవడానికి ఏర్పడిన మార్గాలే మతాలు. అసలు విషయం అర్థంచేసుకోలేక మతం పేరిట కులం పేరిట వైరుధ్యాలు పెంచుకొని, మతకలహాల పేరుతో మారణహోమం జరుపుకోవడం మన సంకుచిత మనస్తత్వానికి తార్కాణం'' అన్నాడు స్వామి.

తరువాత ఎవరెవరికి తోచిన ప్రశ్నలు వాళ్లు అడిగారు. లింగరాజు మాత్రం నోరు మెదపలేదు. లింగరాజు కోపం తగ్గలేదన్న విషయం గ్రహించాడు స్వామి. మంగళం పాడిన తరువాత లింగరాజు, సుబ్బయ్య, బలరామయ్య తప్ప మిగిలిన వాళ్ళందరినీ వెళ్లమన్నాడు.

అందరూ వెళ్ళిన తరువాత, ''లింగరాజు గారూ...'' అన్నాడు స్వామి చిరునవ్వు నవ్వుతూ.

''ఏం స్వామీ?'' అన్నాడు లింగరాజు ముక్తసరిగా.

''మనం భక్తసంఘం ఎందుకు స్థాపించుకున్నాం?''

''భగవన్నామస్మరణ చేసుకోవడానికి''

''భగవన్నామస్మరణ ఎందుకు చేసుకోవాలి?''

''పాప ప్రక్షాళన చేసుకోవడం కోసం''

''అంటే మనకు అంటిన పాపం అనే బురదను భగవన్నామస్మరణ అనే నీటితో కడిగే ప్రయత్నం చేస్తున్నామన్నమాట... అవునా?''

''అవును స్వామీ!''

''బురదను గమనించక అడుగుపెట్టాం. పొరపాటు తెలుసుకొని కడుక్కున్నాం. కడుక్కోవడానికి నీళ్లు ఉన్నాయని మళ్లీ మళ్లీ బురదలో అడుగుపెట్టడం మంచిదా?''

''కాదు స్వామీ!''

''మంచిది కాదని తెలిసీ బురదలో దిగావు. దిగిన తరువాతయినా తప్పు తెలుసుకొని గట్టు మీదికి రావాలని ప్రయత్నిస్తున్నావా... లేదు. పూర్తిగా మునిగిపోవాలని చూస్తున్నావు'' అన్నాడు స్వామి.

లింగరాజు ఉలకలేదు, పలకలేదు.

''అరిషడ్వర్గాల్లో కోపానికి రెండో స్థానం ఇచ్చారు. అందుకే తనకోపమె తన శత్రువు అన్నాడు సుమతి శతకకర్త. కోపం వస్తే ఎవరయినా విచక్షణాజ్ఞానం కోల్పోతారు. అందుకే సాటి మనిషిని సైతం సులభంగా హత్యచేస్తారు. హత్య పర్యవసానమేమిటో ఆలోచిస్తే హత్య చేయలేరు. అయితే ఆలోచించనివ్వదు కోపం. నీవు ఒక్కనివే కోపిష్టివని, మాలో ఎవరికీ కోపం లేదని అందరి తరపున వకల్తా పుచ్చుకొని మాట్లాడ్డం లేదు. సందర్భాన్నిబట్టి కోపం అందరికీ వస్తుంది. అయితే ఆ కోపం ఉత్తమునిలో క్షణకాలం ఉంటుంది. మధ్యమునికి రెండు ఘడియలు, అధమునికి జీవితపర్యంతమూ ఉంటుందన్నారు పెద్దలు. సుబ్బయ్య చెప్పిన మాటలు వాస్తవమయితే నీకు కోపం రావలసిన అవసరం లేదు. శ్రీనివాసులు నీ కుమార్తెను చేసుకోలేదన్న కోపంతో అతనిమీద కక్షసాధించాలని అనుకున్నావు కదూ? నీలాగే అందరూ అతని మీద కక్షసాధించాలన్న ఉద్దేశంతో తమ కుమార్తెలనో లేక తమ స్నేహితుల కుమార్తెలనో అతని తమ్మునికి ఇవ్వాలని అనుకున్నారనుకుందాం. భుజంగం ఎంతమందిని చేసుకుంటాడు? పోనీ సుబ్బయ్య కుమార్తెకు బదులు మీ కుమార్తెనే భుజంగానికి ఇచ్చి పెళ్ళిచేయొచ్చుగదా? ఎందుకు ఇవ్వలేదు మరి? అబ్బాయి నీకు నచ్చలేదన్నమాట. నీకు నచ్చినా అమ్మాయికి నచ్చకపోతే చేసుకుంటుందా? అలాగే తన జీవితభాగస్వామిని ఎన్నుకునే విషయంలో శ్రీనివాసులుకు స్వేచ్ఛలేదంటారా? మీకు ఎలాంటి చెడుపు తలపెట్టని వ్యక్తిపట్ల కక్ష పెంచుకోవడం మొదటి తప్పు. నీ స్వార్థసిద్ధి కోసం సుబ్బయ్యను రంగంలోకి ఈడ్చటం మరో తప్పు. భుజంగం మీది ప్రేమతో పెళ్లి చేయాలని అనుకుంటున్నావా... మనస్సాక్షిగా చెప్పు'' అన్నాడు స్వామి.

నోరు మెదపలేకపోయాడు లింగరాజు.

''పశ్చాత్తాపమే చేసిన నేరానికి నిష్కృతి. సుబ్బయ్యా, లింగరాజు పశ్చాత్తాప పడుతున్నాడు. ఇతనిమీద కసిపెట్టుకోకుండా ఎప్పటిలా స్నేహంగా మసలుకో'' అన్నాడు స్వామి.



"చిత్తం స్వామీ!" అన్నాడు సుబ్బయ్య.
"ఇద్దరూ చేతులు కలుపుకోండి"

సుబ్బయ్య, లింగరాజు పరస్పరం చేతులు కలుపుకున్నారు.

★ ★ ★

ప్రశాంతంగా ఉన్న భుజంగం మనను అనే సరస్సులో పెళ్ళి అనే రాయి విసరి కల్లోలం కలిగించాడు లింగరాజు.

అరుగు మీద కూచొని వేపచెట్టుకేసి చూస్తున్న భుజంగం దృష్టిని కొమ్మ మీద కూచొని పరస్పరం ముక్కులతో ముచ్చటించుకున్న పావురాల జంట ఆకర్షించింది. వాటి సరస సల్లాపాలు అనే తుఫాను సరస్సును తాకి ఆలోచనలు అనే అలలను రేపింది. పెళ్ళి వయసొచ్చినా పెళ్ళిపెడాకులూ లేకుండా ఒంటరిగా ఉసూరుమంటూ ఎన్నాళ్లు గడపాలి! ప్రతివాడూ తన అన్నగారికి పెళ్ళి సంబంధం తెచ్చేవాడేగాని, తన పెళ్ళి గురించి ప్రస్తావించే మనిషే లేడు. ఆ ఆలోచన ఒక్క లింగరాజుకు కలిగిందంటే భగవంతుని దయ అనుకోవాలి. లింగరాజు అంతస్తు ఎక్కడ తన అంతస్తు ఎక్కడ. సంబంధమయితే తెచ్చాడుగానీ, అది కుదురుతుందన్న ఆశలేదు. అమ్మాయి బి.ఎ. చదువుతోంది. తను ఐదో తరగతి రెండోసారి పాసయ్యాడు. స్కూలుకు సరిగా హాజరుకాలేదని ఒక సంవత్సరం ఫెయిల్ చేశాడు హెడ్మాస్టరు. పోనీలే చదువుతో ఏం..? చదువురాని వాడివని దిగులు చెందకు... అంటుంది. అదేదో సినిమాలో... అది సినిమా... చదువుకున్న శకుంతల చదువురాని తన్ను చేసుకుంటుందా? అప్పుడప్పుడు 'బావా' అంటుంది. అప్పుడెప్పుడో అంటూ ఉండేది.. మా అన్నయ్యకు ఇవ్వాలని అనుకున్న తరువాత అనలేదు.. నువ్వు ఊఁ అంటే శకుంతల నీ పెళ్ళాం అవుతుంది అన్నాడు లింగరాజు.. ఆయనకు నా మీద అభిమానం ఎందుకు కలిగిందో మరి...! అందరూ తమ పిల్లల్ని ఉద్యోగస్తులకు ఇవ్వడానికి పోటీపడుతూ ఉంటే ఆయనకు అసహ్యం కలిగింది కాబోలు.. నిజమేగా మరి...! లోకంలో అందరికి చదువుకున్న అల్లుళ్ళే కావాలంటే సాధ్యమయ్యే పనేనా... లింగరాజులాంటి పరోపకారులు కొంతమంది అయినా లేకపోతే మాలాంటివాళ్ళను మాట్లాడించేవాళ్ళు ఎవరుంటారు?

"అన్నయ్యున్నాడా భుజంగం?" అన్న ప్రశ్న అతని ఆలోచనా స్రవంతిని తెంచేసింది. ప్రవాహం ఆగిపోయింది. తిరిగి చూశాడు భుజంగం. అప్పటికే తన వద్దకు వచ్చిన రామలింగం ఇంట్లోకి తొంగి చూస్తున్నాడు.

'నేను మనిషిని కాదా' అనాలనుకున్నాడు కానీ, అనలేక, "లేడు బావా!" అన్నాడు భుజంగం. ఎవడొచ్చినా అన్నను అడిగేవాడేకాని, తన్ను పలకరించేవాడు లేడు అనుకున్నాడు మనసులో.

"అనంతపురం నుండి రాలేదా?" అడిగాడు రామలింగం.

శ్రీనివాసులు స్పాట్ వ్యాల్యుయేషనుకు వెళ్ళిన నాలుగు రోజులకు అత్తగారింటికి వెళ్ళిన రామలింగం రాత్రి తొమ్మిదిగంటల తరువాత సతీసమేతంగా తిరిగి వచ్చాడు. అందుకే ఉదయమే ఊడిపడ్డాడు శ్రీనివాసులు యోగక్షేమాలు తెలుసుకొని తన ప్రయాణ విశేషాలు తెలియజేయడానికి.

"వచ్చాడు కానీ, ప్రొద్దున్నే కదిరికి వెళ్ళాడు" అన్నాడు భుజంగం.

"సాయంత్రం వస్తాడా?"

"మధ్యాహ్నానికే రావచ్చు. ఏదో స్కూలు పని మీద వెళ్ళాడు ఏం అన్న లేకపోతే నాతో మాట్లాడగూడదా? కూచో బావా!" అన్నాడు ఆప్యాయంగా.

అరుగు మీద కూచోబోయాడు రామలింగం.

"వద్దు బావా, ఇంట్లోకి వెళ్దాం పద!" అన్నాడు భుజంగం.

ఇంట్లోకి వెళ్ళారు.

"కుర్చీలో కూచో- కాఫీ చేస్తా"

"నేను కాఫీ తాగనుగా! ఏమీ వద్దురా!"

"ఉండు బావా, పాలు కాచి తెస్తాను" అంటూ స్టౌ వెలిగించాడు భుజంగం.

కుర్చీలో కూచొని, టేబుల్ మీద ఉన్న పుస్తకం తీసుకొని పేజీలు తిప్పసాగాడు రామలింగం.

పాలు తెచ్చి, "తాగు బావా!" అంటూ




ఇచ్చాడు భుజంగం.

"అన్నీ హిందీ పుస్తకాలే, మనం చదివే పుస్తకాలే లేవు" అన్నాడు రామలింగం.

"మనకెందుకులే పుస్తకాల గొడవ. ఈమధ్య ఎనిమిది రోజులనుండి కనిపించడమే లేదే, అన్న లేకపోతే రాకూడదా? నేను మనిషిని కాదా బావా?" అన్నాడు.

"అదేంటోయ్ అలా అంటావు. నేను ఊళ్ళో లేను- రాత్రి వచ్చాను"

పోనీలే బావా, ఏదో అన్నాను కోపగించుకోకు. వచ్చినవాళ్ళంతా అన్నతో మాట్లాడుతారు కానీ, నాతో ఎవరూ మాట్లాడరు. అందుకే కోపమొచ్చి అలా అన్నాను"

"తల ఉండగా మోకాలికి పూజ చేయడం ఎందుకు అనుకున్నారేమో! అయినా నేను అప్పుడప్పుడు మాట్లాడుతూనే ఉన్నాగా?" అన్నాడు అనునయంగా.

"పోనీలే బావా, అన్నగారి పెళ్ళి సంగతి ఏమయింది?"

"ఇంట్లో మనిషికి తెలీకపోతే పరాయివానికి నాకు తెలుస్తుందా?"

"అమ్మాయిల తల్లిదండ్రులందరూ నిన్నే మధ్యవర్తిగా పెట్టుకున్నారు గదా! నీకు తెలియకపోతే ఇంకెవరికి తెలుస్తుంది?"

"అందరూ అలాగే అనుకుంటారు కానీ, మీ అన్నగారు మాత్రం ఇంతవరకూ ఏ విషయమూ ఇదమిద్ధంగా తేల్చి చెప్పలేదు"

"పోనీలే బావా, సుబ్బయ్య కూతురు విషయంలో ఏంచెబుతున్నాడు?"

"సుబ్బయ్య కూతురు విషయంలోనే కాదు, అందరి విషయంలోనూ ఒకే సూత్రం అవలంబిస్తున్నాడు. ఎన్ని మాటలు మాట్లాడినా పెళ్ళి విషయం ప్రస్తావించేసరికి ముభావంగా ఉంటున్నాడు. నేను ఊళ్ళోలేని సమయంలో సంజీవయ్య, దామోదరంగార్లు కొత్త సంబంధం తెచ్చినట్లు తెలిసింది. అందుకే ఖచ్చితంగా అడిగి అమీతుమీ తేల్చుకుందామని వచ్చాను" అన్నాడు రామలింగం.

"అంతే బావా, అదే మంచిది. నీళ్ళలో ఎనుమును తోలుకొని నీకా నాకా అనుకుంటూ ఉంటే లాభం లేదు. తాడోపేడో తేల్చుకోవడమే మంచిది" అంటూ కాసేపు ఆగి, ఊపిరి పీల్చుకొని, " ఓ ప్రశ్న అడగాలని అనుకుంటున్నా బావా!" అన్నాడు భుజంగం తడబడుతూ.

"ఒకటేమిటి....వంద ప్రశ్నలడుగు, తెలిస్తే జవాబు చెబుతా"

"జవాబు తెలీని చిక్కు ప్రశ్నలేం కాదులే"

"అయితే అడుగు"

"శకుంతల గురించి నీ అభిప్రాయం చెప్పు"

"ఏ శకుంతల?"

"సుబ్బయ్య కూతురు"

"అప్పుడే చెప్పానుగా"

"అదికాదులే... నావిషయం" అన్నాడు గుక్కిళ్ళు మింగుతూ.

"శకుంతలేంటి, నీ విషయమేంటి?" అన్నాడు అర్థంకాక.

"ఆ... అదే... ఏం... లేదు... అహ... ఏం లేదు...లే...!"

"అదేంటోయ్- మరీ ఆడపిల్లలా సిగ్గుపడి పోతున్నావ్?"

"సిగ్గేస్తోంది మరి... శకుంతల్ని నాకు ఇప్పిస్తానన్నాడు" అన్నాడు ఎలాగో ధైర్యంచేసి.

"ఎవరు?"

"లింగరాజు"

"ఎవరితో చెప్పాడు?"

"నాతోనే చెప్పాడు"

"నువ్వు వాళ్ల ఇంటికి వెళ్లావా?"

"లేదు... ఆయనే మా ఇంటికి వచ్చాడు"

"మీ అన్న లేడా?"

"లేడన్నానుగా"

"ఇప్పుడుగాదు... లింగరాజుగారు మీ ఇంటికి వచ్చినప్పుడు"

"లేడు... స్కూలుకు వెళ్లాడు"

"నీ పెళ్లి విషయం మీ అన్నతో ప్రస్తావించాలిగదా? నేరుగా పెళ్లికొడుకుతోనే చర్చిస్తారా ఎవరయినా? అందులోనూ మీ అన్నకు ఇవ్వాలని అనుకుంటున్న అమ్మాయిని నీకు ఇప్పిస్తాననడం విచిత్రంగా ఉంది. అన్న దమ్ము



లకు పేచీ పెట్టడానికి ఏదో ఎత్తువేశాడు. భక్తసంఘంలో చేరి వేషం మార్చుకున్నాడు గానీ బుద్ధి మారలేదే"

"నేనూ అదే మాట అన్నాను"

"ఏమన్నావు?"

"మా అన్నకు ఇస్తామని అంటున్నారుగదా- అదే అమ్మాయిని మీరు నాకు ఇప్పిస్తామంటున్నారే? అన్నాను"

"ఏమన్నాడు మరి?"

"ఎవరి బతుకువాళ్లది అన్నాడు"

"అక్కడే ఉంది తిరకాసు. మీలో మీకు భేదాభిప్రాయం కలిగించడానికి విషబీజం నాటాడన్నమాట"

"అందుకే నీతో ఆలోచించాను. ఈ సంగతి మా అన్నయ్యతో చెప్పవు బావా!"

"ఎందుకు చెబుతా... దాచుకోకుండా నాకు చెప్పి మంచిపని చేశావు. ఇలా తగాదాలు పెట్టే వాళ్ల విషయంలో అప్రమత్తంగా ఉండాలి. అయినా లింగరాజుగారి స్వభావం గురించి నేను ఎందుకు చెప్పాలి? నిదానంగా

నీకే తెలుస్తుంది- వెళ్లొస్తామరి'' అంటే లేవబో తూండగా బజార్లో శ్రీనివాసులు కనిపించాడు.

''మీ అన్న వస్తున్నాడు''

''భద్రం- చెప్పేవు బావా'' అంటూ మరోమా రు హెచ్చరించాడు భుజంగం.

''ఎప్పుడొచ్చావేయ్ ఊరినుంచి?'' ఇంట్లో అడుగుపెడుతూనే అడిగాడు శ్రీనివాసులు. లేచి మెల్లగా బయటికి వెళ్లాడు భుజంగం.

''రాత్రి వచ్చా బావా?'' అన్నాడు రామ లింగం.

''నేను అనంతపురంనుంచీ రాగానే మీ ఇంటికి వెళ్లాను. వేలాడుతున్న తాళం కప్ప స్వాగతం పలికింది. నువ్వు అత్తగారి ఊరికి వెళ్లినట్లు పక్కింటివాళ్లు చెప్పారు''

''స్పాట్‌వాల్యుయేషన్ విశేషాలు ఏమయినా ఉన్నాయా?''

''ఏం చెప్పమంటావు... అదో మాయాబజా రు. ఎన్ని ఆన్సరు బుక్కులు చూస్తున్నామని లెక్కవేసుకోవడంలో ఉన్న ఆసక్తి జవాబులకు విలువ కట్టడంలో కనిపించడంలేదు. మొక్కు బడి చెల్లిస్తున్నట్లు రెడ్డింకుతో అక్కడ రెండు అక్కడ రెండు టిక్కులు కొట్టి ముప్పయి శాతానికి తగ్గకుండా నలభై నలభై అయిదు శాతానికి ఎక్కువగాకుండా మార్కులు వేయడం వాల్యుయేషను అవుతుందా? జవా బు చూడకనే ముందుగా మార్జనులో మార్కు లువేసి, తరువాత టిక్కులు, అండరులైన్లు వేసే ఎగ్జామినర్లు కూడా ఉన్నారంటే అతిశయో క్తికాదు. అయితే అందరూ అలాంటివాళ్లే అని అనలేను. పేపర్లసంఖ్య తక్కువయినా ఫరవా లేదు, సక్రమంగా చూడాలనే ఎగ్జామినర్లు కూడా లేకపోలేదు. ఆన్సరు స్క్రిప్ట్సు తీసుకు న్న అర్థగంటకే మార్కులువేసి చీఫ్ ఎగ్జామిన రుకు వాపసు ఇచ్చే అసిస్టెంటు ఎగ్జామినర్లు ఉన్నారంటే ఆశ్చర్యం కాదా? అలాంటివాళ్లు ఆలస్యంగా ఇచ్చేవాళ్లను చేతగానివాళ్లకింద జమకడతారు'' అన్నాడు శ్రీనివాసులు.

''నాకు తెలీని విషయాల గురించి అడగ డమే పొరపాటు. ఈమధ్య పెళ్లి సంబంధాలు వచ్చాయట- నిజమేనా?''

''కొత్తగా సంబంధాలు రాలేదుగానీ అవసర మయితే తెస్తామన్నారు''

''ఎవరు... మీ చిన్నాన్నగారేనా?''

''అవును... నీకెలా తెలుసు? సర్వాంతర్యా మిలా ఉన్నావే?''

''ఇది పల్లెటూరు అని తెలియదా?''

''పల్లెటూళ్లలో వార్తల ప్రచారం సులభంగా జరుగుతుందన్నమాట''

''ఏమీ అనుకోనంటే ఓ మాట అడుగుతా''

''విచిత్రంగా మాట్లాడుతున్నావే?''

''లోగడ వచ్చిన సంబంధాల విషయంలో ఏం నిర్ణయించుకున్నావు?''

''ఇప్పుడే ఏమీ చెప్పలేను''

''నెలల తరబడి ఏమీ చెప్పకపోతే ఆడ పిల్లల తల్లిదండ్రులు ఎన్నాళ్లని ఎదురుచూ స్తారు?''

''ఎదురుచూడమని అంటున్నామా?''

''సరే... నీ ఇష్టం నీ గురించి ఇప్పటికే రకరకాల వదంతులు ప్రచారం అవుతు న్నాయి. వెళ్లొస్తా బావా...! అంటూ చివాలున లేచాడు రామలింగం.

''చాలారోజుల తరువాత కలిశాం, మర్యా దలేం వద్దా?''

''అన్నీ అయినాయి''

''కోపమొచ్చిందా?'' అన్నాడు శ్రీనివాసులు నవ్వుతూ.

''పేదవాని కోపం పెదవికి చేటు అన్నారు పెద్దలు''

''అదేంటోయ్- అదోరకంగా మాట్లాడుతు న్నావు?''

''అంతకంటే ఏం చేయగలను బావా? మళ్లీ మాట్లాడదాం... వెళ్లొస్తా'' అంటూ బయ ల్దేరాడు రామలింగం.

''సరే... వెళ్లిరా- నేనూ స్కూలుకు వెళ్లాలి'' అంటూ లేచాడు శ్రీనివాసులు.

★ ★ ★

''నీ గురించి రకరకాల వదంతులు ప్ర చారం అవుతున్నాయి'' అన్న రామలింగం మాట మననం చేసుకొని ఆలోచించసాగాడు శ్రీనివాసులు. మనసును మహాసముద్రంతో పోల్చవచ్చు. సముద్రంలో తరంగాలు లేచిన




ట్లే మనసులో ఆలోచనలు రేగుతూ ఉంటాయి. అందుకేనేమో చింతలేని మనిషి సంతలేని దినము లేదన్నారు. మనసు నడకను చైతన్య స్రవంతి అన్నారు. వేగాన్ని వాయువు, శరము, కాంతి, మనసుతో పోల్చారు. మనోవేగాన్ని మించిన వేగం మరోటిలేదు. మనసు కోతి లాంటిదన్నారు. అంటే నిలకడగా ఉండదన్న మాట. ఒక్కోమాట తుఫానులా మనసును అల్ల కల్లోలం చేస్తుంది. యోచింపచేస్తుంది. చింతింపచేస్తుంది. వ్యాకులత కలగచేస్తుంది. నిద్రలేకుండా చేస్తుంది. భావుకునికి మరీ బాధ కలగజేస్తుంది. ఆలోచించే మనిషికి అనుమానాలు ఎక్కువ. ఎవరేమనుకుంటే నాకేం అని ధైర్యంగా ఉండాలని అనుకుంటా డు. మనసు గట్టిచేసుకుంటాడు. అంతలోనే మళ్లీ సందేహం... ఏ వదంతి ఏం ప్రమాదం తెస్తుందోనన్న భయం... తను తప్పు చేయ నంత వరకూ వదంతులు ఏమీచేయలేవు. ఏమో... ఎలాంటి వదంతులు ప్రచారం చేస్తా రో... మనుమలు నేలమీద నడిస్తే వదంతులు గాలిలో ఎగురుతాయి. ఆలోచిస్తూ అన్యమన స్కంగా నడుస్తున్న శ్రీనివాసులుకు విమలమ్మ ఇల్లు కనిపించింది. ఆమెను మాట్లాడించి వెళ్దామా అనుకున్నాడు. రాత్రయింది ఇప్పు డెందుకులే అనుకొని ముందుకు సాగాడు. పోతూ పోతూ అటు చూశాడు. విమలమ్మ ఏకాంతంగా కూచొని ఏదో రాసుకుంటోంది. ఎన్నాళ్లనుంచో అనుకుంటున్నాడు - ఆమెతో ఏకాంతంగా మాట్లాడాలని. ఇంటిముందు వెళ్తూ వెళ్తూ ఓ అడుగు అటువేస్తేఏం? ఆలోచి స్తూనే ముంగిట్లోకి వెళ్లాడు. ''ఏం చేస్తున్నారు మేడమ్?'' అన్నాడు బయట నిల్చొని... సమయం కాని సమయం... అదీ రాత్రి సమ యంలో ఎందుకొచ్చాడో... రమ్మనడమా, వద్దన డమా సందేహం కలిగింది విమలమ్మకు. పరా యివాడు కాదు తన కొలీగ్ ఇంటిముందు నిలబడి మాట్లాడిస్తూ ఉంటే మాట్లాడకపో వడం సభ్యతకాదు. 'రండిసార్' అంటూ లేచి ఆహ్వానించింది విమలమ్మ.

''ఏదో రాస్తున్నారే?'' అన్నాడు నిల్చునే.

''కూచోండి సార్... లెసన్‌ప్లాను రాస్తున్నా ను...'' అంది. కూచున్నాడు.

ఏంసార్ ఇప్పుడొచ్చారే? అనాలని అను కుంది. నాలుక చివరవరకూ వచ్చిన మాటను బయటికి రానివ్వకుండా బలవంతంగా ఆపు కుంది.

''మీ రాకతో మా ఇల్లు పావనమయింది సార్'' అంది ఆనందంగా.

మీరు ఇంటికి రమ్మని పిలుస్తారేమోనని ఇన్నాళ్లు ఎదురుచూశాను. ఇక పిలవరని ఇల్లు చూడ్డానికి వచ్చాను అనాలని అనుకున్నాడు. కానీ, ''అలా వెళ్తూ ఉన్నాను, మీరు కనిపిస్తే ఇల్లు చూద్దామని వచ్చాను'' అన్నాడు శ్రీనివా సులు.

''మంచిపని చేశారు'' అని పైకి అంది కానీ, వేళకాని వేళ వచ్చిన మనిషి తన కొలీగ్ అయినా ఇరుగుపొరుగు అమ్మలక్కలు రకరకా లుగా ఆలోచించి, లేనిపోని ఆరోపణలుచేసి, విపరీతమయిన వదంతులు కల్పించినా ఆశ్చ ర్యంలేదు. అలా అని ఇంటికి వచ్చిన కొలీగ్‌ను నిర్దాక్షిణ్యంగా వెళ్లి పొమ్మనడం సభ్యతకాదు. ఏం చేయాలో పాలుపోక మవునంగా ఉండిపో యింది.

''ఏదో ఆలోచిస్తున్నట్టున్నారే?'' అన్నాడు ఆమెకేసి చూస్తూ.

''నేనేం ఆలోచించడంలేదు సార్, మీరు ఆలోచిస్తున్నారు కాబట్టి నేను ఆలోచిస్తున్నట్లు మీకు తోచింది''

''అవును మేడమ్... చాలాబాగా కనిపెట్టా రు. మనసు బాగులేదు'' అన్నాడు.

''ఏం సార్... ఏం జరిగింది?'' అంది ఆతు రత కనబరుస్తూ.

''ఆ... ఏముంది మేడమ్! మీగురించే...'' అన్నాడు పైకిచూస్తూ.

విమలమ్మ గుండె వేగం పెరిగింది. ఏమిటో ఈ మనిషి అయోమయంగా మాట్లాడుతున్నా డే... తన మనసు బాగులేదని మీగురించే అంటున్నాడే... తాగి వచ్చాడా...! ఎప్పుడూ తాగడు.... ఏమో మనిషి మర్మం నీళ్లలోతు తెలునుకోవడం కష్టం. నాగురించి ఈయనకు ఏంతెలుసు? తన వ్యక్తిగత విషయాలు ఇక్కడి వాళ్లకు ఎవరికీ తెలీవు. తెనుకోవాలన్న ఆసక్తి కూడా ఎవరికీ లేదు. స్కూల్లో కూడా నా వ్యక్తిగత విషయాల గురించి ఎప్పుడూ అడగలేదు.

మరి పనిగట్టుకొని ఇంటికి వచ్చాడంటే... అను కుంది తనలోతాను.

"నా గురించాసార్?" అంది అనుమానంగా.

"అవును మేడమ్... మన హెడ్మాష్టరుగారు ఎప్పుడూ మీగురించే ఆలోచిస్తూ ఉంటారు."

హెడ్మాష్టరుగారా? నా గురించి ఆలోచిస్తారా? ఏం ఆలోచిస్తారో... నాగురించి ఏమీ తెలియదే ఆయనకు! అనుకుంది మనసులో.

"నా గురించి ఆలోచిస్తారా సార్?" అంది.

"అవును మేడమ్"

"ఏం ఆలోచిస్తారు సార్"

"విమలమ్మ ఎప్పుడూ దిగులుగా ఆలోచిస్తూ ఉంటుంది మీకేమయినా తెలుసా అని రెండు మూడుసార్లు నన్ను అడిగారు మేడమ్"

నాగురించి ఆయనకెంత తెలుసో వీరికీ అంతే తెలుసు. తెలుసుకోవాలనుకుంటే డైరక్టుగా నన్నే అడగొచ్చుగా... ఏమిటో ఈ మగవాళ్ల మనసే అర్థంగాదు అనుకుంది.

"మీరేమన్నారు సార్?"

"మీగురించి ఏమీ తెలీనప్పుడు ఏమంటా మేడమ్! అందుకే మీగురించి తెలుసుకుందామని వచ్చా" అన్నాడు శ్రీనివాసులు.

నాగురించి తెలుసుకోవలసిన అవసరం ఏముందో పాపం? తెలుసుకొని ఏం చేస్తారు? ఆరుస్తారా తీరుస్తారా? ఒంటరిగా ఉన్న ఆడదాన్ని చూస్తే గత చరిత్ర తెలుసుకోవాలన్న తాపత్రయం ప్రతి మగాడి మనసును వేరు పురుగులా తొలుస్తూ ఉంటుంది కాబోలు. అదే ఒంటరి మగవాణ్ని గురించి ఎవరూ పట్టించుకోరు అనుకుంది తనలోతాను.

"మీరు తెలుసుకోతగ్గ విలువయిన సమాచారం ఏముంది సార్"

"పొద్దుపోక ఒబుసుపోకకు వచ్చానని తేలిగ్గా తీసుకోకు మేడమ్! మీ విచారానికి కారణం తెలుసుకొని చేతనయిన సహాయం చేయాలని అనుకున్నాం. మీరేమీ అనుమానించకండి. ఈ పాటికి నన్ను అర్థంచేసుకొనే ఉంటారు. చిన్నవయస్సులోనే జీవితపు లోతులను తరచి చూశాను. అర్థంచేసుకున్నాను. పాతికేళ్ల వయసుకే అరవై ఏళ్లు వయసున్న మనిషి పడని అగచాట్లు పడ్డాను. రకరకాల ఇబ్బందులను ఎదుర్కొన్నాను. ఇతరులు వేసిన ఎత్తులను పై ఎత్తులతో తిప్పికొట్టి అసాధ్యుడు అనిపించుకున్నాను. కష్టాలు అనుభవించిన మనిషికి కష్టాల్లో ఉన్న మనిషిమీద సానుభూతి కలగడం సహజం" అంటూ ఆపి ఆమె ముఖంలోకి చూశాడు.

తలదించుకొని మవునంగా కూచుంది విమలమ్మ.

"చెప్పండి మేడమ్" అన్నాడు శ్రీనివాసులు.

"ఏం చెప్పమంటారు సార్? మాకుటుంబ ఔన్నత్యాన్ని గురించి చెప్పమంటారా? మా తల్లిదండ్రుల గొప్పతనం గురించి చెప్పమంటారా? నా చదువును గురించి చెప్పమంటారా? నన్ను పతనోన్ముఖంగా ప్రేరేపించిన పరిస్థితులు గురించి చెప్పమంటారా? నా ఉద్యోగ జీవితం గురించి చెప్పమంటారా? దేన్ని గురించి చెప్పమంటారు?" అంది విమలమ్మ. సౌమ్యంగా మాట్లాడిన ఆమె ధోరణిలో ఆ వేగము, ఆవేదన కొట్టవచ్చినట్లు కనిపించాయి.

"అదికాదు మేడమ్... మీరు ఈ ఊరికి వచ్చినప్పటినుండీ మాకు తెలిసినంత వరకూ మీ ఇంటికి బంధువులు ఎవరూ వచ్చినట్లు లేదు- ఎవరూ లేరా?"

"అందరూ ఉన్నారు సార్! అయితే అమితమయిన ఆదర్శాలు ఆచరించబోయి, ఆ ప్రయత్నంలో మోసపోయి అందర్నీ పోగొట్టుకున్నాను"

"మీకేమి అభ్యంతరం లేకపోతే గత చరిత్ర అంతా చెప్పండి"

"మానుతున్న గాయాన్ని గోకి మళ్లీ పుండు చేసుకోవడం ఇష్టంలేదు సార్"

"చెప్పడానికి మీకు ఇష్టం లేకపోయినా తెలుసుకోవాలన్న ఆసక్తి నాలో ఉంది"

"తెలుసుకొని ఏం చేస్తారు సార్? సానుభూతి చూపించి ఓ నిట్టూర్పు విడుస్తారు, అంతేగా"

"నాది రాతిగుండె అనుకున్నారా?"

"అవన్నీ కథల్లో, నవలల్లో భాషా చమత్కారం చూపించడానికి రచయితలు, రచయిత్రులు రాసే చిలకపలుకులు, ఏ మనిషికీ రాతిగుండె ఉండదు. కానీ, దయాదాక్షిణ్యాలు లేకుండా క్రూరజంతుల్లా ప్రవర్తించే దుర్మార్గులు ఉన్నారు"

"మీ మాటే వాస్తవం అనుకుందాంలెండి. అయినా మీకు జరిగిన మోసమేమిటో చెప్పినందువల్ల మీకు నష్టం లేదుగా?"

"వద్దులెండి సార్, ఇప్పటికే కొన్ని జతల కళ్లు, చెవులు మనమీద మన మాటలమీద కేంద్రీకరించి ఉంటాయి"

"ఉండనీ మేడమ్, మనం తప్పు చేస్తేగదా భయపడాల్సింది"

"పరాయి మగాడు, పరాయి ఆడది- రాత్రి పూట కలుసుకుని మాట్లాడ్డమే సమాజం దృష్టిలో తప్పు"

"సమాజందేముంది మేడం, పరుగెత్తితే తరుముతుంది, ఎదిరిస్తే తోకముడుస్తుంది"

"మీకేం సార్, మగవాళ్లు"

"మీకు ఎలాంటి ఆపద వచ్చినా ఎదుర్కోడానికి వెనుకాడను. భయపడకండి"

"గతంలో ఇలాగే మోసపోయి అందరికీ దూరమయ్యాను"

"మగవాళ్లంతా మోసగాళ్లని అనుకోకండి. దయచేసి చెప్పండి"

"దయచేసి బలవంతం చేయకండి, ఎప్పుడయినా చెబుతాలెండి"

"మీ ఇష్టం. వెళ్లొస్తా మేడమ్" అంటూ లేచాడు శ్రీనివాసులు.

"ఉండండి సార్, మాటల్లోబడి మామూలు మర్యాద కూడా మరిచిపోయాను" అంటూ తనూ లేచింది విమలమ్మ.

"ఏమీ వద్దు మేడమ్, కాఫీ తాగనని తెలుసుగా"

"కాఫీ నేనూ తాగనుగదా సార్, కాస్త మిక్చరు తినండి" అంటూ లోపలికి వెళ్లింది విమలమ్మ.

టేబులుమీద ఉన్న పుస్తకం తీసుకుని పేజీలు తిరగేస్తూ కుర్చీలో కూచున్నాడు శ్రీనివాసులు.



గతం అనే తేనెతుట్టెను కదిలించి వెళ్లిపోయాడు శ్రీనివాసులు.

జ్ఞాపకాల తేనెటీగలు విమలమ్మ మస్తిష్కంలో జుమ్మున ముసురుకోసాగాయి. రాస్తున్న లెసన్ ప్లాను తీసి పక్కన పెట్టింది.

తన్ను గురించి తెలుసుకోవాలన్న వింత కోరిక శ్రీనివాసులుగారికి ఎందుకు కలిగిందో ఎంత ఆలోచించినా, తల బద్దలు కొట్టుకున్నా అర్థం కాలేదు. కలిసి మెలిసి పనిచేస్తున్నాం. అప్పుడప్పుడు స్టాఫ్ రూమ్‌లో ఇద్దరమే ఉంటాం. ఏవేవో మాట్లాడుకుంటాం. ఒకనాడూ తన వ్యక్తిగత విషయాల గురించి వాకబు చేయలేదు. స్పాట్ వ్యాల్యుయేషన్‌కు వెళ్లినప్పుడు ఎన్నోసార్లు ఇద్దరే కలుసుకున్నారు. అప్పుడూ అడగలేదు. ఉన్నట్లుండి అకస్మికంగా నా గురించి తెలుసుకోవాలన్న జిజ్ఞాస ఎందుకు కలిగిందో.

ఆయనకు ఒకరికే కాదు, హెడ్మాష్టరుగారికి కూడా కలిగిందట. తెలుసుకోమని వీరిని ప్రేరేపించింది వారేనట. లేడికి లేచిందే పరుగు అన్నట్లు అనుకున్నదే తడవుగా అప్పటికప్పుడే బయల్దేరారు. సమయం, సందర్భం లేకుండా రాత్రి సమయంలో వచ్చారు. ఊరికే ఉబుసుపోకకు రాలేదన్నారు. తెలుసుకోవాలన్న ఆసక్తితో వచ్చానన్నారు. అందరిలాంటి వ్యక్తి కాదన్న అర్థం వచ్చేలా మాట్లాడారు. ఏమిటో అర్థం

కాలేదు.

ఈ ఊళ్లో రచ్చబండ ఉందట. ఊళ్లో వార్తలన్నీ అక్కడికి చేరతాయట. మాకు జరిగిన సంభాషణ వాళ్లకు తెలుస్తుందా? తెలిస్తే మా గురించి అక్కడ రచ్చబండమీద చర్చిస్తారా?

పల్లెటూళ్లలో వార్తలు భలే చిత్రంగా వ్యాపిస్తాయి. అసలు వార్తకు ప్రచారమయ్యే వార్తకు సంబంధం ఉండదు. వార్తకు వదంతికి భేదం తెలియదు. సంభవమా... అసంభవమా అన్న ఆలోచన ఉండదు. గట్టిగా తుమ్మిన స్త్రీ ముక్కుపుడక ఊడిపోతే ఆ సంగతి రెండో ఆమె మూడో ఆమెకు చెబుతుంది. మూడో ఆమె సరిగా వినకనో లేక అద్భుతంగా ఉండాలనో ముక్కుపుడక బదులు ముక్కు ఊడిపోయిందని చెబుతుంది.

సాయంత్రానికల్లా ఆ వార్త చిలువలు పలువలు అవుతుంది. ముక్కులు ఊడిపోయే కొత్త జబ్బు వచ్చిందని ముగ్గురు ఆడవాళ్లకు ముక్కులు ఊడిపోయాయని ప్రచారం చేస్తారు. ఆడపిల్లలు పుష్పవతి కావడంలాంటి సామాన్య విషయం కూడా అసామాన్య వార్తల్లో చోటు చేసుకోవడం పల్లెటూళ్ల వింతధోరణికి మచ్చుతునక.

పల్లెటూరివాళ్లు ఒకనాడు ఉదారులు, పరోపకార పరాయణులుగా ఉండేవాళ్లట. ఈనాటి పల్లెవాసులు శకుని పాత్ర పోషించడంలో ఆరితేరారు. అభినవ నారదులుగా ప్రసిద్ధిచెందారు. సాటిమనిషి అష్టకష్టాలు పడుతూ విలవిల్లాడుతూ ఉంటే ప్రత్యక్షంగా సానుభూతి చూపుతూ పరోక్షంగా పరిహాసం చేస్తూ చాటుమాటుగా ఆనందిస్తారు. మనిషి మనస్తత్వమే అర్థం కావడంలేదు. సైకాలజీ చదువుకున్నా ఆ చిక్కుముడి విప్పలేకపోతోంది తను.

ఆదిమానవుడు అడవుల్లో నివసిస్తూ జంతువులా బతికాడని రాశారు. జీవపరిణామ సిద్ధాంతం ప్రకారం కోతి పరిణతి చెంది మానవుడుగా రూపొందిందని డార్విన్ సిద్ధాంతీకరించాడు. జంతుప్రవృత్తి ఈనాటికీ మనిషిలో లేకపోలేదు. సంస్కారం, సభ్యత ముసుగులో దాగి పైకి కనిపించకపోయినా సమయం వచ్చినప్పుడు పడగవిప్పి కాటువేయడానికి ప్రయత్నిస్తూనే ఉంది. కాటు వేస్తూనూవుంది. తన వాళ్లందరూ- తల్లిదండ్రులు సైతం అటవికుల్లా, అడవి జంతువుల్లా, క్రూరమృగాల్లా తన మీద దాడిచేశారు. పద్మవ్యూహంలో కౌరవయోధులు అభిమాన్యుని చుట్టుముట్టినట్లు చుట్టుముట్టారు. వాళ్లు అభిమన్యుని అప్పుడే చంపివేశారు. అనాలోచితమయిన మా వాళ్ల చర్యకు గురై కుళ్లి కృశించి క్షణక్షణమూ చస్తున్నాను.

నాన్నగారు ఉదారులు... ఆయన ఉదార స్వభావమే నన్ను అందరికీ దూరం చేసింది. చిన్న కుటుంబమే చింతలు లేని కుటుంబం అన్న సద్బుద్ధితో నేను పుట్టగానే సంతానికి ఫుల్‌స్టాప్ పెట్టేశారు. కొడుకూ, కూతురు సమానమే అన్నారు. స్థిరచరాస్తుల్లో అమ్మాయికి సగభాగం ఇస్తానన్నారు

మా మామగారు నన్ను బంగారుబొమ్మగా భ్రమించారు. అమ్మ, తమ్ముళ్లు ముగ్గురు, నాన్న చెల్లాయి కొడుకులు ఇద్దరు మొత్తం అయిదుమంది పోటీపడ్డారు నన్ను పెళ్లాడ్డానికి.

స్వార్థం, ఆశ... పేరాశ మానవుని దానవునిగా మారుస్తాయి. ఆస్తి గనుక లేకపోతే నాకు పెళ్లి చేయడానికి నాన్నగారు ఎంతమంది కాళ్లు పట్టుకోవాల్సి వచ్చేదో...

తన తమ్ముళ్లకు ఇవ్వాలని అమ్మ, తన మేనల్లుళ్లకు ఇవ్వాలని నాన్న రోజూ దెబ్బలాడుకునేవాళ్లు. అప్పుడప్పుడే నేను టెంత్‌క్లాస్ పాసయ్యాను. రాష్ట్రస్థాయిలో రాంకు వచ్చింది. కాలేజీలోచేరి శ్రద్ధగా చదవాలని తరువాత డాక్టర్లో, ఇంజనీరో కావాలని కలలు కన్నాను. కాలేజీలో చేర్పించాలా? వద్దా? అన్న సందిగ్ధావస్థలో నాన్న ఊగిసలాడుతుండగా అమ్మాయికి ఇక చదువే అవసరం లేదంది అమ్మ. ఎంత చదివినా ఆడపిల్ల అంట్లు తోముకోవలసిందే అంది. పైచదువులు చదివితే అంతంత మాత్రమే చదువుకున్న తన తమ్ముళ్లను చేసుకుంటుందో లేదోనని అనుమానించింది. నా పుట్టిల్లు పోగొట్టుకోలేను అని గోలచేసింది.

అమ్మకంటే ఏడాకులు ఎక్కువ చదివింది మా మేనత్త.మా అన్నకూతురే మా ఇంటికోడ




లు కావాలిగాని వరాయిదాన్ని ఇంట్లో అడుగు పెట్టనిస్తానా- అంటూ శపథం చేసింది. అయిదుగురు మామగార్లలో ఎవరికి ఇచ్చినా మిగిలిన నలుగురితో నిష్ఠూరం తప్పదు కాబట్టి అయిదుగురికీ ఇవ్వడం మంచిదని అవహాన్యం చేశారు మామవరునవాళ్లు. పూర్వకాలంలో గ్రూపు మేరేజస్ ఉండేవట. నలుగురయిదుగురు మగవాళ్లకు ఒకే భార్య ఉండేదట. మాతృస్వామిక యుగం అదేనేమో. పెళ్లి వయసు వచ్చేవరకూ చదువుకోవాలనీ, కాలేజీలో చేర్పమనీ, ఏడ్చినా మొత్తుకున్నా మారాంచేసినా నా మొర ఆలకించేవాళ్లే కరువయ్యారు. నా రోదన అరణ్యరోదన అయింది.

చదువుమీద ఆశ నన్నగిల్లింది. ఇక చదువుకోలేనేమోనని భయపడ్డాను. విషయమంతా వివరంగా మా తెలుగు పండితులకు చెప్పి చదువుకోవడానికి దారి చూపి పుణ్యం కట్టుకోమని కాళ్ళావేళ్లాబడి వేడుకున్నాను.

ఓరియంటల్ కాలేజీలో చేరితే స్టయిఫండు ఇస్తారనీ, 'ఎ' విద్వాన్‌లో చేరితే ఉచితంగా భోజనం పెడతారనీ, చేరతానంటే చేరుస్తాననీ చెప్పారు.

నముద్రంలో మునిగిపోతున్న నాకు తీరం దొరికినట్లయింది.

నాన్నగారికి చెప్పాను. అనమ్మతిగానే అంగీకరించారు.

ఎలాగో విద్వాన్ ఎంట్రన్సుకోర్సులో చేరాను. అప్పటికే మా బంధువులకు, మా అమ్మకు నావట్ల విముఖత కలిగింది. చదువుకోవాలన్న ధ్యానతప్ప మరో ఆలోచన లేని ఆ చిన్నవయసులో తమ అవివేక ప్రవర్తనతో నా మనసులో ద్వేషబీజం నాటారు. మనసులో పడిన ద్వేషబీజం అంకురమై వయసుతోబాటు పెరిగి ఓ మహావృక్షమయి పోయింది.

విద్వాన్ ఆఖరు సంవత్సరం చదువుతూండగా ఓ క్లాసమేట్‌తో పరిచయమయింది. అందరి అనురాగానికి దూరమయిన నాకు కాకతాళీయంగా తారనపడిన నా నహపాఠి ప్రేమమూర్తిలా తోచాడు. నా నహవిద్యార్థినుల్లో చాలామందికి బాయ్‌ఫ్రెండ్స్ ఉన్నారు. వాళ్లు ఆ అమ్మాయిలకు నహకరించడం గమనించిన నేను నాకూ అలాంటి మిత్రుడు ఉంటే బావుండునే అనుకుంటున్న నమయంలో పరిచయమయిన ఆ అబ్బాయి ఎన్నో ఏళ్లు తపస్సు చేసిన భక్తునికి ప్రత్యక్షమయిన దేవుడులా కనిపించాడు. నిప్పులు చెరిగే ఎండలో పయనించిన ప్రయాణికునికి కనిపించిన చల్లని నీడలా తోచాడు. రెఫరెన్సుబుక్స్, మంచి నోట్సులు తెచ్చి ఇచ్చేవాడు.

స్నేహంతో ప్రారంభమయిన పరిచయం క్రమేపి ప్రేమగా రూపుదిద్దుకుంది. అందరి కళ్లూ కప్పి అడపాదడపా ఇద్దరం సినిమాలకు వెళ్లినా పక్కపక్క సీట్లలో కూచోవడానికి ఇష్టపడేదాన్ని కాదు. ఎంతోమంది దగాపడిన ఆడపడుచుల దీనగాథలు పేపర్లలో చదివిన నేను చాలా అప్రమత్తంగా ప్రవర్తిస్తూ వచ్చాను. అంతేగాక ప్రేమకలాపాల్లో పడితే చదువు పాడయిపోతుందని, చదువుకొని నా కాళ్లమీద నేను నిలబడలేకపోతే జీవితం అర్థాంతరంగా ముగించుకోవలసి వస్తుందేమో నన్న భయంకూడా నన్ను తప్పటడుగు వేయనివ్వకుండా కాపాడింది.

అతని కోరిక ప్రకారం నడుచుకోకపోయినా ఆ అబ్బాయి నా స్నేహం వదులుకోలేదు. పెళ్లిచేసుకుంటానన్నాడు. ప్రాధేయపడ్డాడు... నీ హృదయంలో కాస్త చోటివ్వమన్నాడు. హృదయంలో చోటు ఇవ్వడానికి... ఇమ్మనడానికి ఇదేం సినిమాకాదు పొమ్మన్నాను. ప్రేమశిఖరాలపైకి ప్రాకి, జారి కిందపడి, దుమ్ము దులుపుకొని ఓ నమస్కారంపెట్టి ఎడముఖం పెడముఖంగా విడిపోవడం కంటే స్నేహితులుగానే విడిపోదాం అన్నాను... ఇక మగపిల్లలతో స్నేహం చేయకూడదని నిర్ణయించుకున్నాను.

విద్వాన్ పరీక్షలు రాసి సెలవుల్లో ఇంటికి వెళ్లాను. లోగడ వచ్చిన అన్ని సెలవుల్లోను స్నేహితురాళ్ల ఊళ్లలోనే గడిపాను.

అయిదేళ్ల తరువాత ఇంటికి వెళ్లిన నామీద ఎవరూ ఆప్యాయత చూపలేదు. చనువుగా మాట్లాడలేదు.

పురుగును చూసినట్లు చూసింది అమ్మ.

దాయాదిని చూసినట్లు చూశాడు అన్న. ఆస్తిలో హక్కు కల్పిస్తే అందరు అన్నగార్లూ తమ చెల్లాయిల పట్ల ఇలాగే ప్రవర్తిస్తారేమో?

నాన్నగారు అడపాదడపా మాట్లాడినా వాత్స ల్యం మాత్రం అణుమాత్రం కూడా కనిపించలే దు.

అనురాగాలు, ఆప్యాయతలు దూరం కావ డానికి కారకులు ఎవరో అర్థం కాలేదు.

ఆస్తిలో వాటా ఇస్తానన్న నాన్నగారా..?

పెళ్లి చేసుకోవాలని ఉవ్విళ్లూరిన మామగా ర్లా?

తనకూతురు తన తండ్రికే కోడలు కావా లని పట్టుబట్టిన తల్లిగారా?

చదువుకోవాలన్న ధ్యానతో ఎవరినీ ఖాతరు చేయకుండా చదువుకున్న నేనా?

విద్వాన్ పాసయ్యాను. ట్రయినింగు కాక పోతే చదివిన చదువు ఉపయోగపడదని తెలు సుకున్న నేను ట్రయినింగుకు అప్లై చేశాను. సీటు వచ్చింది. కాలేజీకి వెళ్లాను. అదేం దురదృష్టమో నా బాయ్‌ఫ్రెండ్ అదే కాలేజీలో చేరాడు. ఈనాడు దురదృష్టం అనుకున్నట్లు ఆనాడు అనుకొని ఉంటే అదృష్టవంతురాలిన య్యేదాన్నేమో. నా స్నేహితుడు అదే కాలేజీకి రావడం ఆనాడు అదృష్టంగా భావించాను- ఆనాటి పరిస్థితులు అలాంటివి.

ట్రయినింగు పూర్తయిన తరువాత ఎక్కడికి వెళ్లాలి..? ఏం చేయాలి..? ఇంట్లో ఆదరణలే దని అర్థమయిపోయింది. ఆ పరిస్థితిలో ఎవరో ఒకరు ఆదరించే మనిషి అవసరం అని పించింది. ఆదేసమయంలో మళ్లీ పెళ్లిప్రస్తా వన తెచ్చాడు నా పాతస్నేహితుడు. స్వేచ్ఛగా మాట్లాడుకోవడానికి అవకాశంకూడా దొరికింది.

"కట్నకానుకలు లేకుండా చేసుకోవడానికి మీ పెద్దలు ఒప్పుకుంటారా?" అంది తను.

"ప్రేమ వివాహాలకు పెద్దలు ఎప్పుడూ వ్యతిరేకమే" అన్నాడు అతడు.

"మీ వాళ్లు - మా వాళ్లు ఒప్పుకోకపోతే పెళ్లి జరుగుతుందా?"

"ఎందుకు జరగదు... రిజిష్టరు మేరేజ్ చేసుకుందాం"

"చేసుకోవడం సులభమే కాని, తరువాత?"

"చెట్టాపట్టాలు వేసుకొని తిరగడమే"

"తిరుగుతూ ఉంటే తిండి అవసరం లేదా? మనమేం అడవిలోని పక్షులమా కాయలూ-కసర్లూ తిని బతకడానికి?"

"భలేమాట చెప్పావు! జంతువులూ, పక్షులే నయం మనకంటే.. కులం, మతం పట్టింపులే దు, కూడబెట్టాలన్న ఆశలేదు... రేపటి ఆలోచ నేలేని నిస్వార్థజీవులు"

"వ్యక్తిగత ఆస్తులు - అంతస్తులూ, వర్గభేదా లు లేకపోతే మానవులకు ఇంత స్వార్థం ఉండేది కాదేమో"

కులం, మతం కూడా ఖాతరు చేయకుండా పెళ్లి చేసుకోవడానికి అంగీకరించాం. కలిసి మెలిసి తిరిగాం.

పెళ్లి పెడాకులు లేకుండా, కులం-మతం లేకుండా, ఎగ్గూ-సిగ్గూ లేకుండా తిరుగుతున్నా రు- అన్నారు కొంతమంది.

'పెళ్లిచేసుకున్నారు, అన్నారు మరికొంత మంది.

వెక్కిరించారు, వెకిలిచేష్టలు చేశారు, కన్ను లున్న గుడ్డివాళ్లుగా, చెవులున్న చెవిటివాళ్లుగా తిరిగాం. విషయం ప్రిన్సిపాలు వరకూ వెళ్లలే దు కాబట్టి బతికి పోయాం.

'నాపెళ్లి గురించి ఆలోచించి మనసు పాడు చేసుకోవద్దని, మంచి మొగుణ్ని చూసుకున్నా నని, కులాంతర వివాహం చేసుకోవడానికి నిర్ణయించుకున్నానని మా నాన్నగారికి ఉత్తరం రాశాను. నువ్వు నా కూతురువు కాదని, నీకూ, మాకూ సంబంధం లేదని, ఇదే ఆఖరి ఉత్తరం అని ఓ ఉత్తరం రాశాడు నాన్న. అంతే- సంబంధం తెగిపోయింది నాకు, మావాళ్లకు.

పెళ్లి చేసుకోవడానికి నిర్ణయించుకున్నట్లు అబ్బాయి రాసేదో లేక అతనితల్లి దండ్రులకు అనుమానం కలిగిందో తెలియదుకాని, ఓ శుభో దయాన వచ్చి, గుట్టుచప్పుడు గాకుండా కొడు కును పిలుచుకొని వెళ్లినట్లు తెలిసింది. ట్రయి నింగు కూడా పూర్తి చేయకుండా వెళ్లిపోయా డు- కాదు, పారిపోయాడు. తల్లిదండ్రులకు ఏకైక పుత్రుణ్నని, వాళ్లను విడిచి ఉండలేనని, కని, పెంచి, పెద్దచేసిన తల్లిదండ్రులకు అన్యాయం చేయడం న్యాయం కాదని, అపా

ర్థం చేసుకోవద్దని సలహా ఇస్తూ,ఓదార్పుగా ఓ ఉత్తరం రాశాడు కొన్నాళ్లకు.

కాలికింద కొమ్మ జారిపోయింది, చేతిలో కొమ్మ విరిగిపోయింది. పడిపోయాను. లేవలేకుండా పడిపోయాను. రెంటికీ చెడిన రేవడి పరిస్థితి అయింది.అయిదేళ్లు కలిసిమెలిసి ఒక కాలేజీలో చదివి, పరస్పరం అర్థంచేసుకున్న క్లాసుమేట్ మోసం చేశాడు. అన్నాళ్లు బాయ్ ఫ్రెండుతో కలసిమెలిసి తిరిగినా, మనసులు కలిశాయేగాని, శరీరాలు కలవడానికి అవకాశం ఇవ్వలేదు. అయినా ఎవరు నమ్ముతారు. నీళ్లలో ఉండేకప్ప నీళ్లు తాగకపోయినా తాగిందనే అంటారు. ఈత చెట్టుకింద పాలు తాగినా కల్లుతాగినట్లే- ఒక స్త్రీ, ఒక పురుషుడు అనుమానాస్పద పరిస్థితిలో చాటుమాటున మాట్లాడినా అక్రమసంబంధం అంటగడతారు. ప్రత్యక్షంగా రాసుకొని - పూసుకొని తిరిగిన నేను పవిత్రంగా ఉన్నానంటే నమ్మే పిచ్చివాళ్లు ఎవరున్నారు..? అదే మగవాడయితే పవిత్రంగా ఉండాల్సిన అవసరంలేదు. నా గతచరిత్ర తెలియక సానుభూతి చూపుతున్న హెడ్మాష్టరుగారు హిందీ మాష్టరుగారు తెలిసిన తరువాత కూడా సానుభూతి చూపుతారా? చూపితే ఏ రూపంలో చూపుతారు..? అనాథాశ్రమంలో చేరుస్తారా? తిండికీ, గుడ్డకూ కొరతలేని ఉద్యోగం ఉంది కాబట్టి వాళ్లు ఆ శ్రమ తీసుకోవలసిన అవసరంలేదు.

తనలోతాను నవ్వుకుంది... జీవంలేని నవ్వు అది... "ఇంకా వంట చేసినట్లు లేదే విమలమ్మా?" అన్న ప్రశ్నతో ఈ లోకంలోకి వచ్చిన విమలమ్మ, ఎదురుగా నిల్చున్న పొరుగింటి పాపమ్మను చూసి, "చేయాలి" అంది.

"ఇంకెప్పుడు చేస్తావమ్మా. మేం అన్నంకూడా తిన్నాం" అంది పాపమ్మ. టయిమ్ చూసుకుంది విమలమ్మ. ఎనిమిది దాటింది. హడావుడిగా లేచి లోపలికి వెళ్లబోతూ ఉండగా- "ఎవరమ్మా మనింటికొచ్చినాయన?" అంది.

"మా స్కూలు టీచరమ్మా!"

"నీకేమయినా బంధువా?"

"కాదు... సార్‌ది ఈ ఊరే! మా ఊరు ఎక్కడో వంద కిలోమీటర్ల అవతల ఉంది"

"నల్లమాడకంటే దూరమా?" అంది ముక్కుమీద వేలేసుకుంటూ.

తెలీని వాళ్లు తెలియనట్లు ఉండరు. నల్లమాడ పదిహేను కిలోమీటర్లు దూరంలో ఉంది. వందకు పదిహేనుకు భేదం తెలీదేమో? నల్లమాడకూడా చూడలేదేమో పాపం! బెల్లం ఎలా ఉంటుందంటే, అల్లంలా పుల్లగా ఉంటుంది అన్నాడట ఓ ప్రబుద్ధుడు. అతని జవాబులా ఉంది ఈమె ప్రశ్న అనుకుంది విమలమ్మ.

ఇంతలో ఓ చిన్న పిల్లాడిని చంకలో ఎత్తుకొని పాపమ్మ పెద్దకూతురొచ్చింది.

"బాబుకు వయసెంత పాపమ్మా?" అంది విమలమ్మ.

"ఏమోనమ్మా, నిరుడో లేక ముందటేడో శనగచెట్లు పీకే టయిమ్‌లో పుట్టాడు" అంది మహాతెలివిగా మాట్లాడినట్లు పోజుబెట్టి.

"కూచోండి" అంటూ స్టౌ వెలిగించి, బియ్యం కడగసాగింది విమలమ్మ.

★ ★ ★

స్టాఫ్‌రూమ్‌లో కూచొని చదువుకుంటోన్న శ్రీనివాసుల్ని "మేడమ్ పిలుస్తోంది సార్!" అంటూ ఓ కుర్రాడు పిలిచాడు.

'ఎందుకట?' అనాలని అనుకున్నాడు. అబ్బాయికేం తెలుసులే. అడిగినా ప్రయోజనం ఉండదు అనుకొని, "వస్తున్నాను పద" అంటూ పిల్లవాణ్ని పంపేసి ఆలోచించసాగాడు—విమలమ్మ ఎందుకు పిలుస్తోందో మరి..? తన గత చరిత్ర చెప్పమని రాత్రి అడిగితే తరువాత చెబుతానని దాటవేసింది... ఇప్పుడు క్లాసురూమ్‌లోకి రమ్మని చెప్పి పంపింది... రాత్రి ఇద్దరమే ఉన్నప్పుడు చెప్పడానికి వెనుక ముందులాడిన మేడమ్ ఇప్పుడు పిల్లల సమక్షంలో చెబుతుందా...? రాత్రి నేను మనసు నొచ్చుకున్నానని అనుకుందేమో... అప్పొలజీ చెబుతుందేమో... ఎందుకు పిలిచిందో...? వెళ్లకుండా ఆలోచిస్తే ఏం తెలుస్తుంది... వెళ్లాలి. ఏ క్లాసులో ఉందో మరి. టయిమ్ టేబుల్ చూశాడు... చదువుతున్న పుస్తకం చేతిలో పట్టుకొని వెళ్లాడు.

"టయిమ్ టేబులు వేసేటప్పుడు కాస్త ఆలో




చించి వేయాలి సార్'' అన్నాడు వెంకటస్వామి ప్రకాశంతో.

''ఏంసార్ తప్పుందా? అకడిమిక్ ఇయర్ అయిపోయేటప్పుడు తప్పు పట్టుకున్నారే'' అన్నాడు ప్రకాశం.

''తప్పా తప్పున్నరా? పెళ్లికాని పండితులకు ఇద్దరికీ ఒకే పీరియడులో లీజరు ఉండేలా వేయాలి''

''ఓహో... అదా సంగతి?... విమలమ్మ సంగతి తెలుసా మీకు?''

''తెలీదు సార్''

''మరి పెళ్లికాలేదు అంటున్నారే?''

''కాలి మెట్టెలు, మంగళసూత్రం లేకపోతే హిందూ స్త్రీకి పెళ్లికానట్లేగా?'' అన్నాడు వెంకటస్వామి.

''విధవలక్కూడా ఉండవయ్యా మహానుభావా!''

''విధవలు పూలూ-కుంకుమ పెట్టుకోరు సార్!'' అన్నాడు వెంకటస్వామి.

''లేదయ్యా... చదువుకొనేటప్పుడే కులాంతర వివాహం చేసుకుందట. అందుకే వాళ్ల అమ్మా-నాన్నా కూడా రారు''

''ఎలా తెలుస్తుంది సార్ మీకు, అందరి రహస్యాలు తెలుసుకుంటారు?''

''వార్తావహులు ఉన్నారయ్యా మన చేతిలో''

వెళ్లి క్లాసురూమ్ ముందు నిల్చున్నాడు శ్రీనివాసులు. ఎదురుచూస్తున్న విమలమ్మ కుర్చీలో నుంచి లేచి నిలబడి, ''రండి సార్!'' అంది.

''ఏం మేడమ్?'' అన్నాడు శ్రీనివాసులు బయటే నిల్చొని.

''రండి సార్... మాకు ఓ ప్రాబ్లమ్ వచ్చిపడింది''

''అంత చిక్కు సమస్యా మేడమ్... మీరు పరిష్కరించలేని సమస్య నేను పరిష్కరిస్తానా?'' అన్నాడు శ్రీనివాసులు.

''కొంతమంది మెదడు చురుగ్గా పనిచేస్తుంది సార్!''

లోనికివెళ్లి టేబులుకు ఆనుకొని నిల్చున్నాడు శ్రీనివాసులు. పిల్లలంతా లేచి నిల్చున్నారు. ''కూచోండి?'' అన్నాడు శ్రీనివాసులు.

''కుర్చీలో కూచోండి సార్!'' అంటూ పక్కకు జరిగింది విమలమ్మ.

''మీరు కూచోండి మేడమ్!''

''చైతన్యా... వెళ్లి ఓ కుర్చీ తీసుకుని రా!'' అంది విమలమ్మ ఓ అబ్బాయితో.

చైతన్య వెళ్లి కుర్చీ తెచ్చాడు.

''కూచోండి సార్!'' అంది తను కూచుంటూ విమలమ్మ.

కూచున్నాడు శ్రీనివాసులు. ''ఏం మేడమ్, ఎందుకు పిలిచారు?''

''సార్... ఓ అబ్బాయి ఏవో టాబ్లెట్సు కొనుక్కోవాలని పది రూపాయలు తెచ్చుకున్నాడట. ఇంటర్వెల్‌లో పోగొట్టుకున్నాడు. ఎవరో తీసుకున్నారని ఏడుస్తున్నాడు. అడిగితే ఎవరూ ఒప్పుకోవడంలేదు'' అంది విమలమ్మ.

''ఇంటర్వెల్‌లో బయటికి వెళ్లినప్పుడు గ్రౌండులో పోగొట్టుకున్నావేమో?'' అన్నాడు శ్రీనివాసులు.

''లేద్సార్, లోపలికి వచ్చి చూసుకున్నాను. ఉంది''

''అయితే క్లాసురూమ్‌లోనే పోయిందా?''

''అవును సార్!'' అన్నారు ఇద్దరు-ముగ్గురు పిల్లలు ఒకేసారి.

''ఎవరు తీసుకున్నారో ఎవరయినా చూశారా?'' అడిగాడు శ్రీనివాసులు.

''చూడలేదు సార్'' అన్నారు పిల్లలు.

''నీకు ఎవరిమీదయినా అనుమానం ఉందా?'' డబ్బు పోగొట్టుకున్న అబ్బాయిని అడిగాడు శ్రీనివాసులు.

''లేదు సార్!''

''గదిలోకి వచ్చిన తరువాత పోయిందంటే మీలో ఎవరో ఒకరు తీసుకొని ఉండాలి... ఇవ్వండి'' అన్నాడు శ్రీనివాసులు.

ఎవరూ ఉలకలేదు, పలకలేదు.

''మీలో ఎవరూ దొంగలు లేరు. దొంగిలించాలన్న ఉద్దేశంతో దొంగిలించలేదు. ఆ అబ్బాయి తెలివితేటల్ని పరీక్షించడానికి తీసు

కొని ఉంటారు. అయితే తీసుకున్న తరువాత ఏమనుకున్నారో మరి ఇవ్వలేదు. ఇంత హంగామా జరిగిన తరువాత ఇస్తే అందరూ తనను దొంగ అంటారేమోనని భయపడుతూ ఉంటారు. అందువల్ల ఇవ్వాలని అనుకున్నా ఇవ్వలేకపోతూ ఉండవచ్చు. ఆ డబ్బు ఎవరు తీసుకున్నారో ఎవరికీ తెలీకుండా తిరిగి ఇచ్చే ఉపాయం చెబుతాను. ఆ పద్ధతిలో అయితే తిరిగి ఇచ్చివేస్తారన్న నమ్మకం ఉంది నాకు'' అన్నాడు శ్రీనివాసులు.

''చెప్పండి సార్... చెప్పండి సార్'' అన్నారు పిల్లలంతా ఒకేసారి.

''అందరూ మీ మీ నోట్సుల్లో తెల్లకాగితాలు చించుకోండి. అందరూ ఒకేవిధంగా తమ తమ కాగితాన్ని నాలుగు మడతలు మడిచి ఈ టేబులు రాక్‌లో వేయాలి. నోటు తీసుకున్న అబ్బాయికాని, అమ్మాయికాని నోటును ఆ కాగితంలో పెట్టి మడిచి ఈ రాక్‌లో వేయాలి. అందరి పేపర్లు వేసిన తరువాత ఆ మడతలు విప్పిచూస్తాం. అయితే ఎవరూ తమ పేరు కాగితం మీద రాయకూడదు'' అన్నాడు శ్రీనివాసులు.

''వేస్తాం సార్... వేస్తాం సార్'' అన్నారు పిల్లలు.

''ఆ పేపరు మడతల్లో నోటు వస్తే మీరందరూ మంచివాళ్లే. మీలో దొంగలు ఎవరూలేరని, తమాషాకు అబ్బాయిని ఆటపట్టించడానికి తీసుకున్నారని అనుకుంటాం. ఇవ్వకపోతే తరువాత అందరి జేబులు, బాగులు చెక్‌చేస్తాం. ఎవరివద్ద నోటు దొరుకుతుందో ఆ విద్యార్థి మీద హెడ్మాష్టరుకు రిపోర్టుచేసి టి.సి. ఇచ్చి స్కూలు నుండి పంపించేస్తాం. అయితే చెక్ చేయవలసిన అవసరం రాదని, డబ్బు ఇచ్చివేస్తారని ఆశిస్తున్నాం...'' అంటూ ఆపి, అందరివేపు చూసి 'కానివ్వండి మరి!'' అన్నాడు గంభీరంగా.

ఎక్సర్‌సైజు పుస్తకాలు తీసి పేపర్లు పరపర చించారు. గబగబ మడిచారు. ''పేపరు మడిచేటప్పుడు ఒకరి పేపరు మరొకరు చూడకండి'' అన్నాడు శ్రీనివాసులు. మడిచిన పేపర్లు గబగబ తెచ్చి రాక్‌లో వేశారు. టేబులువద్ద నిల్చొని ఆసక్తిగా చూస్తున్న కొంతమంది పిల్లల్ని ''కూచోండి'' అంది విమలమ్మ. అందరూ కూచున్న తరువాత ఒక్కో మడత విప్పి చూడసాగారు విమలమ్మ, శ్రీనివాసులు.

ఎన్నికలు పూర్తయిన తరువాత బాలెట్ పేపర్లు లెక్కపెడుతూ ఉంటే ఆసక్తిగా, ఆత్రంగా చూస్తున్న అభ్యర్థుల్లా పిల్లలంతా ఆబగా చూస్తున్నారు. ఆకస్మికంగా ఆనందంతో వెలిగిపోయింది విమలమ్మ ముఖం.

''థాంక్సు సార్!'' అంది శ్రీనివాసులుకేసి కృతజ్ఞతగా చూస్తూ.

దొరికిన నోటు పోగొట్టుకున్న అబ్బాయిని పిలిచి ఇచ్చేసింది విమలమ్మ.

పిల్లలందర్నీ అభినందించాడు శ్రీనివాసులు. తమ హిందీ పండిట్ తెలివితేటల్ని సమయస్ఫూర్తిని గురించి కథలు, కథలుగా చెప్పుకున్నారు పిల్లలందరూ.

బెల్ కొట్టాడు అటెండరు.

★ ★ ★

బాల్యం నుండి కలసి మెలసి ఉన్నాం. అన్నదమ్ములకంటే సన్నిహితంగా ఉన్నాం. ప్రతి విషయమూ పరస్పరం చర్చించుకొని, అర్థం చేసుకొని, బాగోగులు బేరీజు వేసుకొని నిర్ణయం తీసుకున్నాం. ఒకరికి తెలీకుండా ఒకరు ఏ పనీ చేసే వాళ్ళం కాదు. అయితే తన పెళ్లి విషయంలో మాత్రం రహస్యం దాస్తున్నాడు. అమ్మాయిల తల్లిదండ్రులు నేరుగా ఆయనతో సంప్రదించకుండా తన వద్దకు వచ్చి తనను వేధిస్తున్నందువల్ల ఆయన పెళ్లి తనకు చిక్కు సమస్య అయింది. అతను తన అభిప్రాయం చెప్పకుండా రేపు-మాపు అంటూ దాటవేస్తోంటే తను మాత్రం ఏం చెప్పగలడు? తనూ అలాగే రేపు-మాపు అంటూ కాలం గడుపుతున్నాడు. స్వార్థం కొద్దీ ఆడపిల్లల తండ్రులు ఏమేమో చేస్తున్నారు. మా బావ సుబ్బయ్య కూతురు పట్ల మొగ్గు చూపుతున్నాడనీ, ఆ అమ్మాయినే పెళ్లాడతాడేమోననీ అనుకుని సుబ్బయ్య కూతుర్ని భుజంగానికి కట్టబెట్టాలని ప్రయత్నించాడు లింగరాజు. శకుంతల తన కూతురు అయినట్లుగా ఒప్పుకుంటే చాలు, శకుంతల్ని ఇచ్చి పెళ్లిచేసేస్తానని భుజంగానికి ఆశ కల్పించా




డు. బలరామయ్య మాత్రం తక్కువ తిన్నాడా? తన మేనకోడలు విషయంలో ఇంకా ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు. మరి శ్రీనివాసులు ఎవరికీ ఏమీ చెప్పకుండా ఎందుకు దాస్తున్నాడో తెలుసుకోవాలి. హంగులన్నీ ఉండి, ఆడ దిక్కులేని శ్రీనివాసులు పెళ్లి చేసుకోలేదంటే ఏమేమో ఊహించుకుంటున్నారు జనం. ఎవరినయినా ప్రేమించాడేమో, ప్రేమ వివాహం చేసుకుంటాడేమోనని అనుమానపడుతున్నారు. తెలుగు టీచరు విమల ఉదంతం పాత వార్తల్లో కొత్తగా వచ్చిచేరింది. లోకుల మాటలు, రచ్చబండ వార్తలు వింటూ ఉంటే తనకూ అనుమానం కలుగుతోంది.

ఆలోచిస్తూ నడుస్తున్నాడు రామలింగం. కాయో పండో తేల్చుకోవాలన్న గట్టి పట్టుదలతో వెళ్తున్నాడు శ్రీనివాసులు వద్దకు.

''ఉన్నావా... బావా?'' అన్నాడు నాకిట్లో నిల్చొని.

''రావోయ్... ఇన్నాళ్ళు కనిపించలేదే?'' అన్నాడు శ్రీనివాసులు.

''ఎన్నాళ్లయింది? నువ్వు అనంతపురం నుండి వచ్చిన తరువాత వచ్చాగా?''

''వచ్చావు... ఇంతకుముందు రోజూ వచ్చేవాడివి కదా?''

''అంతేనా- పెళ్ళి కాకమునుపు రాత్రింబవళ్లు నీ వద్దనే ఉండేవాడిని''

''అవును... వయసుతోబాటు బాధ్యతలూ పెరుగుతాయి''

''ఇప్పుడు రావడానిక్కూడా విరామం లేదనుకో. పెళ్ళి కూతుళ్లపోరు ఎక్కువయింది. వాళ్ల పోరుకు తట్టుకోలేక తాడో పేడో తేల్చుకోవాలని వచ్చాను''

''మనిషిలో స్వార్థం దినదినానికి పెరిగిపోతోంది. ఇది ఇలాగే పెరిగిపోతే నైతిక గుణాలకు చోటు లేకుండాపోతుంది. అప్పుడు మానవుని మనుగడ కష్టమయిపోతుంది. తనకులేని కన్ను రావాలి, ఎదుటివానికి రెండు కళ్ళూ పోవాలి- అనే మనస్తత్వం మనిషిలో ప్రబలిపోతోంది. తన బిడ్డకు పెళ్ళి చేయాలని తండ్రి కోరుకోవడం తప్పుకాదు. అయితే ఆ ప్రయత్నంలో తన బిడ్డను మహా శీలవతిగాను, మిగతా ఆడపిల్లల్ని పతితులుగాను ప్రచారం చేయడం తప్పు''

''ఏంటి బావా... ఉపన్యాసం దంచేశావే? ఎలక్షన్లో నిలబడితే తప్పక గెలుస్తావు''

''ఉపన్యాసమా? కాదు... ఉపన్యాసమూ కాదు, కల్పన అంతకంటే కాదు. కావాలంటే చూడు'' అంటూ మూడు కవర్లు తెచ్చి రామలింగం చేతికి ఇచ్చాడు శ్రీనివాసులు.

''ఉత్తరాలా... ఎవర్రాశారు బావా?''

''ఆకాశరామన్న'' అన్నాడు శ్రీనివాసులు ముక్తసరిగా.

''ఏ ఊరు?''

''అతనికి ఊరులేదు, ఆకాశమే అతని ఉనికి''

''ఆ... ఆకాశమా? నేనేం పిచ్చివాణ్నా బావా, నువ్వేం చెప్పినా నమ్మడానికి?''

''నాకు తెలీని విషయాలు అడిగితే నేనేం చెప్పగలను మరి? ఉత్తరం రాసిన వాళ్లు తమ పేరు, ఊరు, ఇతర వివరాలు రాయకుంటే అలాంటి ఉత్తరాన్ని ఆకాశరామన్న ఉత్తరం అంటారు''

''ఆ...! అలాగా...? అదేందో ఏప్రిల్‌ఫూల్ అంటారే, అట్లా చేసినావే నన్ను'' అంటూ పకపక నవ్వి, ''ఏం రాశారు?'' అన్నాడు మళ్ళీ.

''చదువుకోమనేగా ఉత్తరాలు నీ చేతికిచ్చింది''

''నేనేం చదువుతా బావా! అచ్చు బుక్కులయితే అక్షరాలు కూడబలుక్కొని చదువుతా, చేతి రాత చదవలేను'' అంటూ ఓ కవరులోని ఉత్తరం తీసి, ''ఇదేందో గొలుసు రాతే, నేను చదవలేనులే'' అన్నాడు. అంతటితో ఊరికే ఉండకుండా మరో ఉత్తరం తీసి చూశాడు. అదీ గొలుసు రాత కావడంవల్ల దాన్నీ అలాగే కవర్లో ఉంచి మరో కవరులోని ఉత్తరం తీశాడు. అదీ గొలుసు రాతే.

''ఈ బ్రహ్మరాతలు నేను చదవలేను కాని నువ్వే చదువు బావా వింటాను''

''ఎవరయినా వింటే ప్రమాదమే'' అన్నాడు శ్రీనివాసులు.

''ఎవరున్నారులే వినడానికి''

''నువ్వు కూడా ఎవ్వరికీ చెప్పకూడదు. పెళ్ళి

కాని పిల్లలతో పని... చదువుతా విను" అంటూ ఓ ఉత్తరం తీసి చదవసాగాడు.

"ప్రియమయిన శ్రీనివాసులుకు"

"నీకు రాశారా?" అన్నాడు రామలింగం.

"నాకు గాక నీకు రాశారనుకున్నావా?"

"కాదు... ఆడపిల్లలకు రాశారేమో అనుకున్నా! సరే చదువు..."

పెళ్ళి కాని ఒక ఆడపిల్ల గురించి, ఆ అమ్మాయిని చేసుకోబోతున్న నీకు ఇలాంటి ఉత్తరం రాయడం మంచిదికాదని తెలుసు. అయితే తెలిసీ ఎందుకు రాస్తున్నానంటే నీమీది అభిమానంతో. సుబ్బయ్య కూతురు శంకుతలను పెళ్ళి చేసుకోవాలని అనుకుంటున్నట్లు తెలిసింది. నువ్వు అందరిలాంటి మనిషివి కాదని, తెలివైనవాడివని, పొరపాటు పడవని అనుకున్నాను. అందరిలాగే నువ్వూ బోల్తా పడ్డావు. ఆడగాలి అలాంటిది. అమ్మాయి మాటలకు మోసపోయావు. బుద్ధిమంతురాలని అనుకున్నావు. నిజమే... బుద్ధిమంతురాలే. అయితే కాలేజీలో ఎన్నికలు జరిగినప్పుడు అడ్డు లేకుండా తిరిగి చెడిపోయింది. ఆ వివరాలన్నీ ఇప్పుడు అవసరంలేదు. అమ్మాయిమీద ఉన్న ప్రేమతో నువ్వు నమ్మలేకపోవచ్చు. నమ్మడం, నమ్మకపోవడం నీ ఇష్టాఇష్టాల మీద ఆధారపడి ఉంటుంది. నామాట నమ్మలేకపోతే అమ్మాయి కాలేజీ చదువు పూర్తయ్యేవరకూ వేచి చూడు. వాని వెంట వెళ్లిపోకపోతే చేసుకో. నువ్వు ఆ అమ్మాయిని చేసుకుంటే నాకేం నష్టంలేదు. ఒక బుద్ధిమంతుడు తెలీక చెడిపోతూ ఉంటే తెలిసీ చెప్పకపోవడం న్యాయం కాదని తెలియజేస్తున్నాను... తరువాత నీ ఇష్టం...?"

"ఎవర్రాశారు బావా?"

"రామాయణం అంతా విని సీతకు రాముడు ఏమవుతాడు అన్నట్లుంది నీ ప్రశ్న. అప్పుడే చెప్పానుగా- ఎవరు రాశారో తెలీదని, ఓ ఆకాశరామన్న అనీ"

"మూడు జాబులూ శంకుతల గురించే రాశారా?"

"కాదు... సౌజన్య, విమలమ్మ గురించి రాశారు"

"విమలమ్మా... ఎవరామె?"

"మా స్కూలు తెలుగు టీచరు"

"ఆమెను గురించి ఎందుకు రాశారు?"

"ఆ ఇద్దరమ్మాయిల్ని గురించి రాసినట్లే"

"అయితే ఆమె కూడా నిన్ను పెళ్లాడాలని ప్రయత్నం చేస్తోందా?"

"ఆమె చేయలేదు"

"అయితే నువ్వు చేస్తున్నావా?"

"నేనూ చేయలేదు"

"పోనీలే... సౌజన్యను గురించి ఏంరాశారు?"

"రెండు ఉత్తరాల సారాంశం ఒకటే. శైలి, పద ప్రయోగం మారింది"

"ఇదంతా ఎవరో కానివాళ్ళు కల్పించిన కథలా ఉంది. నీ అభిప్రాయం ఏమిటి బావా?"

"అంతే, అంతే"

"పెళ్ళి చెడగొట్టాలన్న దురభిప్రాయంతో అనవసరంగా ఆరోపణ చేసి ఉత్తరాలు రాశారు. వాళ్ల ప్లాను పాడుచేయాలనుకుంటే నువ్వు ఈ పెళ్ళి చేసుకొని తీరాలి"

"ఎవర్ని చేసుకోవాలంటావు? ముగ్గుర్నీ చేసుకోమంటావా?"

విమలమ్మ విషయం చెప్పకూడదనుకొన్నాడు కాని, మాటల సందర్భంలో ముగ్గుర్నీ చేసుకోమంటావా? అన్నాడు.

"అలా చెప్పడానికి నేనేం పనికిమాలినవాణ్నా?"

"ముగ్గురి మీదా ఆరోపణలు వచ్చాయి గదా మరి?"

"మన ఊరి అమ్మాయిల మీద ఆరోపణ చేశారంటే వాళ్ల తల్లిదండ్రుల మీద కసి తీర్చుకోవడానికి రాశారని అనుకుందాం. ఎక్కడో దూరప్రాంతం నుండి వచ్చిన టీచరు మీద ఏంకసి?"

"ఊరక సజ్జనుండొదిగి యుండిన... అన్న పద్యం వినలేదా?"

"పద్యాలు, చదువు విషయం వదిలేసి ఏమయినా మాట్లాడు... విమలమ్మ గురించి ఏంరాశారో చదువు వింటా!"





"అది మరీ ఘోరంగా ఉందిలే!"

"అయితే వినాల్సిందే!"

"వింటే ముక్తి కలుగుతుందనుకున్నావా?"

"ఘోరంగా ఉందంటే వినాలనుకున్నాను"

"ఇతరులను విమర్శించడం, విమర్శల్ని వినడమూ మంచిదికాదు"

"అయితే వద్దులే బావా, మంచిది కాదన్న తరువాత ఎందుకు వినాలి.

ఇంతకూ లింగరాజుకు, సుబ్బయ్యకు ఏంచెప్పమంటావు?"

"ఏం చెబితే బావుంటుందో అదే చెప్పు"

"సరేలే... మళ్ళీ కొన్నాళ్లు వాయిదా వేద్దాం-వెళ్ళొస్తా బావా!"

"మంచిది వెళ్లిరా!" అన్నాడు శ్రీనివాసులు.

ఏమీ తేల్చుకోలేకపోయానే అని మనసులో మధనపడుతూ వెళ్లాడు రామలింగం.

★ ★ ★

రహస్యం రహస్యమంటూనే అంతా కక్కేశాడు రామలింగం. ఏదయినా కసి ఉంటే తన మీద తీర్చుకోవాలిగాని ఏమీ సంబంధంలేని ఓ స్టూడెంటు - అదీ అమ్మాయి - పైగా పెళ్ళిగాని అమ్మాయిని రచ్చకీడ్చి అవమాన పరచడం న్యాయమా? ఎవరు పాలుపడ్డారో ఈ పనికి? భుజంగానికి సుబ్బయ్య కూతుర్ని ఇప్పించి తన దారికి అడ్డు తొలగించుకోవాలని నేర్పుగా ప్రయత్నించినా తన మనసును పసికట్టి ఎదురుతిరిగాడు సుబ్బయ్య. అది మనసులో పెట్టుకొని ఇలా రాశాడేమో...?

ఇంకెవరు రాస్తారు... తనకు ఎవరున్నారు శత్రువులు? ఎవరయినా తన మీద ప్రతీకారం తీర్చుకోవాలిగాని, తన కూతుర్ని అవమానపరచడం ఏం పని? తోడేలు, మేక పిల్ల కథలా ఉంది. వాడే... ఆ సుబ్బయ్య పనే ఇది. తనకు తెలియకుండానే గట్టిగా అరిచాడు లింగరాజు. గదిలో చదువుకుంటున్న సౌజన్య, ఏదో పని చూసుకుంటోన్న భాగ్యమ్మ చెవులు రిక్కించారు.

★ ★ ★

'పిల్ల పదోతరగతి పాసయినప్పటి నుండి నెత్తిన నోరు పెట్టుకొని మొత్తుకుంటూనే ఉన్నాను. ఎవరింటారు నా మాట! తండ్రీ వినడు, కూతురూ వినదు. ఆడపిల్ల ఎంత చదివినా అంట్లు తోముకోవలసిందే, చదువు నిలిపేసి పెళ్లి చేద్దామంటే విన్నారా నా మాట? వినరు ఎందుకు వింటారు...? ప్రమాదం ముంచుకొచ్చే వరకూ వినరు. ఎదిగిన ఆడపిల్లను గుమ్మం దాటి బయటికి పంపకూడదని చెవిలో ఇల్లు గట్టుకొని పోరాను...విన్నారా? "చదవనీ... ఎంతవరకూ చదువుతుందో చదివిస్తాను" అన్నాడు తండ్రి. "ఏం మగపిల్లలేనా చదువుకొనేది, ఆడపిల్లలు చదవకూడదా? నేను చదువుకోవాలి" అని పట్టుబట్టింది కూతురు. ఇప్పుడు ఎవరో ఏమో రాశారట. పెళ్ళికొడుకులందరికీ రాస్తారా...? రాస్తారు... ఎందుకు రాయరు? ఒకరికి రాసినవాళ్ళు అందరికీ రాయరా...? ఎవరో మా మీద పగబట్టారు.... లేకపోతే ఏ పాపం ఎరుగని అమ్మాయి మీద అవాకులు చవాకులు రాస్తారా?' గొణుక్కుంటూ ఉంది అలివేలమ్మ వంటగదిలో కూచొని.

వరండాలో అన్యమనస్కంగా పచార్లు చేస్తున్నాడు సుబ్బయ్య.

తల్లి ద్వారా విషయం తెలుసుకున్న శకుంతల తన గదిలో కూచొని దీర్ఘంగా ఆలోచిస్తోంది. ఆలస్యం అమృతం విషయం అన్నారు పెద్దలు. నెలల తరబడి రాయబారాలు నడుపుకుంటూ కూచుంటే కుదురుతుందా...? తాడోపేడో త్వరగా తేల్చుకోవాలి... మిత్రులు ముగ్గురూ ఒకే సంబంధం కోసం పోటీ పడ్డారు. ఒకరికి తెలియకుండా మరొకరు ప్రయత్నం చేశారు. ఒకర్నొకరు మోసగించుకోవడానికి సిద్ధమయ్యారు. రామలింగం అన్నయ్య లేకపోతే అసలు విషయమే తెలిసేది కాదు. రేపు మాపు అని సాకు చెప్పకపోతే, "నీ కుమార్తె మంచిదికాదని" ఖరాఖండిగా చెప్పొచ్చుగా? ఆదర్శాలు వల్లిస్తూ ఉంటే బావ మంచివాడే అనుకున్నాను... ఆకాశరామన్న ఉత్తరాలు నమ్ముతాడ అనుకోలేదు. ఉత్తరాలు ఎవరయినా రాయొచ్చు... ఊరూ - పేరూ లేకుండా ఉత్తరాలు రాసేవారికి ఏం ప్రమాదం వస్తుంది...? ఎలక్షన్లో తమ తరఫున ప్రచారం చేయలేదని, ఓటు వేయలేదని మమ్మల్ని అవమానపరచాలని ఆకాశరామన్న ఉత్తరాలు





రాస్తారా చేతకాని దద్దమ్మలు. రాసేవాళ్లు రాశారు... అన్నీ తెలిసిన బావ, అలాంటి తలా తోక లేని ఆరోపణలు నమ్ముతాడంటే నేను నమ్మలేకుండా ఉన్నాను. పాపం... సౌజన్యకు తెలుసో తెలియదో. బహుశా తెలిసి ఉండదు... ఎలా తెలుస్తుంది...? రామలింగం అన్నయ్య చెప్పకపోతే మాకూ తెలీదు. ఉత్తరాలు ఎవర్రాశారో తెలుసుకోవాలి. ఇద్దరమూ కలసి బావ వద్దకు వెళ్ళి ఉత్తరాలు చూడాలి. ఏం రాశారో చూడాలి... హాండు రైటింగు చూస్తే తెలుసుకోవచ్చు... ఎవరు రాశారో? ఎవరు... ఆ ఛైర్మన్‌గాడే రాసి ఉంటాడు. వాడు రాయకపోయినా ఎవరితోనో రాయించి ఉంటాడు... పిరికి వెధవ... పిరికిపనులు చేస్తాడా? అయినా మా నాన్నగారు శ్రీనివాసులు సంబంధం కోసం ప్రయత్నిస్తున్న విషయం వాడికి ఎలా తెలుసు? ఎవరో మా ఊరి మగపిల్లలు క్లూ ఇచ్చి ఉంటారు. సౌజన్యతో కలసి మాట్లాడాలి... అనుకుంటోంది శకుంతల.

★ ★ ★

ఈ పని వాడే లింగరాజుగాడే చేయించి ఉంటాడు. నాకు నచ్చజెప్పి నా కుమార్తెను భుజంగానికి ఇప్పించి తన దారికి అడ్డులేకుండా చేసుకోవాలని ప్రయత్నం చేశాడు... ఆ ప్రయత్నం బెడిసికొట్టేసరికి పిచ్చివాడైపోయి పిచ్చి పనులు ప్రారంభించాడు. కుక్కతోకకు ఎన్ని బద్దలు వేసి కడితే మాత్రం ఏం ప్రయోజనం...? అతగాడి మనసు మార్చి, మంచి మార్గంలో నడిపించాలని భక్త సమాజం ఏర్పాటు చేశాం. అయినా ఏం ప్రయోజనం...? సర్వసంగ పరిత్యాగి స్వామి వెంకటానందుల గారికి మస్కా కొట్టి అతణ్ని కూడా తన మార్గంలో నడిపించాలని చూశాడు లింగరాజు. స్వామితో చెప్పించి నా కూతుర్ని భుజంగానికి ఇప్పించాలని ప్రయత్నించాడు. అది అర్థం పర్థం లేని ఆలోచనే... ఒకవేళ నా కుమార్తెను వేరేవాళ్లకు ఇస్తే ఆయన కూతుర్ని శ్రీనివాసులు తప్పక చేసుకుంటాడని గ్యారంటీ ఏమిటి? వీనికంటే దామోదరం, సంజీవయ్యే మెరుగు... వాళ్ళు చాటుమాటుగా ఏమీ చేయరు. ఇతరుల కళ్ళల్లో దుమ్ము కొట్టడమే వీని వృత్తి... వీణ్ని దెబ్బకొట్టాలంటే ప్రత్యర్థుల పక్షంలో చేరడమే మంచిది... పెళ్ళికాని బిడ్డ మీద ఏవేవో రాసి అవివేకం చేశాడు... వచ్చిన చెడ్డపేరు మాసిపోతుందా...? అందులో రామలింగం చెవిలో పడింది. పెదవిదాటితే పృథ్వి దాటుతుందన్నారు. **ఈ పాటికి ఊరంతా తెలిసి ఉంటుంది... అనుకుంటూ తిరుగుతున్నాడు సుబ్బయ్య.**

విషయం తెలిసినప్పటినుండి సౌజన్య మనసు మనసులో లేదు. ఎంత ఆలోచించినా ఏమీ పాలుపోవడంలేదు. తనకు ఇంతవరకూ ఎక్కడా విరోధులు లేరు. మరి ఎవరు చేసినట్లు ఈ పని...? కాలేజి ఎలెక్షన్లో తను ఎవరి పక్షంలోనూ పని చేయలేదు. తను అభిమానిస్తున్న అభ్యర్థి ఓడిపోయాడు. గెలిచినవాడు ఈ పని చేయించి ఉంటాడా...? విషయం తెలుసుకోకుండా ఎవరిని నిందించినా బావుండదు. ఉత్తరం ఏంరాశారో చూడాలి. హాండు రైటింగు చూస్తే పరిచయమయిన రాత అయితే ఎవరు రాశారో తెలుసుకోవచ్చు. ఇలాంటి విషయాల్లో చెప్పుడు మాటలు వినకూడదు. చెప్పుడు మాటలు చిలువలుపలువలుగా ఉంటాయి. నిజానికి అబద్ధానికి మధ్య దూరం ఎంత అంటే 'బెత్తెడు' అన్నారు. అంటే కళ్లతో చూసింది నిజం, చెవులతో విన్నది అబద్ధం. మొదట ఆ ఉత్తరం చూడాలి. చూడాలంటే శకుంతలతో కలసి టీచరు వద్దకు వెళ్లాలి. ఆలోచించుకుంటూ చెప్పులేసుకొని, ముంగిట్లోకి వచ్చింది సౌజన్య.

"ఎక్కడికమ్మా?" అన్నాడు లింగరాజు ఆవేదనగా.

"శ్రీనివాసులు సార్ వద్దకు"

"ఎందుకు?"

"ఉత్తరం చూడాలి"

"చూసి ఏంచేస్తావు?"

"అసలు ఉత్తరం రాశారో లేదో తెలుసుకోవాలి"

"ఉత్తరం రాయకపోతే రామలింగం అబద్ధం చెబుతాడా?"

"గుడ్డిగా ఎవర్నీ నమ్మకూడదు నాన్నా ఉత్తరం చూస్తే విషయం తెలుస్తుంది"

"నీ ఇష్టం" అన్నాడు లింగరాజు.

★ ★ ★

అరుగుమీద కూచొని ఆలోచిస్తున్నాడు సుబ్బయ్య. తన ఇంటివేపు వస్తున్న సౌజన్యను చూసి ఏదో అనిర్వచనీయమయిన ఆశాభావం కలిగింది. తన కూతురు మీద ఆరోపణలు చేస్తూ శ్రీనివాసులుకు ఉత్తరం రాసింది లింగ రాజేనని అనుకుంటున్న సమయంలో సౌజన్య రాక అతనికి ఏదో ఆశ కలిగించింది. సౌజన్య కొత్తగా తన ఇంటికి రావడంలేదు. రోజూ వచ్చేదే. ఇద్దరూ కలసి కాలేజికి వెళ్లారు. ఈరోజూ అందుకే వస్తూ ఉందా? శకుంతల గురించి రాసిన ఉత్తరం గురించి అమ్మాయికి తెలీదేమో...? తెలిసే ఉంటుంది... అందుకే స్నేహితురాల్ని ఓదార్చడానికి వస్తూ ఉందేమో! అందుకే వస్తోంది... కాలేజికి అయితే పుస్తకాలు తెచ్చేది. ఈ రోజు పుస్తకాలు తీసుకొని రాలేదు.

"ఏమ్మా... పుస్తకాలు తీసుకొని రాలేదే? కాలేజికి వెళ్ళరా?" అన్నాడు సుబ్బయ్య.

"శకుంతలతో మాట్లాడాలి బాబాయ్! ఈ రోజు కాలేజికి వెళ్లం"

"లోపల గదిలో ఉంది చూడమ్మా!"

సౌజన్య గొంతువిని వరండాలోకి వచ్చింది శకుంతల. గంభీరంగా ఉండటానికి విఫలయత్నం చేసింది. ముఖంలో దిగులు కనిపిస్తూనే ఉంది. మనసులోని వ్యాకులత పైకి కనిపించకుండా ఇద్దరూ ప్రయత్నిస్తున్నారు.

"పుస్తకాలు తేలేదే?" అంది శకుంతల.

"నువ్వు ఇంకా రెడీ కాలేదే?" అ ది సౌజన్య.

"కాస్త తలనొప్పిగా ఉంది, ఈరోజు రాలేను"

"నాకూ అలాగే ఉంది. అందుకే పుస్తకాలు తీసుకొని రాలేదు"

ఇద్దరికీ ఒకేసారి తలనొప్పి వచ్చిందే" అన్నారు ఇద్దరూ ఒకేసారి.

ఇద్దరూ నవ్వారు. ఆ నవ్వులో జీవంలేదు. కళలేదు. ఆ నవ్వు నవ్వులా లేదు, ఏడుపులా ఉంది.

"తలనొప్పి నీకు మాత్రమే కాక మొత్తం ఇంటికే వచ్చినట్లుందే?" అంది సౌజన్య కళావిహీనంగా ఉన్న ఇంటివాతావరణం చూసి.

"అవును సౌజన్యా, అందరికీ తలనొప్పి వచ్చింది"

"ఏమయిందే?"

"ఏమీ కాలేదు"

"ఏమీ కాకపోతే అందరూ దిగులుగా ఎందుకున్నారు?"

"నువ్వు మాత్రం సంతోషంగా ఉన్నావా?"

"ఏదో ఉత్తరం!" అంటూ ఆగిపోయింది సౌజన్య వాక్యం పూర్తి చేయకుండా.

"ఎవరు చెప్పారు?" అంది శకుంతల సౌజన్య తన ఉత్తరం గురించి మాట్లాడుతూ ఉందేమోననుకొని.

"రామలింగం!" అంది సౌజన్య.

"నీకు చెప్పాడా?"

"కాదు... మా నాన్నగారికి!"

"ఎవరికీ చెప్పనని, అందరికీ చెప్పాడే!" అంది శకుంతల.

"నీకూ చెప్పాడా?"

"కాదు... మా నాన్నగారికి!"

"నా విషయం మీ నాన్నగారికి చెప్పవలసిన అవసరం ఏమొచ్చిందో పాపం!"

"నీ విషయమా?" అంది శకుంతల ఆశ్చర్యంగా.

"మరి ఎవరి విషయం చెప్పాడు?"

"ఎవరి విషయం చెబుతాడు, నా విషయమే!"

"నీ విషయమేంటి?" అంది సౌజన్య నోరు వెళ్లబెట్టి.

"నీ విషయమేంటి?" అంతే ఆశ్చర్యంగా ప్రశ్నించింది శకుంతల.

"నా గురించి శ్రీనివాసులు సార్‌కు ఎవరో ఉత్తరం రాశారని చెప్పాడు."

"నా గురించి రాశారని మా నాన్నగారికి చెప్పాడే!" అంది శకుంతల.

"అయితే ఇద్దరి గురించి రాశారేమో?"

"మరి నువ్వెందుకొచ్చావు?"

"నిన్ను పిలుచుకొని సార్ వద్దకు వెళ్లామని"

"ఎందుకు?" ప్రశ్నించింది శకుంతల.





"ఉత్తరం సంగతి తెలుసుకోవడానికి"

"అయితే నాన్నగారికి చెబుదాం ఈ శుభవార్త!" అంది శకుంతల నవ్వుతూ.

"ఏం విడ్డూరమే... మనమీద ఆరోపణలు చేయడం శుభవార్తా?"

"పదిమందితో చావు పెళ్ళితో సమానమన్నారుగా" అంటూ హడావుడిగా వెళ్ళి, "నాన్నా!" అంది.

"ఏమ్మా?" అన్నాడు సుబ్బయ్య దిగులుగా.

"సౌజన్యను గురించి కూడా శ్రీనివాసులు సార్‌గారికి ఉత్తరం రాశారట" అంది.

"ఆఁ... నిజమా...?" అంటూ లేచి ఆత్రంగా వెళ్ళాడు గదిలోకి.

సుబ్బయ్యను చూసి, కుర్చీలో నుంచి లేచి తలవంచుకొని నిల్చుంది సౌజన్య.

"శకుంతల చెప్పింది నిజమా సుజా?" అన్నాడు సుబ్బయ్య ఆప్యాయంగా.

"నిజమే బాబాయ్" అంది సౌజన్య.

"ఎవరిమీదయినా అనుమానం ఉందా అమ్మడూ?"

"ఎలా అనుమానిద్దాం బాబాయ్. అందుకే శ్రీనివాసులుగారి వద్దకు వెళ్ళి ఉత్తరాలు చూద్దామని వచ్చాను"

"తొందరపడకండమ్మా! నేను మీ నాన్నగారి వద్దకు వెళ్ళి ఇద్దరమూ కలసి బలరామయ్యగారితో ఆలోచిస్తాం. అంతవరకూ మీరు తొందరపడకండి" అన్నాడు సుబ్బయ్య.

"అలాగే బాబాయ్" అంది సౌజన్య సౌమ్యంగా.

వెళ్ళిపోయాడు సుబ్బయ్య.

"ఈ పని ఎవరు చేసి ఉంటారంటావు శకూ?" అడిగింది సౌజన్య సుబ్బయ్య వెళ్ళిపోయిన తరువాత.

"నీకు ఏమనిపిస్తోంది?"

"వాడే... మొన్న కాలేజి ఎలక్షన్లలో గెలిచిన ఆ ఛైర్మన్‌గాడేనేమో అని అనుమానంగా ఉంది"

"నాకూ అదే అనుమానం" అంది శకుంతల.

"లేకపోతే మనమీద ఎవరికి ద్వేషం ఉంది?"

"ఉత్తరాలు చూసి దస్తూరి గుర్తించగలిగితే రాసిన మనిషి ఫలానా అని నిర్ణయించవచ్చు. ఉత్తరాలు ఇవ్వమని సార్‌ను అడగడం బావుంటుందో లేదో? ఉత్తరాలు మనచేతికి ఇస్తారో లేదో. ఎవరు చెప్పారంటే?"

"రామలింగం అన్నయ్యమీద చెబుదాం"

"మన ఫాదర్సు ఏం డిసైడు చేస్తారో చూద్దాం. తొందరపడొద్దన్నారుగా బాబాయ్‌గారు" అంది సౌజన్య.

లింగరాజు ఇంటి వరండాలో కూచొని బలరామయ్య లింగరాజు గుసగుసలాడుతున్నారు.

"మనం దాడిచేస్తామన్న అనుమానంతో ముందస్తుగా మనవి చేసుకోవడానికి వస్తున్నాడే" అన్నాడు బలరామయ్య దూరంలో వస్తున్న సుబ్బయ్యను చూసి.

"రానీ... వంట ఇంట్లోకి కుందేలు వచ్చినట్లు వస్తున్నాడు" అన్నాడు లింగరాజు కసిగా.

"అతడే రాశాడని కచ్చితంగా తెలుసా?" సందేహం వెలిబుచ్చాడు బలరామయ్య.

"ఎలా తెలుస్తుంది?"

"మరి సుబ్బయ్యే రాశాడని ఎలా చెప్పడం?"

"ఇంకెవరున్నారు?"

"అదేం... ఎవరూ లేరా? సంజీవయ్య, దామోదరం ఉన్నారుగా?"

"వాళ్ళు ఇలాంటి చౌకబారు పనులు చేస్తారని అనుకోను"

"అందరూ మీలాంటివాళ్ళే అనుకుంటే ఎలా?" అన్నాడు బలరామయ్య.

"సుబ్బయ్య వస్తున్నాడుగా రానీ, ఏంచెబుతాడో చూద్దాం"

"వచ్చీరాకనే ఎగిరి మెడకరుచుకోవద్దు, తాపీగా అడుగుదాం"

"బావగారి కోసం మనిషిని పంపాను, ఇక్కడే ఉన్నారే" అన్నాడు సుబ్బయ్య బలరామయ్యకేసి చూస్తూ.

"ఏం... పనుందా?" అడిగాడు బలరామయ్య.

"పని ఉంటేనేగదా మనిషిని పంపింది. ఇక్కడికి పిలుచుకొని రమ్మని పంపాను"

"ఏం, అంత అర్జంటు పనా?"

"అర్జంటు పనే, నాకేమీ తోచలేదు- మీ ఇద్దరితో ఆలోచిద్దామని" అంటూ నసిగాడు సుబ్బయ్య.

"ఏదో ఘనమయిన పనే ఉన్నట్లుందే" అన్నాడు బలరామయ్య.

"ప్రాణాల మీదికి వచ్చింది"

"ఆఁ... ఏం జరిగింది సుబ్బయ్యా?" అన్నాడు లింగరాజు ఆత్రంగా.

"అమ్మాయిని గురించి శ్రీనివాసులుకు ఎవరో జాబు రాశారట" అన్నాడు.

"నీకెలా తెలుసు?" అన్నాడు లింగరాజు తన కుమార్తె సౌజన్య విషయమే చెబుతున్నాడనుకొని.

"రామలింగం చెప్పాడు"

"ఎవరికీ చెప్పొద్దని నాకు చెప్పి, మళ్ళీ మీకు చెప్పాడా?" అంటూ మండిపడ్డాడు లింగరాజు.

"మీ అమ్మాయి విషయం మీకు చెప్పాడు, మా అమ్మాయి విషయం మాకు చెప్పాడు"

"మీ అమ్మాయిని గురించి కూడా రాశారా?"

"రాశారట... మీ అమ్మాయి వచ్చి చెప్పేవరకూ తెలీదు, మీ అమ్మాయి గురించి రాశారని"

"నేనూ అలాగే అనుకున్నాను, మా అమ్మాయిని గురించి మాత్రమే రాశారని. ఇప్పుడు నువ్వు చెప్పేవరకూ తెలీదు మీ అమ్మాయిని గురించి రాసినట్లు" అన్నాడు లింగరాజు.

"మీకు ఎవరిమీదయినా అనుమానం ఉందా?" అడిగాడు బలరామయ్య.

"ఉహూ... ఎవరిమీదా లేదు" అన్నాడు సుబ్బయ్య.

"ఇద్దరూ అమాయకులేనయ్యా. పనిగట్టుకొని మీ ఇద్దరి అమ్మాయిలమీద మాత్రమే ఎవరు రాస్తారు?" ధర్మసందేహం వెలిబుచ్చాడు బలరామయ్య.





"ఏమో... నాకేం తోచడంలేదు" అన్నాడు సుబ్బయ్య.

"మీకు ఈ ఊళ్లో విరోధులు ఎవరూ లేరా?"

"ఎవరున్నారు... ఎవరూ లేరే!"

"ఇప్పుడు కాదయ్యా మహానుభావా, మునుపు!" అన్నాడు బలరామయ్య.

"ఎప్పుడూ లేరు".

"సంజీవయ్య, దామోదరం లేరూ?"

"ఉన్నారు... లేక ఎక్కడికి పోతారు?" అన్నాడు సుబ్బయ్య అమాయకంగా.

"పోవడంగాదయ్యా, వాళ్లు ఒకప్పుడు మీ ఇద్దరికి విరోధులే గదా?"

"విరోధులు అనుకుంటూ ఉంటే విరోధులే, కాదనుకుంటే కాదు"

"ఎలా కాదనుకుంటాం! ప్రతివిషయంలోనూ ఎడ్డెం అంటే తెడ్డెం తెడ్డెం అంటే ఎడ్డెం అంటున్నారు గదా?" అన్నాడు లింగయ్య.

"అయితే ఇప్పుడేం చేద్దామంటారు?" అన్నాడు సుబ్బయ్య.

"చేసేదేముంది, దాడిచేయడమే. ఒకసారి గట్టిగా బుద్ధిచెబితే మళ్లీ ఇలాంటి పనులు చేయరు" అన్నాడు లింగరాజు పళ్లు కొరుకుతూ.

"ఉత్తరాలు వాళ్లే రాశారని ఎలా చెప్పగలం? రాసినందువల్ల వాళ్లకు ఏం లాభం?" అన్నాడు సుబ్బయ్య.

"వాళ్లూ సంబంధాలు చూస్తున్నారట. మన అమ్మాయిల్ని చేసుకోకపోతేగదా శ్రీనివాసులు వాళ్లు చూపించిన అమ్మాయిల్ని చేసుకొనేది" అన్నాడు బలరామయ్య.

"వాళ్లమీద దాడి చేసిన తరువాత ఉత్తరాలు వాళ్లే రాశారని నిరూపించలేకపోతే లోకులు ఏమంటారో?" సందేహం వెలిబుచ్చాడు సుబ్బయ్య.

"లోకులది ఏముందయ్యా, కాకులు! హతుని మీద సానుభూతి చూపే వాళ్లకంటే హంతకుని సమర్థించేవాళ్ల సంఖ్య ఎక్కువ! లోకులు గోడమీది పిల్లుల్లాంటివాళ్లు" అన్నాడు బలరామయ్య.

"ప్రస్తుత కార్యక్రమం చూడండి" అన్నాడు లింగరాజు.

"లోనికి వెళ్లి మాట్లాడుకుందాం పదండి!" అంటూ లేచాడు బలరామయ్య.

ముగ్గురూ లోపలికి వెళ్లారు.

భాగ్యమ్మ ముక్కు చీదుకుంటూ పైట కొంగుతో కళ్లు తుడుచుకుంటోంది.

"ఎందుకేడుస్తావమ్మా? ఏమయిందని? ఏవో నీలాపనిందలు వస్తుంటాయి" అన్నాడు బలరామయ్య ఓదార్పుగా.

"మీ అమ్మాయి మీదే కాదు, మా అమ్మాయి మీద కూడా రాశారమ్మా" అన్నాడు సుబ్బయ్య.

"చచ్చింది మేక!" అన్నాడు ఓ కుర్రాడు పులిగీత ఆడుతూ.

"కాదు... పులే చచ్చింది" అన్నాడు మరో కుర్రాడు మేకల్ని జరుపుతూ.

"కాదు... సంజీవయ్య చచ్చాడు" అన్నాడు మరో కుర్రాడు.

"కాదు... దామోదరం చచ్చాడు" అన్నాడు ఇంకో కుర్రాడు.

"అదేంటి బాబూ, సంజీవయ్యను, దామోదరాన్ని చంపేస్తున్నారు?" అడిగాడు వృద్ధుడు.

"మేం కాదు తాతయ్యా- లింగరాజు, సుబ్బయ్య చంపేస్తారట"

"ఎందుకు?"

"సంజీవయ్య, దామోదరం వారి కూతుర్లకు ఉత్తరాలు రాశారట"

"ఏమని రాశారట?"

"నీకు తెలీందేముంది తాతయ్యా, మగోళ్లు ఆడోళ్లకు ఏమని రాస్తారు?" అన్నారు కుర్రాళ్లు ముసిముసిగా నవ్వుతూ.

"సమాన వయస్కులయితే ప్రేమలేఖలు రాసుకున్నారంటే నమ్మవచ్చుకాని, మనుమరాళ్ల వయసున్న అమ్మాయిలకు ఏంరాస్తారు పాపం!"

"లేదు, తాతా, రాశారట! సంజీవయ్య సౌజన్యకు, దామోదరం శకుంతలకు రాశారట" అన్నాడు ఓ కుర్రాడు.

"రాయొచ్చు, ఏం రాశారో తెలుసా?"

"ఐ లవ్ యూ! అని రాశారట"

"నేను నమ్మను"

"నమ్మకపోతే పో... నీకు చెప్పడం మహాకష్టం!"

"రాస్తే చంపుతారటనా?"

"అవును తాతయ్యా, మిద్దెల మీద రాళ్లు పోశారట"

"రాళ్లెందుకు?"

"ఒక పార్టీ వాళ్లు దాడి చేస్తే మరో పార్టీ వాళ్లు తిప్పి కొట్టడానికి"

"ఎవడు చస్తే మనకెందుకు, నీ పులిని కదుపు చూద్దాం" అన్నాడు మేకలు వేస్తున్న కుర్రాడు.

★ ★ ★

"ఆడపిల్లల్ని గురించి రహస్యంగా వచ్చిన ఆరోపణల్ని రట్టుచేయడం ఆదర్శమా?" అన్నాడు ప్రకాశం.

"ఆదర్శమని ఎవరంటారు?" అన్నాడు వెంకటస్వామి.

"నిజాయితీపరుణ్నని తనకుతాను చెప్పుకుంటూ ఆదర్శాలు వల్లించే మన హిందీ టీచరు శ్రీనివాసులుకు సుబ్బయ్య కూతురు శకుంతల, లింగరాజు కూతురు సౌజన్య గురించి ఆరోపణలు చేస్తూ ఎవరో ఉత్తరాలు రాశారట. ఆ ఉత్తరాల్ని తన వద్ద రహస్యంగా దాచుకోవాలి లేదా అమ్మాయిల్ని పిలిపించి, ఉత్తరాలు చూపించి దండించాలి కాని, దండోరా వేసి అందరికీ తెలియచేసి అమ్మాయిల్ని అవమాన పాలుచేయడం మంచిదా?"

"దండోరా వేయించాడా?"

"నీలాంటి వెర్రి వెంగళప్పలు ఉండబట్టే అలాంటివాళ్ల ఆగడాలు సాగుతున్నాయి. దండోరా వేశాడంటే డప్పుకొడుతూ అందరికీ చెప్పాడనికాదు, రహస్యం బట్టబయలు చేశాడని"

"ఎవరికో తన సన్నిహితునికి చెప్పి ఉంటాడు. అతడు తన మిత్రునికి, ఆ మిత్రుడు మరో మిత్రునికి ఇలా తెలిసిపోయి ఉంటుంది అందరికీ. మనం మాత్రం మనకు తెలిసిన విషయం మన సన్నిహితులకు చెప్పమా?"

"అయితే శ్రీనివాసులు చేసింది చెడ్డపని కాదంటావు?"

"చెడ్డపని ఎలా అవుతుందిసార్? ఆయన

ఏంచేసినా విమర్శించడం అలవాటు చేసుకు న్నారు మీరు''

"పోనీలే... పండితత ద్వయం వ్యవహారం ఎంతవరకూ వచ్చిందంటావు?''

"అంటే?''

"నూతిలో కప్పలా ఉంటావయ్యా, బయటి విషయాలే పట్టించుకోవు''

"మీకు స్వంత విలేకర్లు ఉన్నారు కాబట్టి అన్నివార్తలు అందుతాయి''

"మన వాళ్లేనయ్యా, శ్రీనివాసులు, విమల మ్మ ఎప్పుడూ గుసగుసలాడుకుంటూ ఉంటా రు. నువ్వు గమనించావో లేదో?''

"ఇద్దరూ పండితులే కదా? ఏవో సాహిత్య విషయాలు, బోధనా సమస్యల గురించి మాట్లా డుకుంటూ ఉంటారేమో! మనకెందుకు వాళ్ల గొడవ'' అన్నాడు వెంకటస్వామి.

"నువ్వూ హెడ్మాష్టరు పార్టీలో చేరిపో తావా?''

"పార్టీలేమున్నాయి సార్? ఎవరి ఆస్తులు పోతున్నాయి పార్టీలు పెట్టుకొని పోరాడ్డానికి?''

"మంచీ-చెడూ ఆలోచించాలి గదా?''

"ఎందుకు ఆలోచించను. మీరు మంచిపని చేస్తే మీ మాట మాట్లాడతా'' ఇంకొకరు మంచి పనిచేస్తే వాళ్లమాట మాట్లాడతా!

"శ్రీనివాసులు ప్రభావం పనిచేసింది కద య్యా నీమీద!''

"ఒకరి ప్రభావానికి లోబడటానికి నాకు స్వంత బుద్ధిలేదేం సార్?''

"నిన్ను చేరదియ్యడం నాదే బుద్ధితక్కువ''

"పొద్దున్నే మీ ఇంటికి రావడం నాదే పొర పాటు- వెళ్తా సార్!'' అంటూ తిరిగి చూడ కుండా వెళ్లిపోయాడు వెంకటస్వామి.

★ ★ ★

ఊరంతా అట్టు ఉడికినట్టు ఉడికిపోతోంది. అటు లింగరాజు ఇంట్లో సుబ్బయ్య, బలరామ య్య, లింగరాజు కలసి మంతనాలు జరుపు తోంటే, ఇటు సంజీవయ్య, దామోదరం సంజీ వయ్య ఇంట్లో సమావేశమయ్యారు. లింగరాజు మిద్దెమీద, చుట్టుపట్ల మిద్దెలమీద కంకరరా ళ్లు పోసి సిద్ధంగా ఉంచారు. సంజీవయ్య మిద్దెమీద, చుట్టుపట్ల మిద్దెలమీద కూడా రాళ్లు పోసుకున్నారు.

వారుణీవాహిని పాకెట్లు, కల్లుసీసాలు, పెట్టె లు-పెట్టెలు దింపుతున్నారు. కర్రలు, వడిసె ళ్లు, బల్లేలు, గొడ్డళ్లు, కొడవళ్లు, నాటుబాంబు లు ప్రోగుచేసుకుంటున్నారు. బల్లేలు, గొడ్డళ్లు, కొడవళ్లకు పదునుపెడుతున్నారు.

తాగిన వాళ్లే తాగుతున్నారు, తిన్నవాళ్లే తింటున్నారు. గ్లాసుపక్కన పెట్టుకొని, "ముక్క లు లేనే లేవే!'' అన్నారు ముద్దముద్దగా ఓ మనిషి. వళ్లు తెలియని మత్తులో ఆకును కనుక్కోలేక నేల వెదుకుతున్నాడు ముక్కల కోసం.

"ఆకులో ఉన్నాయి చూడు, నేల వెదికితే ఎట్టా దొరుకుతాయి?'' అన్నాడు కాస్త కైపు తక్కువగా ఉన్న మరోమనిషి.

"ఒక్క ఏటుకే తల ఎగిరి అవతల పడాల...!''

"ఎవరి.. త..ల..?''

"సంజీవుగాని తల...!''

"సంజీవుగాన్ని... నూసుండా వా...?''

"నూడకపోతేనేం...?''

"ముక్కలేయ్.. పోయ్ సారాయి..!'' తోచిన ట్లు మాట్లాడుకుంటున్నారు పొరుగూరినుండి వచ్చిన కిరాయి గూండాలు.



ఊళ్లో జరుగుతున్న అలజడి గురించి ఆలో చించసాగాడు శ్రీనివాసులు. ఊరికి ఉపద్రవం తెచ్చింది తనేనా! తన ఉద్యోగమే ఊరికి మహమ్మారి అయిందా? ఉద్యోగం లేకపోతే

తనకు పెళ్లి అవునోకాదో తెలీదు కాని, ఉద్యోగం వచ్చిన మరునాటి నుండే బిడ్డనివ్వడానికి పోటీ పడుతున్నారు. అందుకే ఒకరికి తెలీకుండా మరొకరు సంబంధాలు చెడగొట్టడానికి ప్రయత్నించారు. ఆ ప్రయత్నంలో భాగమే ఉత్తరాలు.. ఈ ఉత్తరాలు వాళ్లే రాశారో లేక ఎవరయినా రాశారో తెలీదు. వాటి సాకుతో పాతకక్షలు తిరగదోడుకొని ఒకరిమీద ఒకరు కారాలు మిరియాలు నూరుతున్నారు. వాళ్ల కక్షలతో, కార్పణ్యాలతో ఎలాంటి సంబంధంలేని అమాయక ప్రజలు ఎప్పుడు ఏం ఉపద్రవం జరు



గుతుందోనని అరచేతుల్లో ప్రాణాలు పెట్టుకొని తల్లడిల్లిపోతున్నారు. ఉత్తరాల గురించి రామలింగానికి చెప్పకపోతే బావుండదేమో...! బాల్యమిత్రుడని, తన శ్రేయోభిలాషి అని, రహస్యం బయటపెట్టడని, తటాలున నోరుజారాడు. అదే తను చేసిన తప్పు. అందుకే ఇద్దరికి తెలిసిన విషయం రహస్యం కాదన్నారు. రహస్యం దాచుకోలేకపోవడం తన బలహీనత. కలం కత్తికంటే పదునయినది అన్నారు. ఇంత అలజడి సృష్టించిందీ కలమే! ఇది ఇంకా ఏ ప్రమాదానికి దారి తీస్తుందో...? చాలా మటుకు కిరాయిగూండాలే ఉన్నట్లుంది. కూలికి ఏడ్చేవాళ్లు ఎంతమాత్రం ఏడుస్తారు...? కడుపులో దుఃఖం ఉంటే కళ్లలో నీళ్లొస్తాయి... కిరాయి రౌడీలయినా చెయ్యిజారి పొరపాటున ఎవరినయినా చంపితే... దర్యాప్తు జరిగితే...? తీగలాగితే డొంక కదుల్తుంది.. మొదటి ముద్దాయి తనేనేమో..? ఎంతపని చేశాడు రామలింగం...? నోటి దురద ఉన్నవాళ్లంతా ఇంతే... అమ్మాయిలు ఏమనుకుంటారో...? 'ఎందుకు చెప్పారు?' అని అడిగితే, ఏం చెప్పాలి!... తనలోతాను ఆలోచిస్తూండగా దూరంగా శకుంతల, సౌజన్య కనిపించారు... అదో వస్తున్నారు.. బహుశా తనకోసమే వస్తూ ఉంటారు... ఎంత ప్రమాదం తెచ్చిపెట్టారని నిలదీస్తారు. ఏం చెప్పాలి? వాళ్లకు కనిపించకుండా ఇంట్లో దాక్కొంటే...! దాక్కుంటే మాత్రం వదులుతారా? గూండాల్ని పిలుచుకొని వచ్చి, తలుపులు బద్దలు కొట్టి ఇంట్లోకి రాలేరూ...? అప్పుడు అందరి ముందు చేతులు కట్టుకొని దోషిలా నిల్చోవద్దూ...? రానీ... వాళ్లతో మాట్లాడితే ఏదో తేలిపోతుంది. ఎవరయినా జోక్యం చేసుకొని ఇరువక్షాలకు నచ్చచెప్పి రైడింగు ఆపుచేస్తే మంచిది.. ఎవరు జోక్యం చేసుకుంటారు..? మునిగిపోయే వాళ్లమీదకి రాళ్లు విసిరి వాటిని పట్టుకొని పైకి రమ్మనే వాళ్లే ఎక్కువ... పోలీసు రిపోర్టు ఇస్తే...? ఎవరిస్తారు...? తనే ఇస్తే...? ఓంప్రపెట్టిన గాడిదవుతాడేమో...?

"నమస్కారంసార్?" అన్నారు శకుంతల, సౌజన్యలు ఒకేసారి.

"రండి... రండి...!" అన్నాడు నవ్వుతూ. ఉత్సాహంగా కనిపించాలని నవ్వాడు. అయితే అది నవ్వులా లేదు. అమ్మాయిల్ని కూచోమన్నాడు శ్రీనివాసులు. కింద కూచోబోయారు అమ్మాయిలు.

"వద్దు... వద్దు... కుర్చీలో కూచోండి" అన్నాడు.

"ఎందుకులెండి సార్"

"ఎందుకులెండి సార్!"

"కుర్చీలు లేకపోతే కింద కూచోవలసిందే తప్పదు. కుర్చీలు ఖాళీగా ఉంటే మీరు కింద కూచోవడం ఏం బావుంటుంది?"

కుర్చీల్లో కూచున్నారు ఇద్దరూ.

కాసేపు ఎవరూ మాట్లాడలేదు.

"స్కూలుకు వెళ్లలేదా సార్?" అంది సౌజన్య ఏం మాట్లాడాలో పాలుపోక.

"శనివారం కదా?" అన్నాడు శ్రీనివాసులు.

"అవును... వారాలే మరచిపోయాం" అంది శకుంతల.

మళ్లీ కాసేపు మౌనం రాజ్యం చేసింది.

"ఏవో ఉత్తరాలు రాశారట సార్?" అంది శకుంతల.

"ఎవరు చెప్పారు?"

"రామలింగం అన్నయ్య చెప్పారు"

"ఉత్తరాల కోసం వచ్చారా?" అన్నాడు శ్రీనివాసులు ముక్తసరిగా.

"ఎవరు రాశారో తెలునుకోవడానికి వీలు ఉందేమోనని" అంది సౌజన్య.

"ఎలా తెలుస్తుంది?" ప్రశ్నించాడు శ్రీనివాసులు.

"దస్తూరి చూసి తెలుసుకోవచ్చునేమో నన్న ఆశ" అంది శకుంతల.

"చూడండి ఇస్తాను" అంటూ లోపలికి వెళ్లి భద్రంగా బీరువాలో దాచిన ఉత్తరాలు తెచ్చి వాళ్లచేతికి ఇచ్చాడు శ్రీనివాసులు.

తీసుకొని చదివారు. వాళ్ల ముఖాల్లో రంగులు మారసాగాయి. కళ్లలో ఓ విధమయిన కాంతి కనిపించింది-- అంతలోనే కోపంతో కళ్లు ఎర్రబడ్డాయి.

"మీరు గమనించారా సార్?" అడిగింది శకుంతల.





"ఏమిటమ్మా?"

"రెండు లెటర్లు ఒకరే రాశారు"

అంతవరకు గమనించని శ్రీనివాసులు రెండు ఉత్తరాలు తీసుకొని పోల్చి చూశాడు. లోనికి వెళ్లి మరో ఉత్తరం తెచ్చి వాటితో సరిచూశాడు. మూడు ఉత్తరాలు ఒకరే రాశార న్న విషయం ముగ్గురూ గమనించారు.

"అది ఎవరికి రాశారు సార్?" అడిగింది సౌజన్య.

"నాకే రాశారమ్మా!"

"అది ఎవరి కొంప కూల్చడానికి రాశారు?" అంది శకుంతల.

"ఆ వివరాలతో పనిలేదు. ఎవరు రాశారో తెలుసుకోగలిగితే జరగబోయే అఘాయిత్యం ఆగిపోవచ్చు" అన్నాడు శ్రీనివాసులు.

"ఇంటికి వెళ్లి డిసైడు చేయాలి సార్!" అంది సౌజన్య.

"అలాగే చేయండమ్మా!"

"వెళ్తాం సార్!" అంటూ లేచారు శకుంతల, సౌజన్య.

"కాఫీ కూడా తాక్కుండా వెళ్తారా?"

"కాఫీ కూడా తాగాలని అనిపించడం లేదు సార్. రాత్రింబవళ్లు ఇదే వ్యాపకం" అంది శకుంతల.

"అయితే వెళ్లిరండి. రాసిన మనిషి ఎవరో తేలిపోతే నిరపరాధుల బలి ఆగిపోతుంది"

వెళ్లడానికి లేస్తూ ఉండగా సంజీవయ్య, దామోదరం వచ్చారు. అమ్మాయిలు వెళ్లిపో యారు.

"కూచోండి బాబాయ్" అన్నాడు శ్రీనివాసు లు.

"పెను తుఫాను వచ్చింది నాయనా" అన్నా డు సంజీవయ్య కుర్చీలో కూర్చుంటూ.

"ఎలాంటి తుఫాను అయినా అలాగే ఉంటుందా, తగ్గిపోతుంది"

"తగ్గిపోయేలోగా ఎన్ని కొంపలు, ఎన్ని పంటలు మునిగి పాడయిపోతాయో" అన్నాడు దామోదరం.

"చూడు బాబూ... అర్థంపర్థంలేని కార్పణ్యా లుగదా? ఎవరో జాబులు రాస్తే మామీద దాడి చేయడానికి సిద్ధం కావడం తాతాచార్లకు పీర్ల పండగకు సంబంధంలాంటిదే గదా" అన్నా డు సంజీవయ్య ఆవేదనగా.

"పల్లె రాజకీయాలన్నీ అలాగే ఉంటాయి చిన్నాన్నా పార్టీ ప్రణాళికతోగాని, సిద్ధాంతాలతో గాని వాళ్లకు పనిలేదు. ఎల్లయ్య దేవుని పార్టీ అయితే మల్లయ్య దయ్యం పార్టీ." అన్నాడు శ్రీనివాసులు.

"అనవసరంగా మమ్మల్ని రంగంలోకి దింపడం బావుందా?" అన్నాడు దామోదరం.

"ఈ ప్రమాదం నుండి బయటపడే ఉపాయం లేదా బాబూ?"

"తాగి తందనాలు ఆడే వాళ్లను దూరంగా ఉంచి, మీరు సహనంతో వ్యవహరించడమే"

"వాళ్లు తరుముకొని వస్తూ ఉంటే మేం భయపడి ఎన్నాళ్లని దూరుకుంటాం?"

"రెండుచేతులు కలవ కుంటే శబ్దం రాదు గదా?"

"ఆధ్యాత్మిక చింతన ఉన్నవాళ్లకే ఓర్పులేక పోతే పామరులం మాకు ఎలా ఉంటుంది శీనూ?" అన్నాడు సంజీవయ్య.

"ఈరోజు సాయంత్రానికి తేలిపోవచ్చు"

"ఏంతేలిపోతుంది?" అడిగాడు దామో దరం అసహనంగా.

"మా ఇంటికి వచ్చిన శకుంతల, సౌజన్యల ను చూశారు గదా? వాళ్లు ఉత్తరాలు తీసుకొని వెళ్లారు. అవి ఎవర్రాశారో తేల్చేస్తారట"

"మేమూ ఉత్తరాల కోసమే వచ్చామే?" అన్నాడు సంజీవయ్య.

"ఉత్తరాల్తో ఏంపని?" ప్రశ్నించాడు శ్రీనివా సులు.

"ఏంరాశారో చూద్దామని"

"మీరు చూసే ఉత్తరాలు కాదులెండి... ఎవరో కుర్రకుంకలు చిలిపిగా రాసిన రాత లు"

"ఇప్పుడు ఏంచేద్దామంటావు మరి?" అడి గాడు సంజీవయ్య.

"స్వామి వద్దకు వెళ్దాం"

"ఎందుకు?"

"ఉన్న విషయం చెబుదాం- తన శిష్యు లకు నచ్చజెప్పి శాంతింప జేస్తారేమో చూద్దాం"

"వెళ్దాం... తప్పేముంది!" అన్నాడు దామోదరం.

"ఎప్పుడు వెళ్దాం?" అడిగాడు సంజీవయ్య.

"ఇప్పుడే వెళ్తే స్వామి పూజలో ఉంటారేమో, పన్నెండు గంటల తరువాత వెళ్దాం" అన్నాడు శ్రీనివాసులు.

"అలాగే... నువ్వు మా వద్దకు వస్తే ముగ్గురం కలసి వెళ్దాం." అంటూ సంజీవయ్య, దామోదరం లేచి వెళ్ళిపోయారు.

శ్రీనివాసులు 'ఆలోచనా స్రవంతి మళ్ళీ ప్రవహించసాగింది. విమలమ్మమీద రాసిన ఉత్తరం రామలింగానికి చదివి వినిపించకపోవడం నా అదృష్టం. లేకపోతే ఆమెకూ చెప్పి ఏదో రాద్ధాంతం సృష్టించేవాడే. ఏంచేసినా ఆమె ఏంచేస్తుంది పాపం? ఎవరికి చెప్పుకుంటుంది? అందరూ ఉండి కూడా ఎవరూ లేనట్లు అందరికీ దూరంగా, ఒంటరిగా ఉంది. ఆమె రహస్యం తెలిసినవాణ్ణి నేను ఒక్కణ్ణే. మరి ఆమెను గురించి ఎవరు రాసినట్లు...

మొత్తంమీద మూడు ఉత్తరాలూ ఒకరు రాసినవే. ఆమెను గురించి ఈ ప్రాంతంవాళ్లకు ఎలా తెలుసు? ఊహించి రాసి ఉంటారా? అంతే- ఊహించి రాసినదే! విమలమ్మ అన్యుళ్ళృణ్ణి చేసుకుందని, భర్త వదిలేశాడని రాశారు.

ప్రేమించింది, పెళ్లిచేసుకోవాలనుకున్నదీ వాస్తవమేకాని, పెళ్ళి మాత్రం చేసుకోలేదని చెప్పింది. ఆమె మాట నిజమా లేక ఉత్తరంలోని సమాచారం వాస్తవమా...? ఆమె ఒకసారి మోసపోయింది. అందువల్ల తననూ నమ్మడంలేదు. ఎలా నమ్ముతుంది...? ఒకసారి కాలిన లాంతరు ముట్టుకోవాలంటే ఏమీ తెలీని చిన్నపిల్లలు కూడా వెనుకాడతారు. అన్నీ తెలిసిన విమలమ్మ... అందులోనూ ఒకసారి మోసపోయిన మహిళ... మళ్ళీ అదే జాతిని... మోసగించే జాతిని... అంటే మగవాణ్ణి ఎలా నమ్ముతుంది?

పెళ్ళివిషయంలో తనూ ఓ నిర్ణయానికి రావలసిందే. ఈ అవాంతరాలకు, అలజడులకూ మూలం తన పెళ్ళే.

లింగరాజు తన కూతుర్ని ఇవ్వాలని గట్టి ప్రయత్నం చేశాడు. అతని ఆస్తిమీద ఆశపడి తప్పక చేసుకుంటాననుకున్నాడు. అమ్మాయి అందగత్తేకాక గుణవంతురాలు కూడా. అయితే కట్నకానుకలు, లాంఛనాలు ఇచ్చి మంచి అల్లుణ్ణి తెచ్చుకునే స్తోమత లింగరాజుకు ఉంది.

సౌజన్యతో పోలిస్తే ఆస్తివిషయంలో శకుంతల తక్కువే. సౌజన్యకు తనమీద మనసు ఉన్నట్లు అనిపించదు. శకుంతలకు మాత్రం తనమీద మనసు ఉన్నట్లు తెలియజేసే ఘట్టాలు కొన్ని ఉన్నాయి. అప్పుడప్పుడూ సరసంగా సంభాషించింది. శృంగారచేష్టలు కూడా చేయకపోలేదు. అయినా తను అవకాశం ఇవ్వలేదు. పూర్వబంధుత్వం కూడా ఉంది. అమ్మాయి తండ్రి కూడా తనను అల్లుణ్ణి చేసుకోవడానికి అవిశ్రాంతంగా ప్రయత్నించాడు.

విమలమ్మ గతచరిత్ర అయోమయంగా ఉంది. ఆమె గత చరిత్ర తెలిసినవాళ్ళు ఎవరూ చేసుకోరు. వీళ్ల ముగ్గురి మీదా ఆరోపణలు చేశారు. తన కారణంగా విమలమ్మకు కళంకం రాలేదు కాని శకుంతలకు, సౌజన్యకు తన గురించే మాట వచ్చింది. ఉత్తరాలు రాసిన పెద్దమనిషి ఎవరో తేలిపోతే వాళ్లమీద చేసిన ఆరోపణలు అడుగంటిపోతాయి. ఆ తరువాతే నిర్ణయించుకోవడం మంచిది ఎవరిని చేసుకోవాలన్న విషయం!

-పంచాయతీ ఎన్నికలనాటి వాతావరణం లింగరాజుకు జ్ఞాపకం వచ్చింది ఈనాటి పరిస్థితులు చూస్తుంటే.

"అవతలి పార్టీ అభ్యర్థి ఓటరుకు రెండు సారా పాకెట్లు సప్లయి చేస్తున్నాడు" అన్నాడు తాగే ప్రతి ఓటరూను.

తను మూడు పాకెట్ల వంతున ఇచ్చాడు.

ప్రత్యర్థి కైమా పెడుతున్నాడంటే తను కోడి బిరియానీ పెట్టాడు.

ప్రత్యర్థి ఒక్క ఓటుకు పది రూపాయలిస్తానంటే తను పదిహేను ఇచ్చాడు.



ఎలా అయితేనే ఎన్నికల్లో గెలిచి పరువు నిలుపుకున్నాడు.

ప్రస్తుతం దాడికి సిద్ధం అవుతున్న గూండాలు సారా తాగుతున్నారు. కల్లు తాగుతున్నారు. పొట్టేలు కూర తింటున్నారు. కోడి బిరియాని తింటున్నారు. కోరిన తిండి పెడుతున్నాడు తను. ఆరోజు సాయంత్రం సంజీవయ్య ఇంటి మీద దాడి చేయడానికి ఏర్పాట్లన్నీ సిద్ధంచేసుకున్నారు. పైకి నిర్భయంగా గంభీరంగా, కనిపిస్తున్నా ఏం జరుగుతుందోనని లోలోపల భయపడుతున్నారు. ఆందోళన పడుతున్నారు లింగరాజు, సుబ్బయ్యలు. బలరామయ్య మాత్రం ప్రోత్సహిస్తూనే ఉన్నాడు. పదును పెట్టిన ఆయుధాలు తళతళ మెరుస్తున్నాయి. ప్రత్యర్థి జీవితంలో మళ్ళీ కోలుకోకుండా దెబ్బ తీయాలన్న ప్రయత్నం. కత్తులు, కటార్లు, కర్రలు, బల్లేలు, నాటు బాంబులు, సైకిలు చైన్లు, కారం పొట్లాలు, కావలసిన సామగ్రితో తయారవుతున్నారు.

''అమ్మాయి పిలుస్తోంది'' అన్నారు ఎవరో లోపలినుంచి. లింగరాజు లోపలికి వెళ్ళాడు. సుబ్బయ్య. బలరామయ్య వరండాలో కుర్చీల్లో కూచొని మాట్లాడుకుంటున్నారు.

''సుబ్బయ్యా!'' పిలిచాడు లింగరాజు లోపలికి వెళ్ళిన అయిదు నిమిషాలకు.

సుబ్బయ్య లోనికి వెళ్ళాడు. ఇద్దరూ గుసగుసలాడారు.

''అ... అలాగా...?'' అన్నాడు సుబ్బయ్య ఆశ్చర్యంగా. లింగరాజు మాట నమ్మలేకపోతున్నాడు సుబ్బయ్య.

''అవునా అమ్మా!'' ప్రశ్నించాడు అమ్మాయిన్ని.

''అవును నాన్నా ఆయనే రాశాడు'' అంది శకుంతల.

''శ్రీనివాసులు వద్దకు వెళ్లారా?''

''వెళ్లాం నాన్నా... ఇదో ఉత్తరాలు కూడా తెచ్చాం''

''మంచిపని చేశారు. మబ్బులు విడగొట్టారు''

కాసేపు రహస్యమంతనాలు జరిపారు లింగరాజు - సుబ్బయ్య. తనను పిలవకుండా ఇద్దరే ఏంమాట్లాడుతున్నారోనని తనలోతను మధన పడసాగాడు బలరామయ్య.

లింగరాజు, సుబ్బయ్య వరండాలోకి వచ్చారు.

''బయల్దేరదామా బావా?'' అన్నారు ఇద్దరూ ఒకేసారి.

''ఊఁ బయల్దేరదాం'' అన్నాడు బలరామయ్య.

''బయల్దేరండి మరి...'' అన్నాడు లింగరాజు గూండాలకేసి చూస్తూ.

అందరూ లేచి ఆయుధాలు తీసుకున్నారు.

''అవన్నీ అవసరంలేదు'' అన్నాడు లింగరాజు.

''ఆయుధాలు లేకుండా వెళ్ళి వాళ్లతో దెబ్బలు తిందామా?'' అన్నాడు వాళ్లలో ఒక వ్యక్తి.

''కొత్త ఆయుధాలు తెప్పించాం పదండి' అన్నాడు సుబ్బయ్య.

అందరూ బయల్దేరారు. ముందు లింగరాజు, సుబ్బయ్య. బలరామయ్య నడుస్తున్నారు. జనమంతా వాళ్లను అనుసరిస్తున్నారు.

ఇళ్లలో ఉన్నవాళ్ళు వాకిళ్ళు వేసుకొని, బిక్కుబిక్కుమంటూ కిటికీలగుండా చూస్తున్నారు.

నేరుగా షేవింగు సెలూన్ వద్దకు వెళ్ళి నిల్చున్నారు.

మంగలి భయంభయంగా చూడసాగాడు వాళ్లకేసి. అతనికేసి చూసిన లింగరాజుకు చేతులు జోడించి నమస్కారం పెట్టాడు మంగలి.

''మా బావగారికి షేవింగు చెయ్'' అన్నాడు లింగరాజు బలరామయ్యకేసి చూస్తూ.

తనకు మాత్రమే షేవింగు చేయమని లింగరాజు ఎందుకు చెబుతున్నాడో బలరామయ్యకు అర్థంకాలేదు.

''పద బావా... కుర్చీలో కూర్చో'' అన్నాడు సుబ్బయ్య.

''ఇప్పుడెందుకు?'' అన్నాడు బలరామయ్య.

''అవసరం ఉందిలే కూచో' అన్నాడు




లింగరాజు.

తటపటాయిస్తూ వెళ్ళి కుర్చీలో కూచున్నాడు బలరామయ్య.

"తిరుపతి గుండులా నున్నగా గొరుగు" అన్నాడు లింగరాజు.

"వద్దు... వద్దు..." అంటూ లేవబోయాడు బలరామయ్య.

చెరో రెక్క పట్టుకొని కూచోబెట్టారు లింగరాజు, సుబ్బయ్య.

జనమంతా వింతగా చూస్తున్నారు.

"ఊc కానీ..." అంటూ గద్దించారు లింగరాజు, సుబ్బయ్య వెనుకముందులాడుతున్న మంగలితో. గడ్డం, మీసం, మీసంతోబాటు తల కూడా గొరిగాడు వణుకుతున్న చేత్తో. చెయ్యి వణకడం వల్ల అక్కడక్కడ గాట్లు పడ్డాయి.

బలరామయ్య సెలూన్ మెట్లు దిగి కిందికి వచ్చేసరికి గాడిదను పట్టుకొని వచ్చారు. బలరామయ్య గింజుకుంటున్నా వినకుండా గాడిద మీద కూచోబెట్టారు తాగిన జనం.

ఎవరో సున్నం తెచ్చి నామాలు పెట్టారు బలరామయ్యకు.

గాడిద ముందు నడుస్తోంది. అందరూ దానివెంట నడుస్తూ కేరింతలు కొడుతున్నారు. భయానక వాతావరణం హాస్యంగా రూపుదిద్దుకుంది. ఆకస్మికంగా జరిగిన మార్పు ఎవరికీ అర్థంకాకపోయినా అందరూ హాయిగా ఊపిరి పీల్చుకున్నారు. అంతవరకూ వాకిళ్ళు వేసుకొని ఇళ్లలో దూరుకున్న జనం వాకిళ్ళు తెరుచుకొని మెల్లమెల్లగా బయటికి రాసాగారు. ఇళ్లలోని జనం గుంపులో చేరడంతో పెద్ద ఊరేగింపులా అయింది. ఆ గుంపు అలా సంజీవయ్య ఇంటివేపు వెళ్లసాగింది.

హడావిడిగా ఇంట్లోకి వచ్చిన రామలింగాన్ని చూసి- "ఏమిటా గోల?" అన్నాడు దామోదరం.

"ఊరేగింపు" అన్నాడు రామలింగం ఉత్సాహంగా.

"ఊరేగింపా?" అన్నాడు సంజీవయ్య ఆశ్చర్యంగా.

"అవును." అన్నాడు రామలింగం.

"ఇప్పుడేం ఊరేగింపు?"

"బలరామయ్యను గాడిదమీద ఊరేగిస్తున్నారు"

"ఎందుకూ?" అన్నాడు శ్రీనివాసులు ఆశ్చర్యంగా.

శ్రీనివాసులుతో మాట్లాడ్డానికి కాస్త సంకోచించాడు రామలింగం.

"ఏంటోయ్... మాట్లాడవేం?" ప్రశ్నించాడు శ్రీనివాసులు.

"నీకు ఉత్తరాలు రాసింది ఆయనేనట. ఆ విషయం తెలిసి బలరామయ్యకు గుండు గీయించి, నామాలు పెట్టి, గాడిద మీద ఊరేగిస్తున్నారు"

"వీళ్ళు ఇక మారరు" అన్నాడు స్వామి వెంకటానందులు బాధగా.

"మబ్బులు విడిపోయాయి. ఇక ఊహాగానాలకు తావులేదు" అన్నాడు సంజీవయ్య ఆనందంగా.

"ఆడపిల్లలమీద వచ్చిన ఆరోపణలు తొలగిపోయినట్లేకదా స్వామీ?" అన్నారు హెడ్మాష్టరు.

"అవునండీ, తొలగిపోయినట్లే గదా!"

"ఇక విమలమ్మకు పెళ్ళిచేయడానికి అభ్యంతరం లేదుగదా?" అన్నాడు హెడ్మాష్టరు.

ఇంతలో ఊరేగింపు సమీపించింది.

సరాసరి సంజీవయ్య ఇంటి ముందుకు వచ్చింది ఊరేగింపు.

"మిత్రద్రోహి బలరామయ్య!"

"ముర్దాబాద్"

"అభినవ శకుని బలరామయ్య"

"నశించాలి"

నినాదాలతో ప్రతిధ్వనించింది ఆ ప్రాంతమంతా.

నేరుగా ఇంట్లోకి వస్తున్న లింగరాజు, సుబ్బయ్యలను సాదరంగా ఆహ్వానించాడు సంజీవయ్య. స్వామిని చూసి వినయంగా నమస్కరించారు లింగరాజు, సుబ్బయ్య.

"ఏమిటి లింగరాజు, బలరామయ్యకు

ఇంత కఠిన శిక్ష విధించారే?'' అన్నాడు స్వామి.

''తగిన శిక్ష విధించాం స్వామీ'' అన్నారు సుబ్బయ్య, లింగరాజులు.

''విషయమంతా తెలుసుకున్నాను. కాని, అపకారికి కూడా ఉపకారం చేయాలిగదా మన సిద్ధాంతం ప్రకారం''

''నరే స్వామి, చేయాల్సిందే. మేం కాదనడంలేదు. అయితే ఇతనికి ఇలాంటి శాస్తి చేయకపోతే అనవసరంగా మా కుమార్తెలమీద వచ్చిన ఆరోపణలు ఎలా మాసిపోతాయి స్వామి?'' అన్నాడు లింగరాజు.

''అతణ్ని అవమానిస్తే వచ్చిన చెడ్డపేరు పోతుందా?''

''ఎందుకుపోదు స్వామీ... బలరామయ్యను గాడిదమీద ఎందుకు ఊరేగిస్తున్నారు, ఏంత ప్పు చేశాడు? అని అడుగుతారుగదా జనం! ఫలానావారి మీద అబద్ధ ఆరోపణలు చేసి శ్రీనివాసులకు ఉత్తరాలు రాశాడట, అందుకు ఇలా బుద్ధి చెప్పారు అంటారు జనం''

''అయినా ఈ పనిచేయడం అన్యాయమయ్యా! దిగండి బలరామయ్యగారూ!'' అన్నాడు స్వామి.

గాడిదమీదినుండి దిగి తలవంచుకొని, స్వామి కాళ్లమీదపడి కన్నీటితో కాళ్లు కడిగాడు బలరామయ్య. బలరామయ్యను లేవనెత్తి కూచోబెట్టి-

''అందరూ కూచోండి'' అన్నాడు స్వామి.

అందరూ కూచున్నారు.

''ఆరోజు మన సంఘసమావేశంలో మీరు ఓ మాట అన్నారు జ్ఞాపకం ఉందా లింగరాజుగారూ?'' అడిగాడు స్వామి.

ఆలోచించసాగాడు లింగరాజు.

''దిక్కులేనివారికి పెళ్లిచేయాలన్నావుగా?''

''అవును స్వామీ అన్నాను''

''చేద్దామా మరి?''

శకుంతలను భుజంగానికి ఇచ్చి చేద్దామంటారేమోనని సందేహంగా చూడసాగాడు సుబ్బయ్య.

''ఎవరికి స్వామీ?'' ప్రశ్నించాడు లింగరాజు.

''దిక్కులేనివారికి''

''వాళ్లే స్వామీ ఎవరు?''

''శ్రీనివాసులు దిక్కులేనివాడేకదా?''

శ్రీనివాసులు దిక్కులేనివాడని, పెళ్లిచేద్దామా అని అంటున్నాడు స్వామి. పెళ్ళికూతురు ఎవరో? నిన్నటినుండి స్వామి సంజీవయ్య ఇంట్లోనే మకాం వేసినట్లు ఉన్నారు. సంజీవయ్య స్వామిని బాగా కాకాపట్టినట్లుంది. తను తెచ్చిన సంబంధం చేయడానికి పథకం సిద్ధంచేసుకున్నాడు. ఇన్నాళ్లూ మేం వేసిన ఎత్తులు, పైఎత్తులు వృథా అయిపోయాయి. ఇద్దరు పోట్లాడుకుంటే మూడోవానికి లాభం అన్నారు పెద్దలు. అలాగే అయింది. ఎలాగయితేనేం చివరికి సంజీవయ్యే గెలిచాడు. తను ఓడిపోయాడు... అనుకున్నాడు లింగరాజు.

''ఏమయ్యా మాట్లాడవు?'' రెట్టించాడు స్వామి.

''అవును స్వామీ... దిక్కులేని వాడే''

''విమలమ్మ కూడా దిక్కులేని అమ్మాయేనట''

''ఏమో నాకు తెలీదు స్వామీ!''

''ఈ రెండురోజులూ అన్నీ తెలుసుకున్నానయ్యా! అరిషడ్వర్గాలి ప్రభావంవల్ల మీరు బయటి ప్రపంచాన్ని మరిచిపోయారు''

''నరే స్వామీ... మీఇష్టం''

''నా ఇష్టంకాదయ్యా దిక్కులేనివాళ్లకు పెళ్లి చేయాలన్న సమస్య ప్రతిపాదించింది మీరే. వీళ్లిద్దరూ దిక్కులేనివాళ్ళే కాబట్టి పెళ్లిచేద్దాం'' అంటూ జనంవేపు చూసి- ''ఏమండీ మీ అభిప్రాయం చెప్పండి'' అన్నాడు స్వామి.

''చేద్దాం స్వామీ'' అన్నారు అందరూ ఏకగ్రీవంగా.

''స్వామీ వెంకటానందులకు'' అంటూ చెయ్యెత్తాడు సంజీవయ్య.

''జై'' అన్నాడు లింగరాజు అందరితోబాటు.

చిరునవ్వు చిందించారు స్వామీజీ.








# చతుర ప్రపంచం

## స్టాంపు కథ

ఇప్పటికి ఖచ్చితంగా 24 సంవత్సరాల క్రితంమాట. ఆరోజు జనవరి 26, 1965. న్యూయార్క్ నగరం నుండి రానున్న బోయింగ్ 707 విమానం కోసం ఎందరో అధికార, అనధికార ప్రముఖులు లండన్ విమానాశ్రయంలో ఎదురుచూస్తున్నారు. ఇంతలో విమానంరానే వచ్చింది. పత్రికా విలేకర్లు, ఫొటోగ్రాఫర్లు, న్యూస్‌రీల్ తీసే సిబ్బంది అంతా విమానం చుట్టూ గుమికూడారు. ఇంతకీ ఆ విమానంలో వస్తున్నది ఎవరనుకున్నారు? ఓ తపాలా బిళ్ల. దాని విలువ ఒక్క సెంట్ మాత్రమే. ఆ



తపాలా బిళ్ళని ప్రయాణానికి ముందు రెండు లక్షల పౌనులకు భీమా చేయడం కూడా జరిగింది. అతి కట్టుదిట్టమైన రక్షణతో ఆ తపాలా బిళ్లను తెచ్చే వ్యక్తిని భద్రంగా తమ వెంట తీసుకుపోయారు అధికార్లు.

అసలు కథ ఏమంటే-

ఒకప్పుడు బ్రిటన్‌లోని వాటర్‌లూ అండ్ సన్స్ కంపెనీవారే బ్రిటీష్ గయానా దేశానికి అవసరమైన తపాలా బిళ్లలను ముద్రించేవారు. కానీ 1856లో ఏవో అనివార్య కారణాల వల్ల వాటర్‌లూ కంపెనీ పంపిన స్టాంపులు గయానా దేశానికి చేరలేదు. దాంతో పోస్టేజి స్టాంపులు లేక అక్కడి ప్రజలు గోలెత్తిపోసాగారు. ఆ పరిస్థితుల్లో గయానాలోని ఓ పోస్ట్‌మాస్టరు పైఅధికారుల అనుమతితో ఓ ప్రైవేట్ ప్రెస్‌లో 4 సెంట్లు విలువ గల తపాలా బిళ్ళను ముద్రింపించాడు. అనంతరం వాటన్నింటిని దేశంలోని వివిధ పోస్టాఫీసులకి పంపించాడు. అయితే ముద్రణా సమయంలో పొరపాటున ఓ స్టాంపు మీద 'నాలుగు సెంట్ల'కు బదులు 'ఒక సెంట్' అని ముద్రపడింది. హడావిడిలో సదరు పోస్ట్‌మాస్టర్ ఆ పొరపాటును గమనించలేదు. పోస్టేజి స్టాంపులు సమృద్ధిగా లభించడంతో ప్రజలు కూడా చల్లబడ్డారు.

అది జరిగిన 17 సంవత్సరాలకి స్టాంపుల్ని సేకరిస్తున్న గయానా దేశపు యువకునికి ఆ ఒక్క సెంట్ స్టాంపు దొరికింది. అప్పటికే అదెంతో మాసిపోయి ఉంది. అయినప్పటికీ ఆ

యువకుడు పదిలంగా దాన్ని తన ఆల్బమ్‌లో దాచుకున్నాడు. కానీ ఓ రోజు డబ్బు అవసర మై ఆరు షిల్లింగులకి దాన్ని అమ్మేశాడతను. అలా అలా చేతులు మారుతూ ఆ స్టాంపు ఫ్రాన్స్, ఆస్ట్రేలియా వంటి దేశాలు చుట్టి అమె రికా చేరుకుంది. ఇంతలో ఈ స్టాంపు చరిత్ర తెలుసుకున్న బ్రిటిష్ అధికారులు దాన్ని తిరిగి సంపాదించి లండన్ ప్రదర్శనశాలలో వుంచేందుకు కట్టుదిట్టమైన ఏర్పాట్లతో న్యూ యార్క్‌నుంచి విమానంలో తెప్పించారు. ఆ స్టాంపుకి ఇంత చరిత్ర వుందిగనుకే విమానాశ్ర యంలో ఆనాడంత రద్దీ ఏర్పడిందని చెప్పుకో వచ్చు.

అయినా అది అక్కడా నిలవలేదు. అనేక ప్రభుత్వ కారణాలవల్ల తిరిగి మళ్ళీ దేశ సంచారం మొదలెట్టింది. ఆమధ్య 1970లో కాబోలు న్యూయార్క్ నగరంలోనే దాన్ని వేలం వేస్తే సుమారు 21 లక్షల రూపాయల మేరకు ఓ అమెరికన్ దాన్ని పాడుకున్నాడు. కేవలం ఒక్క సెంటు విలువగల ఆ స్టాంపు 1970లోనే 21 లక్షల రూపాయలు పలికిందంటే ప్ర స్తుతం దాని ధర ఇంకెంత పెరిగిపోయిందో ఎవరు చెప్పగలరు?

## భవనం మిస్టరీ!

ప్రజలతోపాటు పోలీసులకి, శాస్త్రజ్ఞులకీ కూడా ఇంగ్లాండ్‌లోని పురాతన రాజభవనం మిస్టరీ అయికూర్చుంది. బార్నెట్‌లోనున్న ఆ భవనా



న్ని అమ్మకానికి పెట్టినపుడు అది దయ్యాల కొంప అనీ, అందులో ప్రవేశించినవారు తిరిగి రారని పుకార్లులేచాయి. అయితే అదంతా కేవలం పుకారు మాత్రమేనని ఆ భవనాన్ని అమ్మకానికి పెట్టిన 45 ఏళ్ల క్లిన్ వాదించాడు. కొనుగోలుదార్లనమ్మకం కోసం అతడు ఓ రోజు అందరూ చూస్తుండంగా ఆ భవనంలోకి ప్రవే శించాడు. అంతే! మళ్లీ ఆయన జాడతెలియ లేదింతవరకూ. దాంతో కొనుగోలు దార్లలో అల జడి చెలరేగింది. పోలీసులు, శాస్త్రవేత్తలు భవ నమంతా గాలించినా అతని ఆచూకీ తెలియ రాలేదు. దయ్యాలే అతన్ని మాయం చేశా యని ఆ భవనాన్ని నిశితంగా పరిశీలించి, పరిశోధించి నిర్ధారించాడు ఫిలిప్ కార్క్ అనే శాస్త్రవేత్త.

అయితే ఇదంతా వట్టి బూటకమనీ, గయ్యాళి పెళ్లాంతో వేగలేక క్లిన్ తాను తప్పించుకుపోవడానికి ఈ అవకాశాన్ని విని యోగించుకున్నాడని కొందరంటున్నారు. కాని కొనుగోలు దార్లు మాత్రం ఈ విషయాన్ని అంగీకరించడం లేదు. పెళ్లాంతో సరిపడక పోతే అతను విడాకులు తీసుకుంటాడేతప్ప ఇలా ఎందుకు చేస్తాడని వారివాదన. అదీగాక ఇలాంటి సంఘటనలు గతంలో నాలుగైదు జరిగాయిగదా వాటికి కారణం ఏమై ఉంటుందీ? అనివారు నిలదీస్తున్నారు. ఏమైన ప్పటికీ ఆ భవనం ఇప్పటివరకూ అమ్మకం కాకుండా అలాగే ఉండిపోయింది.





# గ్రహాంతరవాసుల దురాగతం?



పది మిలియన్ల కాంతి సంవత్సరాల దూరాన ఉన్న వస్తువుల్ని కూడా పరిశీలించగల అత్యంత శక్తివంతమైన టెలిస్కోప్‌ని అమెరికాలోని గ్రీన్‌బాంక్ సిటీలో నెలకొల్పారు. 300 అడుగుల ఎత్తున బలిష్ఠమైన ఇనుపస్తంభాల మీద అమర్చిన ఆ టెలిస్కోప్ ప్రపంచంలోనే అతిపెద్దదిగా గణనకెక్కింది. అయితే అత్యంత ఆశ్చర్యకరంగా 1985 జూన్ 8న అంతరిక్షంలో నుంచి వచ్చిన కొన్ని శక్తివంతమైన కిరణాల కారణంగా అది నేలకూలిపోయింది. కనీసం గాలి, వానా కూడా లేని రోజున పేకమేడలా అది హఠాత్తుగా కూలిపోవడం, అది తప్ప ఆ చుట్టుప్రక్కల గల అన్ని వస్తువులు చెక్కుచెదరకుండా ఉండిపోవడం శాస్త్రజ్ఞుల్ని ఆశ్చర్యంలో ముంచెత్తింది.

తమకదలికల్ని దానిద్వారా గమనిస్తామనే భయంతో గ్రహాంతర వాసులెవరో కావాలనే ఈ దురాగతానికి పాల్పడి ఉంటారని డాక్టర్ నాథన్ అభిప్రాయపడుతున్నారు. గ్రహాంతర వాసుల ఉనికిపై అనేకానేక పరిశోధనలు చేసిన డాక్టర్ నాథన్ "శాస్త్రసాంకేతిక పరిజ్ఞానంలో మనకంటే ఎంతో ముందంజలోనున్న గ్రహాంతరవాసులు అత్యంత శక్తివంతమైన కిరణాల్ని ప్రయోగించి ఓ పథకం ప్రకారం మన టెలిస్కోప్‌ని నాశనం చేశారు. దీన్ని బట్టి మన కదలికల్ని వాళ్ళు క్షుణ్ణంగానే పరిశీలిస్తున్నారని మనం భావించవచ్చు" అంటారు. ఏమైనా ఈ టెలిస్కోప్ అర్థాంతరంగా కూలిపోవడం వల్ల చాలా నష్టం కలిగిందని అమెరికా శాస్త్రజ్ఞులూ, ప్రభుత్వమూ బాధపడ్తున్నాయి. "కష్టపడి ఒకవేళ మనం మళ్ళీ నిర్మించినా దాన్ని మాత్రం కూల్చరని గ్యారంటీ ఏమిటి?" అని ప్రశ్నిస్తున్నారు డాక్టర్ నాథన్. దీన్నిబట్టి గ్రహాంతరవాసులు ఉన్నారన్న మన నమ్మకం తప్పదేమో!

# భాషాప్రపంచం

ప్రపంచం మొత్తంమీద ఆరువేలకు పైగా భాషలున్నప్పటికీ నిత్యవాడకంలో వున్నవి వీటిలో కేవలం 2,700 మాత్రమే! భారతదేశం విషయాని కొస్తే ఇక్కడి ప్రజలు 1652 భాషల దాకా మాట్లాడుతున్నారు. కాని వీటిలో 105 భాషలు మాత్రమే ఓ మోస్తరు భాషలుగా గుర్తింపు పొందాయి. మనరాజ్యాంగం మాత్రం 15 భాషలనే అధికార భాషలుగా గుర్తించింది. దేశం మొత్తానికి హిందీని జాతీయ భాషగా నిర్థారించినప్పటికీ, మళ్ళీ ఏ రాష్ట్రానికారాష్ట్రం వేరువేరు ప్రాంతీయ భాషల్ని తమ అధికార భాషలుగా ఏర్పాటు చేసుకొన్నాయి. గమ్మత్తేమంటే గుర్తింపు పొందిన సింధీ, సంస్కృతం, కాశ్మీరి భాషలు మాత్రం ఏ రాష్ట్రానికీ అధికార భాషలు కాకపోవడం. తుళు, కొంకణి భాషలకు లిపిలేదు. ఆ భాషల్ని కన్నడ లిపిలోనే రాస్తారా ప్రజలు. భారతీయ భాషలన్నింటిలో అతి పురాతనమైనదిగా తమిళాన్ని చెబుతారు. మనదేశంలో ఎన్నో భాషలున్నా నాగాలాండ్ మాత్రం ఇంగ్లీమనే తన అధికారభాషగా స్వీకరించడం చెప్పుకోదగ్గ విషయం.

ఇలా ఇంగ్లీషు భాషని అధికారభాషగా ప్రపంచం మొత్తంమీద 60 దేశాలువాడుతున్నాయి. రష్యాలో 150 భాషలకు పైగా వాడుకలో ఉన్నా వాటిలో సగానికి పైగా లిపి లేకుండానే ఉన్నాయి. మనదేశం తర్వాత ఎక్కువ భాషలున్న దేశంగా పాపువాన్యూగిని



యాని చెబుతారు. ఆ దేశంలోని 700 గ్రామాలకు 700 భాషలున్నాయట. ఒక గ్రామం వారి భాష మరో గ్రామంలో అర్థం కాదు. అలా ఉంటే "మా భాషగొప్పంటే మాభాష గొప్పది" అంటూ ఉద్యమాలు చెలరేగే అవకాశమూ ఉంది.. అందుకే ఆ గొడవలేవీ లేకుండా ఉండాలని ఆఫ్రికనులు ఇంగ్లీషునే తమ అధికార భాషగా చేసుకున్నారు. ప్రతిదేశానికీ ఒక అధికారభాష ఉండడం సహజం కాని స్విట్జర్లాండ్‌లో మాత్రం అలాకాదు. స్విస్ భాషనే ఎక్కువమంది ప్రజలు మాట్లాడుతున్నప్పటికీ అక్కడ ఫ్రెంచి, ఇటాలియన్, జర్మనీ, రోమన్ భాషలు కూడా బాగా వాడకంలో ఉన్నాయి. అంచేత ఆ దేశం ఈ భాషలన్నింటినీ అధికార భాషలుగా గుర్తించింది.

ఇక ప్రపంచం మొత్తం మీద వేగంగా మాట్లాడగలిగిన భాష ఒక్క ఫ్రెంచి మాత్రమే నట! ఆ భాషలో నిముషానికి 350 మాటలకు పైగా పలకవచ్చునని అంటారు. అతి తక్కువ పదాలుగల భాషగా హవాయి భాష పేరుతెచ్చుకుంది. ఆ భాషలో కేవలం డజనంటే డజనే పదాలు మాత్రమే ఉన్నాయట. రష్యాలోని కొందరు భాషా పరిశోధకులు పరిశోధించి పరిశోధించి ఈ వివరాలన్నింటినీ ఇటీవలే వెల్లడించారు.

## డబ్బుతప్ప మరేదీ దొరకని స్వర్గం!

లక్షలార్జించవచ్చుననే ఉద్దేశంతో వేలాది మంది భారతీయులు ఏటా సౌదీఅరేబియాకు తరలిపోవడం మనందరికీ తెలుసు. లక్షల సంగతి ఎలా ఉన్నా ఆ దేశనిబంధనలకి, అక్కడి జీవనవిధానానికి అలవాటు పడడం అంత తేలికైన విషయంకాదు. అక్కడ బ్రాందీ, విస్కీ, రమ్ వంటి మత్తుపానీయాల మ్మే షాపులెక్కడా ఉండవు. చివరికి ఫైవ్‌స్టార్ హొటల్స్‌లో కూడా ఇవి లభించవు. వీటికి సంబంధించిన ప్రకటనలు కూడా ఏ పత్రికా ప్రచురించేందుకు అక్కడి ప్రభుత్వం అనుమతించదు.

తెల్లారిలేస్తే పేపర్లలో వారఫలాలు, దినఫలాలు చూసుకోవడం, జాతకాలు చెప్పించుకోవడం మనవాళ్లలో చాలామందికి అలవాటు. అలాంటివన్నీ అక్కడ నిషిద్ధం. ఏ పత్రికలోనూ అలాంటి శీర్షికలు కలికానికి కూడా కన్పించవు. ఇక మనం ఎక్కువగా కోరుకునే సినిమాలు, డ్రామాలు అక్కడ అసలే ఉండవు. ఆ దేశంలో సినిమాహాళ్లు, నాటకశాలలు, స్టూడియోలు ఎక్కడా మచ్చుకి కూడా కన్పించవు. వీటి మీద నిషేధం లేనప్పటికీ ఈ తరహా వినోదవ్యాపారాల్ని చౌకబారు పనులుగా అక్కడి ప్రజలు భావిస్తారు.

మనదేశంలోలా అక్కడ వడ్డీవ్యాపారాలు, తాకట్టు వ్యవహారాలు ఉండవు. అప్పులు ఇవ్వడం పుచ్చుకోవడం రెండూ నిషిద్ధం. ప్రభుత్వం "పొదుపు చేయండి, ఫలానా బ్యాంకులో డిపాజిట్ చేస్తే ఎక్కువ వడ్డీ లభి





స్తుంది'' వంటి ప్రకటనల్ని సైతం అనుమతించదు. కోర్టులు కూడా ఈ తరహా సివిల్ కేసుల్ని విచారించవు.

ప్రపంచానికి ఉత్తమమైన రేసుగుర్రాల్ని సరఫరా చేసే సౌదీలో గుర్రప్పందాలు లేవు. పేకాటలు, లాటరీలు, జూదాలు అక్కడ ఉండవు. అలాగే అక్కడ విగ్రహారాధన ఉండదు. రథోత్సవాలు, ఊరేగింపులు మొదలే ఉండవు. స్మశానాలకి కూడా ఖననానికి తప్ప మరెందుకూ వెళ్లకూడదు. వర్ధంతుల సందర్భంగా సమాధుల మీద పుష్పగుచ్ఛాలు, దండలు ఉంచడం, నివాళులర్పించడం వంటి కార్యక్రమాల్ని అక్కడ ప్రభుత్వం అంగీకరించదు. అదీగాక స్థలాభావం వల్ల కొన్ని నెలలో, సంవత్సరాలో గడిచాక ఒక శవాన్ని ఉంచిన సమాధిలోనే మరో శవాన్ని ఉంచాల్సి ఉంటుందక్కడ. తాయత్తులు ధరించడం అక్కడ నిషిద్ధం. మంత్రవిద్యలు, క్షుద్రవిద్యలు ఉపాసించేవారికి మరణదండన తప్పదు.

అమ్మాయిలు, అబ్బాయిలు కల్సి చదివే కో-ఎడ్యుకేషన్ స్కూళ్లు అక్కడ ఉండవు. స్త్రీలు గడపదాటాలంటే బురఖా ధరించాల్సిందే! అమ్మాయిల్ని సేల్సుగరల్స్‌గా ఏ షాపులోనూ నియమించరు. ప్రకటనలకు మోడలింగ్ చేసే అమ్మాయిల్ని క్షమించరు. ఈ లెక్కన సెక్స్ ఫొటోలు, అమ్మాయిల శృంగార భంగిమలు ఉండే పత్రికలు అక్కడ దొరకడమనేది అసంభవమే! అందువల్ల డబ్బు తప్ప ఏ సుఖమూ దొరకని స్వర్గంలా మనం ఆదేశాన్ని అభివర్ణించవచ్చు ఏమంటారు?

# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 2. | Periodicity of its Publication | : Monthly |
| 3. | Printer's Name | : **RAMOJI RAO** |
| | Whether citizen of India | Yes |
| | If foreigner, state the country of origin | – |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 4. | Publisher's Name | : **RAMOJI RAO** |
| | Whether citizen of India | Yes |
| | If foreigner, state the country of origin | – |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 5. | Editor's Name | : **RAMOJI RAO** |
| | Whether citizen of India | Yes |
| | If foreigner, state the country of origin | – |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 6. | Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital. | : **VASUNDHARA PUBLICATIONS** 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |

**I, RAMOJI RAO,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS.**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 1991.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad. Tel: 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd No.

# అల్పాహారానికి ప్రియ తోడు - అద్వితీయమైన రుచులు జోడు!

ఎప్పుడైనా, ఎక్కడైనా... ప్రియ!

ఉదయం, మధ్యాహ్నం, రాత్రి -
ఏ వేళప్పుడయినా సరే,
అల్పాహారం, భోజనం, ఉపాహారం - ఏదైనా సరే,
ఇంటా బయటా - ఎక్కడైనా సరే,
ప్రియ పచ్చళ్లుంటేనే అది బహురుచికరం!

నవకాయ పిండి వంటలెన్నున్నా
ప్రియ పచ్చళ్లతోనే భోజనం పరిపూర్ణం!

మీ పళ్లెంలో ప్రియ ఉంటేనే మీకు
సంతృప్తి సంతుష్టి!!

**ఎంతో రుచి... ఎంతో రుచి...**

# ప్రియ

మామిడి • నిమ్మ • గోంగూర • అల్లం • టొమాటో
పండుమిరప • పచ్చిమిరప • మిక్స్‌డ్ వెజిటబుల్.
పచ్చళ్లన్నీ వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ లభిస్తాయి.






ఉషోదయ
ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్
(ప్రియ ఫుడ్స్ డివిజన్)
ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడా, హైదరాబాదు -500 482.